శ్రీ

# స్వయంప్రకాశ ప్రబోధము

## ప్రథమ భాగము




గ్రంథకర్త:

అక్కిరాజు చంద్రమౌళి శర్మ

రు. 3-0-0.

# కవి పండితాభిప్రాయములు

కింకవీంద్ర ఘటాపంచాననాది బిరుదాంచిత శతవధాని

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు

శ్రీమత్పర దేవతాయైనమః.

## స్వయం ప్రకాశ ప్రబోధము

ఆయీపొత్తము చరిత్రాత్మకము. అక్కిరాజు చంద్రమౌళి కవిగారు తమ ప్రపితామహునికి సంబంధించిన కొన్నివిషయములు క్రోడీకరించి విరచించిరి. ఈయన కవిత్వము చాల ధారాళమైన ధార కలదియును మిక్కిలి మృదువైనదియు నగుటయేకాక తఱచు లోకోక్తులతో నిండియుండును. లేనిపోని మాఱుమూల పదాలతో పద్యపూర్తి చేయుట యీయన శైలికాదు. సర్వసాధారణముగా నాబాలగోపాలముగా మాటలాడు ధోరణిలోనే మాటికిఁ దొంబది పద్యములీయన రచనలో నుండును. అట్లని వ్యావహారికముగా రచన లోని భాషయుండదు. లాక్షణికముగనే యుండును. ఈకాలములో నీయనవంటి కవులు మృగ్యులని చెప్పనొప్పు.

ఉ. తిన్నది జీర్ణమౌను, పలుదిక్కులకేగఁ బనేమి, కూటికా,
యున్నది, వండిపెట్టఁగల యోపికయున్నది భార్యకింకఁ జే
లున్నవి, తోఁట, దొడ్డి, పసులున్నవి, అన్నిటికన్న మిన్నగా
నున్నవి నీ పదాంబుజము లోడకుమంచు రమా మనోహరా.

నేను మొట్టమొదట వీరికవిత్వము విన్నది యిదే పద్యము. ఈయన ధారసర్వమును నిదేశైలిలో నుండును.

ఈమాదిరి ధార యెవ్వరికోగాని యలవడదు. వీరివంశము కవితా వంశము. నిన్నమొన్న స్వర్గమలంకరించిన ఉమాకాంతకవి గారు వీరికి ప్రేలు విడిచిన సోదరుఁడే. చంద్రమౌళి ఉమాకాంతుఁడు

లోనగు వీరి నామధేయములంబట్టి యీ వంశస్థులు శివభక్తులని తోఁచుచున్నది. నాకీకవివతంసుని ధార నచ్చినట్లీకాలపుఁ గవులలో నెందఱిధారలు నచ్చునో చెప్పవలసివచ్చుచోఁ గొంత ఆలోచ నీయమే. ఈ కవితల్లజునకు శ్రీ మత్పరమేశ్వరి సర్వథా శ్రేయః ప్రదాత్రియై దీర్ఘాయువొసంగి యిట్టి కబ్బములనేకములు రచింపఁ జేయుఁగాక. 1—5—45

వెం॥ శా॥ శతావధాని. క్షీరసాగర బిల్డింగు,
బెజవాడ కృ॥ డి॥

---

కవిసమ్రాట్టు బ్రి॥ విశ్వనాథ సత్యనారాయణగారు
బెజవాడ
౭—5—45.

మహారాజశ్రీ అక్కిరాజు చంద్రమౌళికవిగారు తాము రచించిన స్వయంప్రకాశపరిబోధములో ననేక భాగములు నాకు చదివి వినిపించి నాయందొక యవ్యాజానురాగము ప్రకటించిరి. వారి కవిత్వము ఒక గంగాప్రవాహము. యతిప్రాసల సహజమైన యీ దొరలుట ఆ మాటలపొందిక; యిదియొక సహజమైన తేనెకాలువ. వీరి కవిత విన విన తొలినాటి యాంధ్రనియోగుల తెలుగు సరస్వతి మరల సాక్షాత్కరించినట్లున్నది.

ఆంధ్ర నియోగులు తెలుగు కవితను పుట్టించినవారు. పెంచినవారు. సంస్కృతము వాడినచో నది తెలుగనిపించునట్లువాడుట వారికే తెలియును. ఈ కవిగారి కవితలో ననేకసంస్కృత శబ్దములు కలవు. కాని అవి చదువుచుండగా సంస్కృతమని తెలిసికొనలేము. అన్నిటినిమించి యీ పూర్వాంధ్ర నియోగులభక్తి జ్ఞానవైరాగ్యభావములకు వ్యక్తీకరణమైనవారి తెలుగు కైతలోని వలపు శ్రీ చంద్రమౌళికవిగారి రచనలోనను మూర్తీభవించి మమ్మార్తులఁ గనిపించుచున్నది. వీరికి నాయందుగల ప్రేమకు చాల కృతజ్ఞుడను.

విశ్వనాథ సత్యనారాయణ.

అవధాని శిరోమణి, మహోపాధ్యాయ,

మధ్వ శ్రీ కాశీ కృష్ణాచార్యులు గారు.

శ్రీ లక్ష్మీహయగ్రీవో విజయతే॥

ఉ. పొల్లొకఁడేని లేక రసపుష్టికి లోపము రాక జాజులన్
జల్లినరీతి నా మదికి సంతసమందఁగఁ జేసెనయ్య నీ
యల్లిక; చంద్రమౌళి కవి హంస వతంసమ! యాంధ్రదేశమం
దెల్లెడలం బ్రసిద్ధిఁగను మెంతయు మెచ్చితిఁ బద్దెమిచ్చితిన్.

5—7—45
గుంటూరు.

కాశీ కృష్ణాచార్య.

---

మహాకవి బ్ర॥ కాటూరి వేంకటేశ్వరరావుగారు

[ కృష్ణాపత్రికా సంపాదకులు, మచిలీపట్టణము ]

శ్రీ అక్కిరాజు చంద్రమౌళిశర్మగారు రచించిన స్వయం ప్రకాశ ప్రబోధమనే గ్రంథం వారిముఖతః వినే భాగ్యంకలిగింది. శ్రీ శర్మగారిది పండితవంశం. తెలుగు కవులకు పుట్టినిల్లయిన పల్నాడు వారి జన్మభూమి. కావ్యవస్తువు వారి వంశానికి వన్నెదెచ్చిన యతీశ్వరులది. కనుక గ్రంథ ప్రాశస్త్యం వేరే చెప్పనక్కరలేదు. గంగాప్రవాహం వంటి ధారలో ముద్దైన తెలుగు పలుకుబళ్లూ, నేటికీ పల్నాటిలో జీవించి యున్న లోకోక్తులూ, పూర్వ మహాకవుల మార్గములూ, అడుగడుగునా వీనులకు విందులుపెట్టుచూ చమత్కృతి కలిగిస్తూ వున్నవి. కావ్యశిల్పంలో, కథచెప్పటలో, శర్మగారికి చక్కని నేర్పుగలదు. సర్వవిధాలా శిరోధార్యమైన కవిత్వం శర్మగారిది.

కాటూరి వేంకటేశ్వరరావు,
7—8—47.

—:o:—

శ్రీః

జగద్గురు : శ్రీ కల్యాణానంద భారతీమాన్తాచార్యస్వామివారి

# ( ఆ శీ స్సు )

అస్మదత్యన్త ప్రియాన్తేవాసులు, గుంటూరుజిల్లా గుత్తికొండ గ్రామ కాపురస్థులు. శాలంకాయన గోత్రోద్భవులు, శ్రీ అక్కిరాజు చంద్రమౌళిశర్మగారు తాము రచించిన 'స్వయం ప్రకాశ ప్రబోధమ' ను నాంధ్ర పద్యకావ్యమును ఈ సాయంకాలమునందు శ్రీ చరణ సన్నిధి యందు విపులముగ వినిపించిరి. ఇందు ధర్మప్రబోధము చక్కని యాఖ్యాయికలతో సర్వజనరంజకముగ నుండునట్లు పలువిధములుగ మృదుమధుర శైలితోడను,గవితా నైపుణ్యముతోడను, జేయఁబడినది. ఆఖ్యాయికలు వినుటయందుఁగాని చదువుటయందుఁగాని శ్రోతలకును జదువరులకును నుత్సాహముప్పొంగుచు నంతరంగమున నానందము గలుగుననుటకు సందియమించుకేనియు లేదు. గ్రంథముయొక్క సరస తయుఁ గవిత్వ పరిపాటియు సత్కవులు సుకరముగ గ్రహించి యానంద మును బొందఁగలరు. ఇట్టి కావ్యమువలన నెల్లరును జక్కని ప్రయోజ నమును బడయఁగలరు. ఈ కావ్యముమూలముననీ కవితల్లజునియొక్క యశస్సు ఆచంద్రతారకముగ నలరారుఁగాత మని నారాయణస్మర ణము గావించుచున్నారము.

శ్రీ విద్యాశంకర భవనము,
గుంటూరు.
శ్రీవిరోధివత్సర కార్తీక శుక్ల
ద్వితీయ భానువారము
23-10-1949.

ఇతి నారాయణస్మృతిః

జగద్గురు : శ్రీ కల్యాణానంద
భారతీమాన్తాచార్యస్వామి.

---

మద్రాసు విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు
విద్యారత్న: శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు

# కృతి ప్రశంస

ఆద్యతనకాలమున నాంధ్రవాఙ్మయమున వెలువడిన ప్రశస్త పద్యకృతులలో శ్రీ అక్కిరాజు చంద్రమౌళిశర్మగారు రచించిన స్వయంప్రకాశప్రబోధము ప్రథమశ్రేణిలో లెక్కింపఁదగినది. చంద్రమౌళిశర్మగారు సరసకవితాసంపన్నులు. దానికి తోడు బంగారమునకు పరిమళమబ్బినట్లు కథావస్తువు వారి ప్రపితామహుని పవిత్ర జీవిత గాథ. ప్రాచీనసంస్కృతి, సనాతనధర్మము, ఆస్తికత పరిచ్యుతిచెందిన ఈ కాలములో శ్రీ చంద్రమౌళిశర్మగారు సర్వజన సులభగ్రాహ్యమై, రసవత్తరమైనరీతిని, కర్మ భక్తి జ్ఞాన వైరాగ్య విశేషములు తెలుఁగు ప్రజలలో నాటుకొనునట్లుగా నీకృతిని, రచియించి ధన్యులైనారు. ఈ నాడిట్టి కృతులు సాంఘికశ్రేయోఽభివృద్ధి కత్యంతావశ్యకములు.

ఇక నీకృతియం దెచ్చటఁ జూచినను తెలుఁగు ముద్ర యచ్చుగుద్దినట్టుల మెచ్చు గొల్పు చున్నది. తులలేని, వెలలేని, తెలుఁగు పలుకుబడికి నెలవగు పలనాటివారు చంద్రమౌళిశర్మగారు— కావున నిందలి కవిత తులలేనిదైనది. తెలుఁగున వెలసిన తొలికృతి మహాభారతమునకు వలె నిందును ఆదిపర్వము, తపోవనపర్వము, మొదలుగా పర్వముల పేర్లుండుట ప్రశంస్యము.

నే నీగ్రంథము నామూలాగ్రముగఁ జదివితిని. మహాభారతమున శాంతి ఆనుశాసనిక పర్వములవలె ప్రబోధపర్వమున పూర్వోత్తరఖండములు రెండును నలరారుచున్నవి. అందులో నుత్తరఖండము రసవత్తరముగానున్నది.

కృతి భారతము వంటిది. కవిత భాగీరథి వంటిది. చంద్రమౌళిశర్మగారి కృతి, ధర్మప్రబోధము గావించి వాఙ్మయ ప్రపంచమున స్వయంప్రకాశమై విలసిల్లుగాత—.

మదరాసు,
5—3—1955.

నిడుదవోలు వేంకటరావు,
విద్యారత్న.

అభినవవాగనుశాసన
శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు

మహాతపశ్శాలియు భక్తిజ్ఞానయోగ నిష్ఠుఁడునైన నిజవంశపురుషోత్తముని మహిమ యొకింత యావిష్కరించు నెపమున శ్రీ అక్కిరాజు చంద్రమౌళి కవిగారు వేదవేదాన్త వేద్యమగు ప్రబోధమును "స్వయంప్రకాశప్రబోధ" మను పేరఁ బ్రకాశింపఁజేసి చరితార్థులైరి.

చదువనారంభించిన పాఠకుని హృదయమును తుదముట్ట జదువ నాకర్షించునను టకంటె నీ కావ్యమందలి విషయమిట్టిదని వేఱుగాఁ బ్రశంసింపఁబని లేదు. మనోహరములైన చిన్న చిన్న కథలతోఁ డి యిందలి యన్ని ప్రకరణములును చదువ నింపుపుట్టించునవే కాని యందును, గురూపదేశ ప్రబోధపర్వములు మఱియు మృదుమధురరచనోల్లసితములు. భావరంజకములు. శ్లాఘ్యములు :

చిరంజీయాదియంకృతిః

ధవళేశ్వరము,
14—2—1955.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రి,
రిటైర్డు లెక్చరర్, ఆంధ్ర యూనివర్సిటీ.

---

ఒంగోలు వేదశాస్త్ర పాఠశాల ప్రధానోపాధ్యాయులు
బ్ర॥ శ్రీ॥ పిశుపాటి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

గీ॥ పూర్వ కవి సంప్రదాయ మపూర్వరచన
శ్లేష యమకాది వర్ణనల్ చెలఁగుకతన
సంతసముఁ గూర్చె బుధులకు చంద్రమౌళి
కవి వతంసుని సత్కృతి గౌరవంబు.

క. జిలిబిలి పలుకుల నేరిచి
వెలయించిన వాఁడ వీవు వేదాన్త మహా
ఫలసార మక్కిరాట్కుల
తిలకమ! నీ గ్రంథమహిమ తెలుపఁగ వశమే!

తెనాలి,
9-5-49

ఇట్లు
పిశుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి

బృందావన పురమందు 20—8—47 తేదీన గావింపబడిన పౌరసన్మాన సభలో
సభాధ్యక్షులు, సదస్యులైన కవిపండితులు, ఒసంగిన

## కృతిప్రశంసా పద్యములలో కొన్ని మచ్చుతునకలు

సభాధ్యక్షులు "వాగ్గేయకారరత్న" బ్ర॥ శ్రీ॥ హరినాగభూషణము బి. ఏ. గారు

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

మ॥ సమజస్మంబగు నీ కవిత్వమది భాస్వత్స్వప్రకాశ ప్రబో
ధమునాఁ గావ్యము సృష్టిసల్పె నల పోతన్న న్స్మరింపంగఁ జే
యు మధుస్రావ పదార్థసంపదలు లోకోక్తు ల్గు బాళింపఁ ద్వ
త్సములీ కాలమునందు మృగ్యులు కవీంద్రా! చంద్రమౌళీ! బళీ!

ఉ॥ నీ కవనంపుధార యల నిర్జరసింధు ఝరీప్రసారమా
పాకము తేనె సోనల కపక్వరుచిం దలపించునట్టిదా
పోకడ లల్లరీతు లలవుం దలపు న్మఱపున్ ఘటించు సుశ్లోకతఁ
జంద్రమౌళి కవిశూలి! యితోధిక శ్రేయ మొందుమా! ॥

గీ॥ శ్రోత్రియుండ వవృజినుండ వాత్రివర్గ
యుతి నకామహతుండవై స్తుతికి నెక్క
వాఁడ వౌటఁ బరానంద భావమొదవ
గబ్బమును వ్రాసి శాశ్వత ఖ్యాతిగంటి

బందరు
20_8_1947

ఇట్లు,
హరినాగభూషణము.

బందరు హిందూకాలేజి సంస్కృతాంధ్ర పండితులు

బ్ర॥ శ్రీ॥ కుప్పా శ్రీఆంజనేయ శాస్త్రి గారు

గీ॥ తీయని మాటలుం దనివి తీరని భావము జానుతెన్గు జా
తీయము లెందు నేనియు శ్రుతి స్మృతి పద్ధతి కెంతమాత్ర వెన్
దీయని మార్గమున్ వెలసి తేరుటఁ బూర్వకవిత్వధాటి వెన్
దీయును చంద్రమౌళి కవితీర్థుని ధాటికి మాటిమాటికిన్.

బందరు
20_8_1947

ఇట్లు
కుప్పా శ్రీఆంజనేయ శాస్త్రి.

బ్ర॥ శ్రీ॥ గురుజాడ రాఘవశర్మ గారు
స్వయంప్రకాశ ప్రబోధప్రశంస



సీ॥ బమ్మెరపోతన్న బంధువా యేమి! యా
తండె పల్కినట్లుండు నడుమ నడుమ.
శ్రీనాథకవి నీకుఁ జేరువచుట్టమా
పలనాటి సామెతల్ కలయఁజిమ్మ
పెద్దన్న యొరవడి పెట్టినాడా నీకు
క్రొల్లురుకుచును పోకిళ్ళు పోవ
నన్నయ తిక్కన లన్న మోమోటమా
తాత పోల్కిని బల్కి యూఁత గొనఁగ

గీ॥ గొప్పవాఁడొక డున్న నే కొలను నందు
విట్టిపీగెదరయ్య యా విధము కాక
అందఱందఱు బందుగులయ్యె నింత
మన్ననగఁ బల్కుదువె చంద్రిమౌళి సుకవి!

ఉ॥ తేట తెనుంగునన్ మిగులఁ దియ్యగ తేనెలువాఱు నాఁటి ప
ల్నాటి కవిత్వపున్నడలు నాటెఁగదయ్య మనంబులోన నీ
నాఁటికి నీకృతమ్మున వినన్ వినవయ్యెగ నీకెవారికన్
సాటిల చంద్రిమౌళి కవిచంద్ర! యనర్గళ వాక్సుధారలన్.

మచిలీపట్టణము,
20—8—1947.

గురుజాడ రాఘవశర్మ.

# బందరు పౌరుల సన్మానపత్రము

గుంటూరుజిల్లా గుత్తికొండ వాస్తవ్యులును, స్వధర్మానుష్ఠాననిష్ఠాగరిష్ఠులు నగు

## బ్రహ్మశ్రీ అక్కిరాజు చంద్రమౌళి శర్మ

కవివతంసులకు సమర్పించిన సన్మానపత్రము

కవిశేఖరా!

తాము రచించిన "స్వయంప్రకాశప్రబోధము" అను గ్రంథములోని కొన్ని ఘట్టములను వినిపించి సభ్యుల నానందవార్ధి నోలలాడించితిరి. పూర్వ కవులను మరల స్మృతిపథమునకు దెచ్చు మీ కవితారీతి మిక్కిలి శ్రవణ పేయము. సుప్రసిద్ధులగు ఆంధ్రకవులచే మన్నన పొందిన మృదుమధుర ద్రాక్షా పాకమువలె జాలువారు మీ కవిత్వము విని యానందించుభాగ్యము మాకు కూడ లభించినది. ధన్యులము. సహజగంగా ధారవలె ప్రవహించిన మీ యాంధ్రకవితాధార యసామాన్యముగా మీ కమరిన యీశ్వర ప్రసాదము.

ఆ ధారాశుద్ధి ఆ పోకడ వీనులవిందై తేనె కాలువ ప్రవహించు మీ మాటలపొందిక-వినియే యానందింపవలె-వర్ణింప శక్యముగాదు. మీ రెడ తెగక కుప్పలు కుప్పలుగా గుప్పు తెనుఁగు సామెతలు పలునాటిలో నింకను నిలిచి మిగిలిన చక్కని తెనుఁగు వన్నెచిన్నెల బెళుకు లివన్నియు మీ కవితా కన్నెకు మంచి యలంకారములు.

భక్తి జ్ఞాన వైరాగ్య భూమికలను యథా తథముగా ప్రదర్శింపక మామూలు గృహస్థవ్యవహారములలో కథలలో జానపద సామెతలలో మేళవించి ప్రబోధించు మీ కుశలత సంస్తవనీయము. తెలుఁగు కన్నెకు క్రొంగ్రొత్త వన్నె లమరించిన మీ శక్తి యసమానము. కథావస్తువు సేకరించుటలోను, కథనుసొగసుగానడపుటలోను మీది అందెవేసినచేయి. గ్రంథమా—"స్వయంప్రకాశప్రబోధము." కవితయందలి కథావస్తువుకూర్పు, నేర్పు, నిజముగా స్వయంప్రకాశముగా నున్నవి.

ఆంధ్రభాషావధూటికి సమర్పించిన స్వయంప్రకాశ మెల్లెడ త్వరలో ప్రకాశించి యాంధ్రుల తరింపజేయుగాక. అట్టి మంచిగ్రంథముల నింకను రచించి యాంధ్ర భారతి కలంకారములు గూర్చెదరని యాశించుచున్నాము.

బందరు,<br>
20-8-47

ఇట్లు<br>
బందరు పౌరులు.

కవయిత్రి శ్రీమతి గుడిపూడి ఇందుమతీ దేవి గారు

గీ॥ తలఁప నీ చంద్రమౌళి బుధవరు కవిత
నక్కరకురాని యక్కర మొక్కటియును
లేదు తియ్యందనము బాసి పోదు విషయ
తతికిఁ జౌరనీదు గంభీరతం దలగదు
భావ ముడివోదు మృదువాక్య పటిమ సెడదు.

గీ॥ గర్వ మెఱుఁగఁడు తొందర గాన డెందు
నిత్య సంతుష్టితో నుండు నిండు కుండ
వోలె తొణకఁడు కోపంబు జోలి బోడు
ఘనుఁడు నీ చంద్రమౌళి సత్కవివరుండు.

విజయవాడ,
23—7—1949.

ఇట్లు,
గుడిపూడి ఇందుమతీ దేవి.



# పీ ఠి క

'స్వయంప్రకాశప్రబోధము' అనెడి ఈ కావ్యమునందలి ఇతి వృత్తము శ్రీ స్వయం ప్రకాశానంద యతీశ్వరుని జీవిత చరిత్ర అని చెప్పదగును. కాని, సాధారణముగా జీవిత చరిత్రలో కానవచ్చు నిరుపయోగ సూక్ష్మాతి సూక్ష్మ వివరము లేవియు లేక, ప్రతిపాద్య వస్తు ప్రాధాన్యమును లక్షించి చరిత్రాంశములను ప్రపంచించిన గ్రంథము గనుక, ఇది కావ్యమైనది.

కావ్యమనగానే శృంగార ప్రధానమే అయియుండ వలెనని గాని, అష్టాదశ వర్ణనాత్మకమై యుండవలెననిగాని అను కొనరాదు. అట్టి యాలంకారిక నియమములు ఈ కాలమున చెల్లవు. ఈ నాడే కాదు, ఆ నియమముల యధికారము చెల్లు దినములలో కూడ వానిని ఉల్లంఘించిన మహాకవులు చాలమంది కలరు. నాడుగాని, నేడుగాని, అట్టి యుల్లంఘనము చేయుట శాస్త్రవాక్య ధిక్కారణ కుతూహలము వలన కాదు, మరియేమన, తాము స్వీకరించిన ఇతి వృత్తము అంగీకరించి నంత వరకే రసపోషణముగాని, వర్ణనా చిత్రణముగాని జరుగుటయే ఉచితమని ఆ కవులు శాస్త్రకారులకు విధేయ నమస్కారములు చేసియే తమ మార్గమును తామనుగమించిరి. నిజమరసినచో ఇతి వృత్తము, తద్రచన, వినుటకు చదువుటకు ఇంపుగా నుండు నేని, ఆ గ్రంథమును లక్షణముతో సమన్వయింప చేయవలెనని ఎవరును తలపెట్టరు. ఒక వేళ అట్టి సమన్వయమే కావలయు నెడ ఈ లక్ష్య గ్రంథమును సమన్వయించు లక్షణ గ్రంథములు లేకపోవు. కాబట్టి శ్రీ అక్కిరాజు చంద్రమౌళిశర్మగారు రచించిన ఈ జీవిత చరిత్ర కావ్యమేయగు ననుటలో సందేహమేమియు లేదు.

ఈ జీవిత చరిత్రకు నాయకుడైన మహాపురుషుడు —స్వయం ప్రకాశానంద యతీశ్వరుడు—ఈ గ్రంథకర్తకు తాతగారి తండ్రిగారట. అనగా షుమారు రెండునందల సంవత్సరముల పూర్వుడు. ఆనాటికి, మన దేశమును పాశ్చాత్య సంస్కార వాసనలు అలము కొనలేదు.

అందుచే మూఢవిశ్వాసములని, మాయలని, నేడు మనము తిరస్కరించుచున్న, మంత్ర తంత్రోపాసనాది సాధనలు వానిమహిమలు అకుంఠితముగ నెగడుచుండెను. ఈ కథాపురుషుని జీవితముతో అట్టి సాధన సంపత్తికి అట్టి సిద్ధ మహిమలకు పోరాని సంబంధమున్నది.

కావుననే ఈ గ్రంథము చదివిన కొలది రెండుశతాబ్దుల నాటి మన సాంఘిక జీవితములో కొంతకొంత కంటికి కట్టినట్లుగ కానబడుచుండును. ఆనాడు, హస్తమస్తక సంయోగము చేతనే శిష్యులకు జ్ఞాన భిక్షపెట్టిన గురువులు, నాలుకపై బీజాక్షరములు వ్రాసి, విద్యావేత్తలను చేసిన ఆచార్యులు, నిరపాయమైన మంత్రోపదేశము చేసి ఉపాసనా పరులను చేసిన దేశికులు, తపోంతరాయములను తొలగించుచు సిద్ధపదమును అందించిన ఉపాస్యదేవతలు అర్హులైన వారికి అనుగ్రహమ్మై సాక్షాత్కరించు చుండిరి కాబోలు. పురాణ కథలు కొన్నిటిలో ఇట్టి సందర్భము లుండును. వానిని అలౌకికాద్భుతములు అని మనము త్రోసి పుచ్చుచుందుము, అవి అద్భుతములే కాని, అలౌకికములు కావు. బహుముఖమైన ఈలోక ప్రవృత్తిలో, ఆముఖమును కొందరు మాత్రమే దర్శింపగలరు. దర్శింపలేని మనము దానిని అలౌకిక మనుకొనుట తప్పు.

కాబట్టియే, మనకు వింతలుగాదోచు, పౌరాణికగాథలు పెద్దలకు సహజములుగానే దోచుచుండును, ఏది సహజమో, అది లౌకికము. ఈ గ్రంథమున కొంతభాగము, ఆ విధమైన పౌరాణిక వాసనకలది. దానిని ఈ గ్రంథకర్త తన రచనచే ఎంతో స్వాభావికముగ చిత్రించి చరిత్ర భావమునకు భంగము రాకుండ కాపాడెను.

చరిత్రను ఇతి వృత్తముగ స్వీకరించి కావ్యరచన చేయుటలో ఒక క్లేశమున్నది. కల్పనా చమత్కారము లేకుండ కావ్యమింపు గొల్పదు. సాధారణముగ కల్పన యనునది వాస్తవస్థితికి కొంత అతీతముగానో, దూరముగానో ఉండును. మరికొన్ని కల్పనలు స్వభావమునకు కేవల విరుద్ధములుగానే యుండును. అయినప్పటికిని ఆకల్పన, సుందరమే మైనచో దాని యథార్థతను శంకింపకుండ కావ్యలక్ష్మికై నేసికొన్న

అలంకారముగ కొని యాడుచుండును. మరిచరిత్రయున్ననో స్వభావ విరుద్ధములైన కాల్పనిక సౌందర్యములను, అయథార్థ వర్ణనలను సహింపదు. భూతార్థ వివరణమే చరిత్రము. ఏమాత్రపు వన్నెలును, చిన్నెలును లేని భూతార్థ వివరణముచే గ్రంథము నిరలంకృతమైన దిస బొమ్మగా తయారగును. ఆ గ్రంథము చారిత్రకజిజ్ఞాసువులకే కాని, రసపిపాసువులకు తనివినీయదు. అందుచే చరిత్రను కావ్యముగ రచించు కవికి ఉభయులను తనుపునట్లుగ రచన సాగించుట దుర్ఘట మైన కార్యముగ పొడకట్టును.

ఈ గ్రంథకర్త తనసహజనైపుణిచే ఈ దుష్కర కార్యమును అతి సుకరముగ నిర్వహింప గల్గెను. ఈ గ్రంథములోయథార్థ తను శంకింపచేయు కల్పనలుగాని, కల్పనాసౌందర్యములేని వస్తు ప్రపంచనముగాని వెదకినను కానరావు. ఔచిత్య వివేచనగల బుద్ధియు రామణీయక భావుకమైన భావనయు, సమబలముతో విరాజిల్లు ఆంతర ప్రకృతిగల మేధావులకే ఇటువంటి రచనలు సుసాధములగును.

ఇంకొక విషయము— ఎంత భావనా పటిమ యున్నను, ఎంత బుద్ధి బలమున్నను, తాను రచించు గ్రంథములోని విషయముయొక్క పరిజ్ఞానము ఏ మాత్రమేని యనుభవ పూర్వకము కాకున్నచో గ్రంథ కర్త తద్రచనకు పూనుకొనరాదు. సాహసించి పూనుకొనునేని, విషయ పరిజ్ఞాన శూన్యత అనెడి లోపము సర్వత్రగాని, ఎడనెడగాని, గ్రంథమున వ్యక్త మగుచునే యుండును. అట్టివి గ్రంథమునకు తీరని కళంకములనుటలో తప్పులేదు. అందును, ఎంత ఊహించినను, ఎంత చదివినను, ఎంతవిన్నను, గోచరింప నట్టియు, స్వానుభవమునే అపే క్షించు నట్టియు ఆధ్యాత్మిక విషయగ్రథనమునకు కవిశబ్దవాచ్యు లందఱును అర్హులుకారు. కవితాశక్తితోపాటు ఆధ్యాత్మికానుభవము కూడ ఉన్న అసాధారణ వ్యక్తులు మాత్రమే అట్టి రచనలను సార్థ కము చేయగలుగుదురు. అట్టి వారినే మన పూర్వులు విద్వత్కవులను చుండెడివారు. ప్రస్తుత గ్రంథకర్త అట్టి విద్వత్కవియనుటలో సందేహ మేమియు లేదు.

ఈ గ్రంథములో మూడింట రెండుపాళ్ళు ప్రబోధ పర్వము నెడి భాగముతో నిండియున్నది. ఈ గ్రంథమున కదియాయువుపట్టు వంటిది. ఈ భాగములో అనేక వేదాంతార్థములు, ధర్మశాస్త్ర రహస్యములు దృష్టాంత పూర్వకముగ వివరింపబడినవి. వానిని ఆ యా చోట్ల తన్నాశ్రయించిన శిష్యవర్గమునకు స్వయం ప్రకాశ యతీంద్రుడు తన మాటలలో వివరించుటకు తగిన అధికారము, విజ్ఞానము, అనుభవముగల మహాపురుషుడనుట విదితమే. కాని యామాటలకు తన ముఖమున కావ్యరూప మొసంగిన యీ గ్రంథకర్త అసాధారణ వేత్త యైనగాని ఇట్టి రచన సాధ్యపడియుండదు, అని నే ననుకొొందును.

మరియు నీభాగమునందలి కథలు తిక్కనశాంతి, ఆనుశాసనిక పర్వములందలి కథలవలె సాధుతాసుందరములును నిగూఢ ధర్మ నిరూపకములై చక్కని చిత్త సంస్కారమును కలిగించుటకు తగియున్నవి. ఈ భాగమే యక్కిరాజు వంశీయుడైన ఒక మహాపురుషుని జీవిత చరిత్రను ఆవంశ్యులకేకాక ఎల్లరకును శిరోధార్యము చేయుచున్నది. ఈ ధర్మప్రబోధభాగమే లేనిచో స్వయంప్రకాశ యతీంద్రుని జీవితము అక్కిరాజువంశమువారికే ఆరాధనీయ మయ్యెడిది.

అసలు కవిత్వమనగా ఆత్మీయ భావమును విశ్వజనీనము చేయుట. అట్లే, ఆత్మీయ వంశపురుషుని చరిత్రను ఈ ప్రబోధ పర్వరూపమున సార్వ జనీన మొనర్చిన ఈ గ్రంథకర్త తాను జన్మించిన అక్కిరాజు వంశమునకు తానుతీర్చ వలసిన ఋణమును తీర్చుటేకాక, తద్వంశ పితృదేవతలందఱి యాశీర్వాదములకు పాత్రుడై జీవితమును చరితార్థ మొనర్చుకొొనెను.

ఏవంశీయుడు యత్యాశ్రమమును స్వీకరించి సిద్ధి పొందునో ఆవంశమువారు అటు ఏడు తరములును, ఇటు నేడు తరములును తరింతురని పెద్దలు చెప్పుదురు. శ్రీ చంద్రమౌళిశర్మగారి వంటి ధార్మికులు, వేదాంతులు, విద్వాంసులు, కవులు, సాధుపుంగవులు అయిన పురుషులు ఈ వంశమున నాటినుండి జనించుచుండుట, శ్రీ స్వయం ప్రకాశ యతీంద్రుని ప్రభావమేమో ! ఎవరెఱుంగుదురు.

వీరి కవితా ప్రశస్తిని గుఱించి పెద్దలనేకులు అభిప్రాయము లిచ్చి యున్నారు. అంతకంటె నేను చెప్పదగిన విశేషమేమియు లేదు. సూత్రప్రాయముగ చెప్పవలెనన్నచో పేలవత్వములేని సాధుత్వము జాత్యము గోల్పోని దేశితనము అప్రయత్న సిద్ధమైన ధారాళత శ్రీ చంద్రమౌళిశర్మ గారి కవిత్వమునకు సాధారణలక్షణములని నా యభిప్రాయము.

ఆధునికులలో నిటువంటి కవులు చాలయరుదు. పూర్వులలో అనంతామాత్యుడు, దగ్గుపిల్లి దుగ్గన మొదలైన ఏయిరువురు ముప్వురో ఇట్టివారు గలరు.

నాచేత నీపీఠిక వ్రాయించవలెననెడి శ్రీ శర్మగారి కుతూహలము దీర్చుటకే నేనిది వ్రాయుటకు సాహసించితినిగాని, దీనికి నాకు ఏ మాత్రము అర్హత లేదని నే నెఱుగుదును.

వాల్తేరు,
10—10—1953.

పింగళి లక్ష్మీకాంతం.

# తొలిపలుకు

మహానదుల ఉత్పత్తివలెనే మహాపురుషుల ఉత్పత్తి తమ జన్మ భూములకే పరిమిత ప్రయోజనకారి కాదు. వారి పురోగతి సర్వతో ముఖమై వారి జీవిత ప్రయోజనము సర్వజన శ్రేయస్సాధనమై సర్వ వ్యాప్తమై సార్వకాలికమై ఉదారాశయ విలసితమై విలసిల్లును. అట్టి మహాత్ముల నొక వంశమునకు ఒక కులమునకు, ఒక ప్రాంతమునకు, ముడిపెట్టజూచుట, అట్టి రాగద్వేష పూర్ణమగు దృష్టితో పరిశీలించుట వారిని పరిభవించుటే కాక తమ దృష్టి సంకోచమును వెల్లడించు కొనుటయు నగును. అనర్ఘరత్న మెచ్చట పుట్టిననేమి! దాని తేజఃపుంజమును మెచ్చుకొనని వారును, దానిని శిరోధార్యముగా భావింపని వారును ఉండరు. అట్టిరత్నములవంటి వారే మహాపురుషులు,

"స్వయంతీర్త్వా పరాన్ తారయేత్" అనునది వారిజీవిత లక్ష్యము. దూషణ భూషణములకు వారతీతులు, నిస్సంగులు, నిర్మోహులు, నిరీహులు. అట్టి వారిలో శ్రీ స్వయంప్రకాశావధూతస్వాముల వారొకరు. వీరు నిశ్శ్రేయస సిద్ధికై యవలంబించిన సాధనములు సాధకుల కెంతేని యుపకరించునని నా తలంపు. పూర్వాశ్రమమున వీరి వ్యవహారనామము శ్రీ లక్ష్మీనారాయణగారు. అష్టసిద్ధులందిన మహాయోగి శ్రీ నిత్యానందావధూతస్వామివారి శిష్యులు. ఆబాల్య తాపసులు, ఫాలతలమున తిలకముంచి యంబిక యాదేశించుటచే గార్హస్థ్య మవలంబించియు నిస్సంగులగు నాదర్శ గృహస్థులు. ముముక్షువులకు జ్ఞానభిక్ష నొసంగిన యుత్తమ దేశికులు. అట్టి వీరి జీవితము ప్రగతికాములకు సుపథము చూపగలదను నాశయము ఈ గ్రంథరచనకు నన్ను ప్రోత్సహించినది,

వారి జీవిత రహస్యముల నెక్కువగా నెఱుగుట కవకాశము కలిగి తద్వంశ్యుడనైయుండి యూరకుండలేక పోతిని. చిన్ననాటి నుండి కవితాకన్యను తలవాకిలి దాటనీక యదుపున నుంచితిని. కాని

స్వామివారిపైనున్నభక్తిగుట్టుచక్కగానున్నయామెను రచ్చకెక్కించి లోకపుపోకడ చూపినది. సహృదయులోక మేమనునో కదా!

శ్రీ స్వామివారి జీవిత సంఘటనముల నిరూపించు రెండు శిలా శాసనములు లభించినవి. అందొకటి మా యూరనున్న శ్రీ సీతారామస్వామివారి యాలయమంటపమున నొక శిలాస్తంభముపై చెక్కబడియున్నది. ఈ యాలయ మక్కాలమున వేణుగోపాలస్వామియాలయముగా నుండెడిది. ఆ శాసనమునకు ప్రతిరూపము నుదాహరించుచున్నాను.

"శ్రీ మదఖండ సచ్చిదానందాతీత శ్రీ గురు దిగంబరావధూత నిత్యానంద శ్రీ చరణ కమల సమాశ్రిత స్వయంప్రకాశానందావధూత స్వాములవారు గుచ్ఛాద్రిపట్టణం ప్రవేశం అయిన శాలివాహన శకాబ్దంబులు ౧౬౮౯ అగు నేటి సర్వజితునామ సంవత్సర భాద్రపద బ॥ ౧ గురువారం" అని —

రెండవది గుత్తికొండ బిలమున కభిముఖము గానున్నది. మాగుత్తికొండగ్రామమునకు మూడుమైళ్ళదూరములో కాననమధ్యముననున్న గుత్తికొండ బిలమను పర్వతగహ్వరములో ఛాత్రులకు యోగవిద్యా రహస్యముల నెఱింగించుచు వీరు జీవిత చరమదశను గడపినట్లు తెలియును. వీరి భౌతిక కాయ మా గుహాముఖముననే సమాధి చేయబడినది. అచ్చటనున్న శిలాశాసనముచే వారిబిలమున నోంకారేశ్వరుని ప్రతిష్ఠించినట్లు తెలియును. ఆ శాసనమున కిదిప్రతిరూపము.

"స్వయంప్రకాశానందావధూతస్వాములవారు"

"స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకాబ్దంబులు ౧౬౯౩ అగు నేటి ఖరనామసంవత్సర జ్యేష్ఠ బహుళ సప్తమి శుభదిన స్థిరవారం గుత్తికొండబిల గర్భమందున ఓంకారేశ్వరస్వామి వారిని ప్రతిష్ఠించిన సుముహూర్తం. శ్రీ శ్రీ శ్రీ"

ఈ యీశ్వరున కిప్పటికినిపూజాదికములు జరుగుచున్నవి. ఇదమిత్థమని వీరి జననకాలమునునిరూపించు నాధారములులేవు, క్రీ॥ శ॥ 1757–1760 ప్రాంతముల వీరి జననము కానోపు. ఐదవయేట గురు

దర్శనము, ఎనిమిదేండ్లనుండి యిరువదేండ్లవఱకు శ్రీశైలమున, తపోదీక్ష, అటుపైన గార్హస్థ్యము, దేశాటనము, శిష్యసమాదరణము, కాగా నరువదవయేట కాశీయాత్ర, పరివ్రాజనము, డెబ్బదవయేట క్రీ॥ శ॥ 1827 లో గుత్తికొండకు పునరాగమనము, అటుపై నైదేండ్లకు క్రీ॥ శ॥ 1832లో ఓంకారేశ్వరస్వామి ప్రతిష్ఠజరిగినట్లు భావింపవచ్చును. స్వామివా రెనుబదియాఱుశరత్తుల నూచిరని వినికి.

శిష్యప్రభోధముతోను గ్రంథరచనతోను వీరు కాలమును సద్వినియోగ మొనర్చిరి. కాని వారి గ్రంథములు నేడు మృగ్యములు. నా చిన్ననాడు మా రెండవ పినతండ్రిగారు ఈ తాళపత్ర సంపుటముల తమ తాతగారగు స్వామివారు వ్రాసిరని చెప్పుచు స్వామివారి శతకములలోనివని కొన్ని పద్దెములను తత్త్వములను జదువుచుండ వినియుంటిని. వానిలో రెండుశతకముల మకుటములు మాత్రము నాకు జ్ఞాపకమున్నవి.

గీ॥ "గుత్తికొండబిలాధీశ కుజననాశ కలితచిద్గుణసంగ ఓంకారలింగ",
అని యొకటి.
"గుత్తికొండబిలాధ్యక్ష కుజనశిక్ష సాధుసంరక్ష శ్రీకృష్ణసరసిజాక్ష"
అని మరియొకటి.

నేనీకావ్యములో వ్రాసిన స్వామివారి జీవిత విషయములు మా కులవృద్ధుల వలనను వారి ప్రశిష్యుల వలనను తెలిసికొనబడినవి. వానిని యథా తథముగా నే వ్రాసితిని.

ప్రబోధపర్వములో పూర్వోత్తరఖండములందు నావివక్షితములగు భక్తిజ్ఞాన వైరాగ్య బోధకములగు కథలను స్వామివారు సభ్యులకు వాక్రుచ్చినట్లు నొడివితిని. వారిబోధలు లిఖితరూపములుగా నేడలభ్యములగుటచే నట్లొనరించితిని.

ఈ గ్రంథమును రచించియు దాదాపొక పుష్కరము గడచినది. కాని 'శ్రేయాంసి బహువిఘ్నాని.' ఈ నాటికిది ముద్రిణ భాగ్యము నందినది.

ఈ శుభసమయములో
నా గురుదేవులు :

శ్రీ జగద్గురు కళ్యాణానందభారతీ మాన్త్రాచార్య స్వామివారు.
కీ॥ శ్రీ జగద్గురు విమలానందభారతీ స్వామివారు.
శ్రీ దేశికులు రామానందసరస్వతీ స్వామివారు.

ఈ ఆచార్య త్రయమునకు సాష్టాంగ దండ ప్రణామములు.

కింకవీంద్ర ఘటాపంచాననులు పూజ్యులు శతావధాని బ్ర॥ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు. వారికి నా యందున్న వాత్సల్యము దొడ్డది. వారి యాదరాతిశయము ఈ గ్రంథ ముద్రణమునకు నన్నెంతయు ప్రోత్సహించినది. యశశ్శరీరులగు వారికి భక్తితో నా ప్రణామాంజలులు.

మహాకవులు : ఆంధ్ర విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులుగానుండిన శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు బహుకార్యనిమగ్నులైనను అడిగినంతనే అంగీకరించి పీఠికను రచించిరి. వారి సౌహార్దమునకు నమోవాకములు.

ఆదరముతో తమ అమూల్యాభిప్రాయముల నొసంగి ఆశీర్వదించిన కవిపండితులకు కృతజ్ఞతతో ప్రణామములు.

గ్రంథ ముద్రణమునకై భూరి విరాళములొసగి ప్రోత్సహించు నుదారుల సౌజన్యమునకు అభివాదనములు.

నాకు ఈ కావ్య పరిష్కృతిలోను ముద్రణ దోషముల సవరించుటలోను సర్వవిధముల తోడ్పడి కుడిభుజమువలె సహకరించిన నా కుమారుడు చి॥ వేంకటేశ్వరశర్మకు నా శుభాశీస్సులు—

పెద్దల కందఱకు నా నమస్కృతులు సమర్పించుచు పాఠక మహాశయుల కరకమలము లందీ నా చిన్న కానుకను సమర్పించు కొనుచున్నాను. విబుధులు దోషములను పరిత్యజించి గుణములను పరిగ్రహింప ప్రార్థితులు.

మన్మథనామ సం॥ ఆశ్వయుజ
శు॥ దశమి బుధవారము
26—10—1955

ఇట్లు,
విద్వద్విధేయుఁడు
అక్కిరాజు చంద్రమౌళిశర్మ

# విషయసూచిక

# ప్రబోధపర్వము







శ్రీ

# స్వయంప్రకాశ ప్రబోధము

## ఆదిపర్వము

ఉ. శ్రీ మహదాది కారణుడు, చిన్మయ రూపుఁడు, సర్వలోక స
ద్ధాముఁడు, శాశ్వతుండు, గుణతత్పరుఁ, డాశ్రితవత్సలుండు, ని
ష్కాముఁడు, కామ ముఖ్య రిపు గర్వహరుండు,స్వయంప్రకాశుఁడౌ
స్వామి ప్రబోధదీప్తిఁ బెడఁబాపుఁ దమంబు నిజాశ్రితాళికిన్. ౧

సీ. పరమపావని యైన భాగీరథీదేవి
ప్రభవించె నెవ్వాని పాదతటిని
అఖిల జగత్సృష్టి నలవరించెడి స్రష్ట
కలిగె నెవ్వాని నాభి కంజమందు
చలువ వేడి నొసంగు శశిభాను లెవ్వాని
లోచనములు తమో మోచనములు
పదునాల్గు లోకముల్ పాలించు నెవ్వాని
దక్షిణ కరశాఖ ధర్మరేఖ
వెలయు నెవ్వఁడు శ్రుతి శిరో వేదికలను
వ్యాప్తమగు విష్ణు శబ్ద మెవ్వనికిఁ జెల్లు
నఘముల హరించు నెవని నామాక్షరములు
అట్టి హరి కావ్యకన్యఁ జేపట్టి మనుచు. ౨

సీ. ఎవ్వాఁడు చల్లని క్రొవ్వెన్నెలలు కాయు
పూపచందురు సికపూవుచేసె
ఎవ్వాఁడు కరిరాజు క్రొవ్వు పెంపడఁగించి
చర్మంబు పట్టు పచ్చడము చేసె

ఎవ్వాఁడు గిరిజకు నివ్వటిల్లెడు కూర్మిఁ
దనలోన సాబాలు ధారవోసె
ఎవ్వాఁడు జగముల నేర్చెడు విసముతోఁ
జివ్వకుఁ జేసాచి బువ్వ చేసె
అట్టి మొనకాఁడు పాములఁ జుట్టువాఁడు
చుట్టు కైదువు గలవాని జోడు వాఁడు
వాఁడు ముని కాంతలఁ గరంచు కోడె కాఁడు
కోడె తత్తడి వాఁడు కాపాడు లేఁడు. ౩

ఉ. హారతు లెత్తి నిర్జరకులాంగన లెల్లను బాడఁ దమ్మిపై
భారతిఁ గూడి కర్మపరిపాకము పాకము చేసి సృష్టిలోఁ
బారముఁగాంచి లోకములఁ బాలనచేయు విధాత, సర్వ వి
ద్యా రసికాగ్రగణ్యుఁడిదు నాయువు, శ్రీయు, యశో విలాసముల్. ౪

ఉ. అంబుధి పుట్టినిల్లు వికచాంబురుహాంబు వసించు గద్దె లో
కంబులు బొమ్మరిండ్లు సురకాంతలు నెచ్చెలిపిండు గేహ కు
డ్యంబులు దిగ్వితానములునై విహరించెడి కల్పవల్లి భ
ద్రంబు లొసంగుఁగాత సురతాణి యుపేంద్రుని రాణి జాణయై. ౫

సీ. కులములో హిమవంతు కలిమి పెంపసలారఁ
దావలంబైన యుత్పలదళాక్షి
దరిలేని విరహాగ్నిఁ దపియించు రతికిని
బతిభిక్ష నొసఁగిన పద్మగంధి
దిగధీశులకునైనఁ దేరిచూడఁగరాని
సామి సామేన్గొన్న చంద్ర వదన
గణ సమూహము లెల్లఁ బ్రణతులై సేవించు
పుత్రుఁగాంచినయట్టి పుణ్యజనని

పాకశాసన పౌలస్త్య పాశి పవన
పావక పరేతరాజ దిక్పాలవరులు
వేకువను లేచి సేవించు లోకమాత
చలువ క్రేగంటి తుంపురుల్ చిలుకుఁగాత! ౬

చ. కరుణకుఁ దేనెయూట శితికంఠుని పువ్వుల తోఁట శాత్రవుల్
చెరుపఁగరాని కోట పరసీమకు దిద్దినబాట కామినీ
కరముల పైడిమూట జయకాంక్షికి సింగపువేఁట పార్వతీ
చరణము లాశ్రయించెదము శాంతికి దాంతికి భ్రాంతిశాంతికిన్. ౭

ఉ. వాణి! మనోజ్ఞగాన పరిపాక సుధారస సంభవాకర
ద్రోణి! శచీ పురందర శిరోజ సరోజ విరాజి పాద! సం
త్రాణ సమస్తరాజ కవిరాజ సమర్పిత పుష్పపాణి! స
ద్వేణి! విధాతృరాణి! కృపఁ బెంపవె నింపవె వాక్యసంపదల్! ౮

చ. గణపతి, ఫాలలోచనుని గాదిలి బిడ్డఁడు, సాము సందెలన్
గణనకు నెక్కినట్టి మొనకాఁడు, విలాసపు గుజ్జులాఁడు, వా
రణ వదనంపుఁ తేఁడు, కవిరాజులు నమ్మినతోడు, నేఁడు మా
ప్రణతుల నాదరించి యెడఁబాయక సాయము సేయుఁగావుతన్! ౯

క. పండిత గజ కంఠీరవు
మండన మిశ్రాది శిష్య మండితు విద్యా
ఖండల గురుఁ గుమత తమః
ఖండన మార్తాండుఁ గొల్తు ఘను శంకరునిన్.

గీ॥ కవిని వాల్మీకి వ్యాసుని గాళిదాసు
భాసు భారవి భవభూతి బాణభట్టు
దండి శ్రీహర్షు మాఘు నుద్భటు మురారి
రాజశేఖరుఁ బండితరాజుఁ దలఁతు. ౧౧

ఉ. వేడుకతోడ భారతపు వెల్గునొసంగి త్రిలింగ భూమిలోఁ
గూడు తమంబులన్ దొలఁగఁగొట్టి ప్రకాశముగన్న వారిఁగే
ల్మోడిచి సన్నుతింతు రవిమూర్తుల మూవురఁ బోలఁ జాలు బల్
పోడల నన్నయన్ సుకవి పూజ్యులఁ దిక్కన శంభుదాసులన్. ౧౨

సీ. కవితా సరస్సులోఁ గదలెడి రాయంచ
మాధుర్యమునఁ దీయ మావిమోఁక
లోక పరిజ్ఞాన పాకమ్మునకుఁ డీక
నుడికారములకెల్ల విడిదిపట్టు
మెచ్చైన యుపమల మచ్చుల చావడి
శాస్త్రాగమములకు జన్మభూమి
సత్కావ్య సద్రత్న సంఘమ్ములకు ఖని
చతుర కవితలకు నాస్థాన పీఠి
గండు వారిన కవి కోటి గుండె దిగులు
రాజ రాజుల చేతి గారాబు చిలుక
వాని నుతియింపఁదగదె కావ్యమ్ము మొదట
సకల కవి నాథు శ్రీనాథ సార్వభౌము. ౧౩

గీ. పాపనుఁడు, హాలికుఁడు, భజత్స్వర్ణ వేది
సుగుణముల కుప్ప, విజ్ఞాని, సుకవులనెడి
చుక్క గమిలోన వెలుఁగొందు సోముఁడనఁగ
దశదిశలఁ గీర్తిఁగన్న పోతన్నఁ దలఁతు. ౧౪

ఉ. ముద్దుల మాట పల్కుబడి, ముత్తెపుదండ విలాసరేఖయుం,
[illegible]ముల నారసి చూపఁగఁ, దేట తేనెలో
[illegible]త్తు పాకమున, నచ్చునఁదీర్చిన తీవ యల్లికం,
బెద్దన వాక్యవైభవము పెంపు నుతింపఁ గలారె మాదృశుల్. ౧౫

గీ. అస్మదన్వయ [illegible]బోధి కమృతకిరణుఁ
డాంధ్ర సంస్కృత హూణ విద్యావిదుండు

అన్నయును, నెచ్చెలియు, హితుం, డైన యట్టి
మా యుమాకాంతు, ధీమంతు, మదిఁ దలంతు. ౧౬

గీ. సుకవుల నుతింతు నిందింపఁ గుకవి తతిని
బుధుల "పాపాదుపేక్ష" యను బోధ వలన
భృంగము గులాబి పూఁదేనె సంగతిఁ గని
ముండ్లఁ బొగడక తెగడక పోవుఁ గాదె. ౧౭

— షష్ఠ్యంతములు —

క. శ్రీవత్స లాంఛనునకుం
బావనునకుఁ, గామితార్థ ఫలదునకు, దయా
సేవధికి ధర్మరక్షా
ప్రావీణ్యపయోధి, కఖిలభర్తకు, హరికిన్. ౧౮

క. బహిరంతర్వ్యాప్తునకుం,
దహరస్థితునకుఁ బ్రయోగ దక్షునకు, రమా
సహితునకు, లోకవంద్యున
కు, హితాహిత సమున, కమలగుణ వార్నిధికిన్. ౧౯

క. వరగుణునకు, నిర్గుణునకుఁ,
బరిమితునకు, సర్వలోక పరిపూర్ణునకున్
గురునకు, హరునకుఁ, బరునకు,
నిరతిశయానందునకు, మనీషికి, ఋషికిన్. ౨౦

క. శేషాహి తల్ప రతునకు
దోషాచర హర్త, కధిక దోస్సారునకున్
భాషా పతి నుతునకు, మృదు
భాషికి, తోషికి, నిరస్త బహు దోషునకున్. ౨౧

క. సారాసార చరాచర
కారణున, కకారణునకుఁ, గల్యాణునకున్
క్షీరాబ్ధి నివాసునకున్,
నారాయణునకు, సుమేరు నగధీరునకున్. ౧౧

క. మాధవునకు, సంపూజ్యో
మాధవునకు, సర్వలోక మంగళునకు, స
ద్బోధకు, స్వయంప్రకాశ ప్ర
బోధము కృతి నొసఁగు వాఁడ బుధులౌ ననఁగన్. ౧౩

ఉ. చక్కనివాఁడు, శాస్త్రముల సారమెఱింగిన వాఁడు, కీర్తి పే
రెక్కినవాఁడు, పక్షివరు నెక్కినవాఁడు, తలంకిపోరిలో
నక్కనివాఁడు, శ్రీసతికి నచ్చినవాఁడు, మదీయ కావ్యపుం
జక్కరబొమ్మ తోడ సరసమ్ములఁ దేలు రసార్ద్రచిత్తుఁడై. ౧౪

— కథా ప్రారంభము. —

క. శ్రీవల్లభ! సంవర్ధిత భూవల్లభ!
దేవరాజ పూజిత! ముని సం
సేవిత పావనచరణా! దేవా!
యవధారు! తెల్పెదను బుణ్యకథన్. ౧౫

క. ఓంకార బీజరూప! య
హంకార విదూర! శాశ్వతానందరతా!
పంకరుహనేత్ర! నీపద
పంకజములకెఱఁగి, కృతిని బ్రారంభింతున్. ౧౬

గీ. పద్మనాభుని నాభిని బ్రహ్మ గలిగె
వానివలనఁ బ్రజాపతుల్ ప్రభవమైరి
మనువు శతరూప యుదయమై మానవాళి
కాద్యులైరి సమస్త భూతాదులౌదవె. ౧౭

క. దేవతలు, ఋషులు, విప్రులు
గోవులు, యజ్ఞములు, నదులు, కులశైలములుం
బావన వనములు, పురములు
దేవాలయములును, పుణ్యతీర్థము, లాదటన్. ౨౮

క. కుశికుఁ డుదయించె ధాతకు
కుశికుఁడు కుశనాభుఁ గాంచెఁ గుశనాభుఁడన
దృశు గాఁధిఁ గాంచె గాధికి
నిశితుఁడు కౌశికుఁడు గల్గె నిరుపమ ఋషియై. ౨౯

ఆ. క్షాత్రచరువువలన సంభవమందుట
భార్గవుండు క్షాత్ర పటిమఁ గాంచె
అట్లు గాధితనయుఁ డందె బ్రాహ్మణచరు
జనితుఁడౌట విప్రజాతి మహిమ. 30

సీ. శ్రీరామచంద్రుని శిష్యుని గా నేలె,
వేదవేద్యున కస్త్ర విద్యఁ దెలిపె
ముప్పు త్రిప్పులఁ బెట్టి మూఁడు చెర్వుల నీరు
ద్రావించెను వసిష్ఠుఁ దపసి మిన్న
బ్రహ్మర్షి వని, బ్రహ్మ పల్కినఁ గైకోక
ప్రత్యర్థి యను దాఁకఁబంతగించె
త్రిదివమ్మునకు మాఱు త్రిదివమ్ము గావించి
చ్యుతుఁ డౌ త్రిశంకు నచ్యుతుని జేసె
భరత వంశ మాతామహ ప్రభ గడించె
"అన్య మింద్రం కరిష్యామి" యని, వచించె
కౌశికుని వినని వా రర్కుఁ గనని వారు
లేరు వీనులు, కనులున్న, వారిలోన. 3౧

క. ఆ తాపసేంద్రు కుల సం
జాతుల నఘమర్షణుండు శాలావృతుఁడున్
పూతులు శాలంకాయన
గోత్రజు లుదయించి రుభయకుల వర్ధనులై. 3౨

క. వారల సంతతిఁ బెక్కురు
ధీరులు, శూరులును, విప్రతేజము క్షాత్రం
బేరిచి, కూరిచి యచ్చునఁ
దీరిచి, పోత యిడినటుల దిగ్దంతులనన్. 33

గీ. జనన మందిరి యశమంది, మనిరి వారి
భక్తిచే శక్తిచే సాధురక్తిచేత
వంశకర్తృత్వమున మహావైభవమున
అక్కిరాజను విజ్ఞాని లెక్క కెక్కె॥ 3౪

గీ. శంకరుఁడు దిగ్విజయ యాత్ర సలుపు నపుడు
శిష్యు లార్వేలుయోగ విశిష్టు లుంట
ఆఱు వేల నియోగు లం చనిరి వారి
వారి సంతతి కాపేరె వచ్చెఁ బిదప. 3౫

గీ. ప్రథితగుణుఁడైన యా యక్కిరాజు వలనఁ
గలిగి రిద్దఱు తనయు లఖండ యశులు
మంత్రి యొక్కఁడు కవిత సమాశ్లిష్టొకండు
వీరన లనంగ విఖ్యాత విమల మతులు 3౬

గీ. వారు శూరత్వసంపద నారి తేరి
బద్ధవైరులఁ దమతోడఁ బ్రతిఘటించు
గుత్తికొండను గృహనామకులఁ గుమతులఁ
దఱిమి రతిసెనపల్లెలో దాఁగు దాఁక. 3౭

క. వారలలోఁ బెద వీరన
సూరియు, వీరుఁడును, కార్యశూరుఁడు, నగుచుం
బేరెక్కె నీలకంఠుని
మార సమాకారుఁ జంద్రమౌళిని గాంచెన్. ౩౮

ఆ. అందుఁ జంద్రమౌళి యసమానదాతయు
జ్ఞాని యగుచు, మించె జ్ఞాతులందు
ధీరుఁడతఁడుగాంచె శూరు వీరనమంత్రి
రుద్రమూర్తి వీరభద్రుఁబోలె. ౩౯

క. వీరన్నకు శివరాముఁడు
వీర మహాదేవు లనఁగ విద్యా నిపుణుల్
కారుణ్య రసోపేతులు
నారాయణ భక్తి పరులు నగ సమధీరుల్. ౪౦

క. తనయులు మువ్వురు గలిగిరి
ఘనుఁడు మహాదేవుఁడందు జ్ఞానాధికతన్
వినయమున నతఁడు గాంచెను
మను నిభుఁడగు చంద్రమౌళి మంత్రివరేణ్యున్. ౪౧

గీ. చంద్రమౌళి మహాదేవ సచివుఁ గనియె
నాతఁ డంజయు, నారాయణప్ప, చంద్ర
మౌళి, మల్లపరాజను మంత్రి వరుల
నలువురను గాంచెఁ బురుషార్థముల విధమున. ౪౨

గీ. అందు నారాయణప్ప విద్యాధికుఁడయి
ప్రస్తుతికి నెక్కె-కోటయ పాపరాజు
లతని తనయులు విఖ్యాతు లలఘుమతులు
పాపరాజందు దాత, విద్వాంసుఁడు, కవి. ౪౩

క. ఆడండనృత మ్మొరులన్
వేడఁడు, గురుదైవభక్తి వీడఁడు, ఖలులం
గూడఁడు, శత్రుల కోడఁడు
చూడఁడు, పరకామినులను సుందరతనుఁడై. ౪౪

క. కాళీ సేవిక నభినవ
మాళవికన్ విబుధలోకమాన్య చరితఁ గం
కేళి కుసుమ సమ కరపదఁ
గాళమరాజింటి వారి కన్య నగణ్యన్. ౪౫

క. హారితస గోత్రోద్భవ సుం
దర తర సుకుమార గాత్రఁ దామర సాక్షిన్
కరిగమన బుచ్చమాంబను
పరిణయమై వినుతిగాంచెఁ బ్రజ్ఞానిధియై. ౪౬

చ. పతి కనుకూల ధర్మలత, బాంధవ కోటికిఁ బట్టుఁగొమ్మ, యా
శ్రితజన కల్పభూరుహము, శీలమునం దనసూయ, తాల్మిచే
క్షితి, మతిమంతురాలు, గురుసేవిక, పావని, బుచ్చమాంబకే
సతులెనయే! య్యనంగ బుధ సమ్మతయై విలసిల్లె వారికిన్. ౪౭

గీ. వ్యాస మూర్తికి శుకముని వరుస క్షీర
సాగరమునఁ గళానిధి జనన మట్లు
గాధికిని కౌశికుఁడు గల్గు గతి నతులుఁడు
వరసుతుఁడు గల్గె వంశపావనుఁడు ఘనుఁడు. ౪౮

గీ. గర్భముననుండి భూమిపై గళిత మయిన
కాంచి మగబిడ్డ యని దాది గంతు లిడఁగ
పితలు సమోద్ధమునఁ గనుల్ విచ్చి కనిరి
బాల భాస్కరుఁ గను పద్మ వనము వోలె. ౪౯

గీ. పురుడు పదినాళ్ళును "నమోనమో" యటంచుఁ
గడపి శతవర్షములు మనఁగంటి మనుచు
జాతకర్మ మొనర్చి శ్రీజాని పేర
వ్రాసె నామము లక్ష్మినారాయణ యని. ౫౦

గీ. పూటపూట కొంకింతగాఁ బొటమరించి
శుక్లపక్ష సుధాకరు సొంపు మించి
గరుడ గమనుఁ డొసంగిన కౌస్తుభమనఁ
దల్లిదండ్రుల కానందదాయి యయ్యె. ౫౧

గీ. ఏకువలె మేను కోటేరునెనయు ముక్కు
కలువరేకుల నిరసించు కనులు పాల
బుగ్గలును మోము కావిరి బొట్టు వెలుఁగ
శాబకుఁడు డోల వటపత్రశాయిఁబోలు. ౫౨

గీ. బోరగిలఁబడి, తలయెత్తి, పాకియాడి
దోఁగియాడుచు లేవఁగాఁ దొడఁగి, కడఁగి
తప్పటడుగుల నడచుచు తల్లిఁ జేరి
బూచినని మోము కొంగుతో మూసి నవ్వు. ౫౩

గీ. తల్లి చెప్పినఁ జేయూచు "దాయె దాయె"
యనుచు శశిఁబిల్చు బుల్లిచేతిని గదల్చి
చెవులు ముక్కును గన్నులు చేతఁజూపు
పప్పుపాశపు గిలిగింతఁ బకపక నగు. ౫౪

గీ. 'పాపపా'పని బాలురఁ బట్టి చూపు
తల్లి చూపిన వస్తువుల్ తడవి తెచ్చు
కథల కూకొట్టు 'బా'యంచు గంతువెట్టు
గజ్జలును మద్దికాయలు ఘల్లు మనఁగ. ౫౫

గీ. పిట్టల నదల్చి, కాకులఁ బిలిచి, చూపి
గోడలెక్కించి, చీలిని జూడు మనుచు
బాబు పాలిది నాపాలు పట్టుమనుచు
తల్లి దినిపించు బువ్వ "నా తండ్రి" యనుచు. ౫౬

గీ. కాల మీరీతి నొకయేఁడు గడచి పోవ
వ్యాధిచేఁ దల్లి పరలోక పథము చేర
బాలకుని జూచి తాపముఁ బట్టలేక
పాపరా జేడ్చె వినువారు "పాప" మనఁగ. ౫౭

గీ. గూటిలోఁ బిట్టలట్టులు కూడి మాడి
కాంతయును నేను హాయిగాఁ గడపు చుండ
మాలదైవమ! నీకింత జాలి లేక
పాపితే సౌఖ్యములతోడఁ బ్రాణసతిని. ౫౮

గీ. పండు వెన్నెల వేసఁగి యెండ యయ్యె
పికము బకమయ్యె కీరము భీమమయ్యె
కలఁక గలవాని దీపము గలఁచినట్లు
పట్టెమంచము తోఁబాన్పు కుట్టఁ దొడఁగె. ౫౯

గీ. తెలిసి తెలియక యీబిడ్డ పలుకు నుడులు
సంతసము గూర్చెనవి నేఁడు జాలిగొలిపె
కాల వైషమ్య గరిమచేఁగాల మెఱిఁగి
పాలతో నీళ్ళతో నెట్లు బాలుఁ బెనుతు. ౬౦

గీ. "అమ్మ" యని యేడ్చు "బాయి"యంచంగలార్చు
తొంగి చూచును వంటయిల్ దుమ్ములోనె
నిదుర వోవును, బోర్వెట్టు; మెదుకుఁ దినఁడు
కడచు నికనెట్లు శ్రీహరీ! కాలమిట్లు. ౬౧

గీ. ఆపదల ధైర్యమును వీడ రలఘు మతులు
దిగులువడి యేడ్చి నేఁజేయఁ దగినదేమి ?
జన్మమాదిగ మార్పులు జరుగునట్లు
మరణమును గాంచి యొండు జన్మమును గాంచు. ౬౨

గీ. కర్మఫలముల దాటఁగాఁగలరె నరులు
వెన్నెలయుఁ జీకటియు రాక విడనియట్లు
సుఖము దుఃఖము వచ్చును జుట్టిచుట్టి
సమముగా వాని నీక్షింపఁజనునటంచు, ౬౩

గీ. శాంతిఁ బఱియించి, మదికి విశ్రాంతిఁగూర్చి,
తల్లి లేనట్టి లోపము దనరకుండ
బాలకుని బెంచఁగా మూడువత్సరములు
పాపరాజంత పరలోక పథముచేరె. ౬౪

గీ. నెమలిపురినుండి వచ్చి, మనీషియైన
మాతులుఁడు బాలుఁ గొనిపోయి, మమతఁ బెనిచె
తల్లిదండ్రులు కఱవైన తనయుఁడనుచు
ముద్దుగా గారవింపఁగా బెద్దలెల్ల. ౬౫

గీ. అడిగినది తెచ్చియిచ్చు లేదనక, మెచ్చు
తెలివితేటలఁ గని, కుల దీపకుఁడను
ప్రక్కలోఁజేరి, యూకొట్ట భారతమును
రామకథఁ జెప్పు వెన్నెల రాత్రులందు. ౬౬

గీ. పంచవర్షము లొప్పారు ప్రాయమందు
ఈడు బాలురతో నాటలాడుచుండి
చిల్లజగడములను సుంత గిల్లుమనక
పెద్దలకు సంతసముగూర్చి పెరుఁగుచుండె. ౬౭

గీ. ఊరివెలుపలఁ బూర్వమునుండి వెలయు
ఆంజనేయుని దేవాలయమ్ములోన
ఆఱువేల నియోగి శాఖాగ్రగణ్యుఁ
డష్టశత శరత్తులఁగన్న యలఘుమూర్తి. ౭౮

గీ. అష్ట సిద్ధులు సేవింప నలరుయోగి
ఘనుఁడు కనుపర్తి వంశపావన చరితుఁడు
నిశ్చలుఁడు నిస్పృహుఁడు సదా నిర్మలుండు
సాధువు దిగంబరుఁడు ముని సర్వసముఁడు. ౭౯

క. ప్రత్యహము సత్యచిద్ఘన
నిత్యానందానుభూతి నిష్ఠ నచలుఁడై
సత్యా సత్యము లొల్లక
నిత్యానందావధూత నిలిచె హరుఁడనన్. ౮౦

గీ. తోడి బాలురతో నాడి యోడినపుడు
వారు తన్నదిలింపఁగా వచ్చినపుడు
చూడవే తాత యని వెన్కఁ జొచ్చిదాఁగు
వెఱపుఁగొని బాలు రితరులా దరికిఁజనరు. ౮౧

గీ. అట్టు లొకనాఁడు తాను వారాడుచుండ
అన్నమిడెదను రమ్మని యత్త బిలువ
జిల్లయును గోడె ప్రక్కగాఁ జేర్చి తాత!
ఎవరిఁ గొనిపోవ నీకు మంచేగె మఱలి. ౮౨

గీ. ఆతఁడన్నము దిని వచ్చు నంతలోన
ఎవ్వఁడో వానిఁ గొనిపోవ నిందు నందుఁ
జూచి లేకున్నఁ "దాత! నే దాచి చనిన
జిల్లయును గోడె యేమయ్యెఁ" జెప్పుమనుచు. ౮౩

గీ. అడిగెఁ బలుమారు లాతని ధ్యానరతుని
నా మహాయోగి విరమించి ధ్యాననియతి
మానసము నింద్రియములతో మరలఁ జేసి
ప్రాణ వాయువు బంధించు పట్టు వదలి. ౭౪

గీ. కన్నులను విప్పి చూడఁగాఁ బిన్నవాఁడు
"చెప్పవే తాత" యని చెంతఁ జేరి పలుక
మోము వర్చస్సుఁ జూచి సమ్మోద మంది
"చెప్పు" మని యెదవా యనఁ "జెప్పు" మనిన. ౭౫

గీ. "నాలుకను జూపరా" యన జాలిగొనక
నోరు విచ్చిన రసనపై వేరుతోడ
వ్రాసె, యంత్రము బీజాక్షరములఁ గూర్చి
హస్త మస్తక సంయోగ మాచరించి. ౭౬

గీ. గురుఁడు శిష్యుని మదిఁగనఁ గోరి "వత్స!
అన్నమును దెచ్చి యిచ్చెదే ఆకలి" యన
తెత్తునని పోయి యిలుసొచ్చి యత్తఁగాంచి
ఆలయములోని తాత కిమ్మన్నమనిన. ౭౭

గీ. ఆబ్దికంబౌట వారింటియందు నాఁడు
పప్పుగూరలు నన్నము భక్ష్య భోజ్య
సహితముగ మూటగాఁ గట్టి చల్ల నేయి
పాత్రలను గూర్చి పంపఁగాఁ బదిలముగను- ౭౮

గీ. తెచ్చి ముందరనుంచినఁ దృప్తిదీర
భోజనముచేసి సంతోషమున వచించె
"వత్స! నాతోడ వచ్చెదవా" యటంచు
వత్తునన, మెచ్చి "నేఁడురావలదు ముందు- ౭౯

గీ. వచ్చెదవు గాక" యని కృప వచ్చిమిగుల
కరమున శిరమ్ము గాత్రము కలయ దువ్వి
దీవెన లొసంగి గురుపాద తీర్థమిచ్చి
వేగులోపల నెచటికో వెడలి పోయె. ౮౦

క. పరిపక్వదశను మనుజుని
పరిపూర్ణుని జేయఁగోరి పరమేశ్వరుఁడే
గురురూపున నరుదెంచును
గురుఁడే ప్రచ్ఛన్నహరుఁడు గురుతెఱఁగినచోఁ. ౮౧

గీ. ఓనమాల్ దిద్దఁబెట్టి గుణోత్తరుఁడగు
దేశికునియొద్దఁ జదివింపఁ దీవ్రబుద్ధి
వర్ణసముదయములనేర్చి వ్రాయఁ జదువ
దక్షుఁడై గణితమునఁగూడ శిక్షితుఁడయి. ౮౨

గీ. అమరకోశము బాలరామాయణమ్ము
భాగవత భారతాది సుభాషితములు
పఠన మొనరించి జిలిబిలి పద్దెములను
వ్రాయఁగా సాగె ప్రాఙ్జన్మ ప్రతిభ వలన. ౮౩

గీ. దోషరహితము "గర్భాష్టమే" యను శ్రుతి
గాన నుపనయనము చేయఁ గాఁ దటియుని
మాను సంస్కార మొనరించి, మంత్ర మొసఁగ
స్నానమును సంధ్య గాయత్రి జపము సలిపి. ౮౪

గీ. పీతిహోత్రుని సేవించి విహితమైన
బ్రహ్మచర్యము నడుపుచు వామనుఁ డన
భావిఫలములు ప్రేరింప బాలుఁడయ్యు
శ్రీగిరికి నేగె నెవరితోఁ జెప్పకుండ. ౮౫

గీ. పోయి పరమేశ్వరుఁడె మార్గ బోధకుఁడుగ
శిఖరమును గాంచి సన్నుతిఁ జేసి మ్రొక్కి
కొండ పైకేగి మల్లేశు గుడిని జుట్టి
ధూళి దర్శన మొనరించి తుష్టి గాంచె. ౮౬

క. శ్రీమత్స్య రూప ధారీ!
సోమక దానవ విదారి శుభ సంచారీ!
కామిత ఫల సహకారీ!
శ్రీమహిళా చిత్తహారి సింధు విహారీ! ౮౭



# స్వయంప్రకాశ ప్రబోధము

## తపోవన పర్వము

ఉ. శ్రీవసుధాకళత్ర! అతసీసుమగాత్ర! సరోజనేత్ర! సం
భావనపాత్ర! సాధుజనపంకజమిత్ర! సురారిజైత్ర! భూ
దేవమునీంద్రమిత్ర! అఘదీర్ఘలతాచయదాత్ర! సర్వలో
కావనదక్ష! సైన్యపతి హస్త సమర్పిత వేత్ర! పత్రిపా! ౧

క. నరహరివై సుర వైరిని
దురమునఁ బరిమార్చి, కరుణతోఁ బ్రహ్లాదుఁ
బరిరక్షించిన నీమృదు
చరణమ్ముల కెఱఁగి, కృతిని సాగింతు హరీ! ౨

గీ. అవధరింపుము శ్రీగిరియం దతండు
మంత్ర తంత్రములను గురు మహిమఁ గాంచి
తపము గైకొనె భ్రమరాంబ కృప గడింప
ముక్తినిధి గాంచ భవబంధములను ద్రెంప. 3

గీ. మేలుకొని, లేచి, తానుషఃకాలమందు
దైవమును వేడి, కాల్యకృత్యములఁ దీర్చి,
పోయి పాతాళ గంగలోఁ బూర్తి చేసి,
స్నాన సంధ్యాదు లభిషేక జలము తెచ్చు. ౪

సీ. అభిషేక మొనరించు నర్ధేందుమౌళికి
నమకచమకముల నమ్రుఁడగుచు
పూజించు బత్రిచేఁబూలచే "ఓంనిధ
నపతయేనమ" యని నాగభూషు

కంద మూల ఫలాళి గజ చర్మధారికి
నుపహార మర్పించు 'నో'మ్మటంచు
స్తవ మొనరించు "నాత్మాత్వ"మ్మటంచు "న
మశ్శివాభ్యామ్మని" మంజుఫణితి.

గీ. వందనము సేయు సాష్టాంగ వైభవమున
మంత్రమున జపియించు నుమా కళత్రు
ధ్యాన మొనరించు నిశ్చల మానసమున
భక్త వరదుని మల్లేశుఁ బ్రతిదినమ్ము. ౫

గీ. అమ్మ వారికి మ్రొక్కి, దర్భాసనమున
బద్ధ పద్మాసనస్థుఁడై, బాల యనెడి
మంత్రము జపించి, నిశ్చల మానసమ్ము
నాత్మలోఁ జేర్చి, గాఢసమాధి నిలుచు. ౬

గీ. పుట్టలో సర్పమును బట్టి బుట్టఁ బెట్టి
పాఱిపోనీక లాగుట బడలి సడలి
పొడిచినను బడగ విప్పని పోల్కి తనదు
మానసము దూకుడెల్లను మాన్పి గెలిచె. ౭

గీ. భానుబింబము నడిమింట భాసిలంగ
శ్వాస మెడలించి మెల్లగా నాసనమ్ము
విడిచి, కన్నులు నీటితోఁ దుడిచి లేచి
మూలఫలముల నాఁకలిఁ దూలఁబుచ్చు. ౮

గీ. అంత విశ్రాంతి సేకొని, కొంతవరకు
సృష్టివైచిత్ర్యమును గాంచి స్రష్టఁ బొగడి
ఆత్మ పరమాత్మలకు భేదమరసి, కనక
సర్వము మహేశ్వరుండని సంతసించు. ౯

గీ. భానుఁ డపరాబ్ధిఁ జొర సంధ్యవార్చి, పిదప
అమ్మవారి పాదార్చన మాచరించు
కడిమి పూవుల మల్లేశుఁ గని నుతించు
బండపై వస్త్రమును వైచి పవ్వళించు. ౧౦

గీ. ద్వాదశాబ్దము లీ రీతి దైవ నియతి
గురుని కరుణయె తోడుగా జరగిపోవ
మంత్రము ఫలించెఁ దాపస మహిమ లొదవె
తాపము జనించి భ్రమరాంబ తలఁచెనిట్లు. ౧౧

గీ. "బాలుఁడనుకొంటి నౌర! యీపాటివాఁడె!
నన్ను వశవర్తిని గఁ గోరుచున్నవాఁడు
స్థైర్యమును, ధైర్యమును, బుద్ధి, సత్వశుద్ధి
అరసి చూచెదఁ గాక నేఁడ"నుచుఁ దలఁచి- ౧౨

సీ. పాప గన్పడునట్టి ఫాలభాగముతోడ,
బొమలదిద్దిన చుక్క బొట్టు తోడ
వాలుఁగన్నులతోడ నీలవేణికతోడ
నోరూరు కెమ్మోవి సొరుతోడ
కమ్మల రుచి మించు గండభాగములతో
నవ్యచంపక రమ్య నాసతోడ
తొలకరి నునుమించుఁ దులకించు మేనితోఁ
గలదు లేదనునట్టి కౌను తోడ

గీ. బాల రవిఁబోలు జల్తారు వలువగట్టి
నీలిరవికను గుబ్బలు నిక్కఁ దొడిగి
గంధమును పున్గు కస్తూరి గమగమ యన
మొలక నవ్వుల బాల సమ్మోహినియయి- ౧౩

గీ. వచ్చి యొయ్యారముగ నంట వచ్చుటయును
మనము చలియింప నిది యేమి మాయ యనుచు
స్థైర్యము వహించి గురుని పాదములఁ దలఁచి
అమ్మ! నిలుమని కేల్మోడ్చి యనియెనిట్లు. ౧౪

గీ. తల్లులకుఁ దల్లివగు నీవె దయఁ దొఱంగ
తల్లియని యేరిపదములఁ దలను వ్రాల్తు
పాలు విసమైన నేరీతి బ్రదుకు శిశువు
కంచెయే చేను మేసినఁ గాచు నెవఁడు.'' ౧౫

గీ. అనుచు సాష్టాంగ వందనం బాచరించి
లేచి నిలువఁగ మోమున లేతనగవు
తొలుక, వాల్చూపులను జూచి తోయజాక్షి
జలదమునఁ దూఱు మెఱుపునాఁ దొలఁగి చనియె. ౧౬

గీ. ద్వాదశాబ్దములయ్యె నే వచ్చి యిటకు
కానరారిట్టి కాంత లెక్కాల మందు
భువన మోహినియై నన్ను మోసగింప
బాల యీలీల వచ్చెఁ గాఁబోలు, మేలు. ౧౭

గీ. గురుని కారుణ్యమున మేలుకొంటిఁగాక
తగునె యీచేత తల్లికిఁ దనయునందు
భావభవు నీరుచేసిన భవుఁడు గాక
తన పరీక్షకు నేనెవ్వో తగినవాఁడ! ౧౮

గీ. గురుని రూపము మనమునఁ గుదురుపఱచి
మానసము వంచి యింద్రియ మదమడంచి
చిత్తమును నిశ్చలమ్ముగాఁ జేసికొనియె
మాస మటువోవ నొక శుక్ర వాసరమున ౧౯

సీ. పసుపు కుంకుమ రేఖ ఫాలభాగము తోడ
తమ్మెల వ్రేల్ పుఱ్ఱె తలలతోడ
నిప్పులు గురియించు నేత్రయుగ్మము తోడ
మడమలంటెడు పల్ల జడల తోడ
బలితంపు నిడుకోరపండ్ల నిగ్గులతోడ
బుసలు గొట్టెడి బుఱ్ఱ ముక్కుతోడ
పుక్కిళ్ళకెక్కువై బుగ్గలడిగు నల్ల
నాకి వైచెడి గొప్ప నాల్కతోడ

గీ. మెదడు గందము పూసిన మేని తోడ
కటికి చీకటి నెమ్మేని కాంతి తోడ
పచ్చి యేనిక చర్మంపు పైట తోడ
మొలకుఁ జుట్టిన పులితోలు వలువ తోడ- ౨౦

గీ. పొడుగు కొమ్ములు గల దున్నపోతు తలను
శూలమున గ్రుచ్చి ఖడ్గంబు డాలు దాల్చి
గంటలును మువ్వలును మ్రోగ గంతులిడుచు
కాళి కంకాళిని సమాధిఁ గానఁబడియె. ౨౧

గీ. ఆర్పుచును బొబ్బలిడుచు నోరంతఁ దెఱవ
గుండె ఝల్లన స్మరియించి గురుని పదము
మంత్రము జపించి ధైర్యము మదిని దాల్చి
మ్రొక్కి నిలుచుండి పలికె నెమ్మోము వంచి. ౨౨

గీ. తల్లి నిను జేరఁగాఁగోరి తపముఁ గొంటి
పండె నేటికి దిగమ్రింగు పండు రీతి
స్థూల సూక్ష్మ శరీరముల్ చొచ్చిన నిను
కారణమ్ము తనంతనే కలిసి పోవు. ౨౩

గీ. కలుగు నీనుండి స్థూలము కలియు నిన్ను
నడుమ గంతులు వైతువు నాది యనుచు
నక్కలును గుక్కలును బీకు బక్క తనువు
భోజ్యమగునేని నీకు నేఁ బూజ్యతముఁడ. ౨౪

గీ. అనఁగఁ దలయూచి, కనరాక, యంబిక చన
మాయు రే! మాయ! నన్నెంత మాయ చేసె
అనుకొనుచు లేచి, నిత్యకృత్యములు దీర్చి,
బాలతాపసుఁ డడలక పవ్వళించె. ౨౫

గీ. అంత నొకనాఁడు పఱచి చిత్రాసనమ్ము
స్నానము ముగించి జపవిధి సలుప రాగ
పీఠమంతట నెఱ్ఱదే ల్వొఱఁగు దోప
కొండి పైకెత్తి యుండ సంకోచ పడక. ౨౬

గీ. "ఎనుబదియు నాల్గు లక్షలై యెసఁగు జీవ
జాల మంతయుఁ బంచభూతాళిఁ గల్గు
పంచ భూతములకు మూల ప్రకృతి వీవ
కుండలకు మూలమౌ మట్టి యుండ వోలె. ౨౭

గీ. కాన నీదయ కొలఁది నీ కారణముగ
దర్శనంబిచ్చితివి చాలు ధన్యతముఁడ
కప్పలో వెల్గు నీవెల్గు గనెడి నేను
తోలుఁగని డీలుపడ నంత బేల నేమి!" ౨౮

గీ. అనుచు వినుతించి మ్రొక్కఁగా నడఁగెఁ దేలు
సలిపె జపవిధిఁబూర్వ ప్రశాంతిఁ దపసి
ఒక్కనా డెల్లుబంటియై యొదిగి వెనుక
పట్టెఁ దల నాతఁడును మెడఁబట్టె యులికి. ౨౯

గీ. కన్నులను విప్పి చూచి నీకరుణ నన్ను
పాల ముంచుము! నీళ్ళ లోపలను ముంచు!
ఎట్లు చేసిన నీభారమే యటంచు
నమ్ముకొని యుంటిఁ బోట్లేలు నమ్మినట్లు. 3౦

గీ. అనఁగఁ గనరాక భల్లూక మడఁగె నందె
మబ్బు విచ్చినగతి నాత్మ కుబ్బు దోఁచె
బడలికలు దీఱె మేనికిఁ బటిమ గలిగె
సందియము వీడె మదికి నానంద మెసఁగె. 3౧

గీ. త్రికరణమ్ముల నొకటిగా దిట్టపఱచి
నమ్మి కొలిచెడి భక్తుఁడు నాకు వీఁడు
శుభము, నశుభము, సమముగాఁ జూచు సుమతి
యనుచు నారాత్రి మల్లేశు ననుమతి గొని. 3౨

సీ. పూర్ణచంద్రుని కాంతిఁ బోలుచు నెమ్మోనితోఁ
గరుణారసము జాఱు కనులతోడ
మల్లికా కరవీర మాలికా కలితమై
కప్పు కాటుక లీను కొప్పు తోడ
తాటంక రుచులతోఁ దనరు చెక్కిళ్ళతో
ముక్కెర గల నిక్కు ముక్కుతోడ
తళతళ జల్తారు ధవళాంశుకము తోడఁ
బ్రాభాతరుచి పట్టు రవిక తోడ

గీ. జాళువా బంగరను మేని చాయ తోడ
పునుగు కస్తురి కుంకుమ పూత తోడ
రత్నభూషలు దాల్చి సంభ్రమము దోఁక
పైడి కుంకుముబరణి చేపట్టి వచ్చె. 33

గీ. "వత్స! నీతపమును మెచ్చివచ్చి యుంటి
మెచ్చె మీతండ్రి కళ్యాణ మిచ్చె నీకు
పొమ్ము! పెండిలి గను"మని బొట్టుపెట్టి
మనవియని మ్రొక్కి, చెప్పఁబో మాయమయ్యె. ౩౪

గీ. పండి జడివాన రాలిన పంట వోలె
అంబ కరుణార్ద్రదృష్టి నేనంది కూడ
వ్యర్థమాయెను దురదృష్ట వంతుఁడఁ గద
తపము లేకున్నఁ బెండ్లాము తక్కు వగునె! ౩౫

గీ. ఎన్ని కల్పము లాయెనో యెఱుఁగరాదు
ఘోర సంసార వారాశిఁ జేరి నేను
చుట్టి తిరుగుచునున్నాఁడ సుడులలోన
ఒడ్డు కనఁబోవ నాతల్లి యడ్డదేల! ౩౬

గీ. అమ్మ! నిను వేడఁ గృప లేశమైన లేక
తొయ్యలిని జేరి దానికి దోసిలొగ్గి
మ్రొక్కుమనియెదె? నేఁగోరు మోక్షమేడ!
పట్టి బంధించు సంసార పాశమేడ! ౩౭

గీ. ముగురుమూర్తుల కాధార మూర్తి వీవ!
లోక కళ్యాణమును గూర్చు టీకవీవ!
ప్రకృతి పురుషుల సంబంధ బంధమీవ!
తత్వవేత్తలు దర్శించు తత్వమీవ!! ౩౮

గీ. నీదు పాదము లూతగా మీఁది కెగయ
కోరి, వచ్చిన వన్నెల జాఱి విడువ
ద్వాదశాబ్దిగఁ దపము వివాహమునకొ!
కొఱఁతవడునొక్కొ! కులమింటి కోతి యొకతె! ౩౯

గీ. తల్లి! దయఁజూడు పెండ్లిని దలఁపవలదు
తపము చేసెద నీపాద తలమునందు
ఆజ్ఞయిడు మంతెచాలు నేఁ బ్రాజ్ఞుఁడనయి
పుణ్యగతులకో; ముక్తికో; పోవువాఁడ. ౪౦

గీ. అనుచు నాలయముననున్న యంబ కెఱఁగి
చెప్పికొని స్వస్థుఁడై నిద్రఁ జెంది యుండ
స్వప్నమునఁ బూర్వరూపాన వచ్చి నిలిచి
పలికె నీరీతి గంభీర భాషణముల ౪౧

గీ. "తనయ! నాయాజ్ఞ నీవేల దాటినావు
సాగవలె నీదు సంతతి జగతి మీఁద
వలదు పో! పొమ్ము! వసియింప వలనుగాదు
ఈశ్వరాదేశమిది దీని కెవ్వరడ్డు". ౪౨

గీ. పలికి యీరీతి భ్రమరాంబ తొలఁగి చనిన
మేలుకొని చింతనొంది యీ మీఁద నెట్లు
చేయఁగాఁదగు నెవరితోఁ జెప్పికొనెద
ఈశ్వరుఁడు లేఁడె యాతని కెఱుకపఱతు. ౪౩

గీ. అనుచు మఱునాఁడు కాల్యకృత్యములు తీర్చి
వచ్చి వలగొని భక్తితో వందనమిడి
పూజలొనరించి సూక్తులఁ బొగడఁ దొడఁగె
అంజలిని బట్టి శంకరు నధికభక్తి. ౪౪

గీ. "సురల, కసురులకును, మహానివరుల, కఖిల
యోగులకు, భోగులకు, రాజభోగులకును,
పాములకు, గాములకు, ముక్తి కాములకును
దేవుఁడవు నీవ! సేవింప దిక్కు నీవ!. ౪౫

గీ. ఏటిలోనీరు ధారగా నెత్తిపోసి
బూడిదను బూసి పత్రియుఁ, బూలువెట్టి
రెండుచేతులు జోడింప 'దం'డ నెదవు
సులభుఁ డెవ్వాఁడు? నీకంటె సురలలోన. ౪౬

గీ. ఏటిలోనీరు, నడవి మారేటి చివురు
కాటిబూడిదయే కాని ఖర్చులేదు
నిన్ను సేవింప దానికే మిన్నుముట్టి
భుక్తి ముక్తుల నొసఁగెడి బోళవు గద! ౪౭

గీ. జయ మహాదేవ! గౌరీశ! జయగిరీశ!
జయ సురాసుర వందిత చరణ యుగళ!
జయ సదాశివ! వృషభాంక! చంద్రజూట!
జయ పరాత్పర! మల్లేశ! శరణు! శరణు!! ౪౮

గీ. అమ్మతోఁ జెప్పి నన్నిటు లంపఁదగునె!
చెప్పికొనినట్టి మనవి నీచెవి సొరదెటు!
కరుణ గలవాఁడ వందురు కఠినుఁడగుదె!
భోగిభూషణ! నీవాఁడ బ్రోవఁదగును! ౪౯

గీ. శంకరా! లోకశంకరా! సాధుజన వ
శంకరా! బ్రోవు నీపాద కింకరుఁడను"
అనినఁ దలయెత్తి చూడఁడా యయ్యొ కొయ్య
చెవిటిమల్లయ్య మోమోటఁ జెప్పలేక ౫౦

గీ. ద్వాదశాబ్దాల సేవ స్వాతంత్ర్యముంట
అడవి రోదనమట్లు తన్నరయకుంట
విసుగు పుట్టిన కోపించి వెఱపు లేక
న్యాయ నిష్ఠురముల దూఱె నందివాహు ౫౧

గీ. జన్నిద మ్మొక్క-పా, మొండు జడలు ముడువ,
ఒకటి కటిసూత్రమును, హారమొకటి, హస్త
కంకణమ్ములు, కడియముల్, కమ్మలునవె
గరళ కంధర! నీమేను కటికి విసము. ౫౨

గీ. కంటిలోఁజిచ్చు మేనెల్ల కాటిబూది
అంగిట విసమ్ము కట్టలే దంబరమ్ము
పునుకపేరులు బిచ్చము పొట్టకూడు
దయ్యముల జాత రేప్రొద్దు తగును మేళ! ౫౩

గీ. చాలవాయివి! యొరులు నీచాయఁ బాయ
శూలమేటికి! బెబ్బులి తోలు నేల!
దిస్సమొలఁజూచి యెవఁడు నిన్ దేవుఁడనును
తిరిపెగాని నెవండు నిన్ దిరిపెమెత్తు? ౫౪

గీ. అంతకుని మ్రింగు నా ప్రళయాంతకుఁడవు
బాలకుని నన్ను మ్రింగుటేపాటి నీకు
ప్రాణములతోడఁ బొమ్మని పంపినావు
ఇల్లు మ్రింగెడి వానికి గొళ్ళె మెంత! ౫౫

గీ. వెఱ్ఱి చేటాయి నీ వరవిధము దలఁప
తగులఁ దగులును దప్పినఁ దప్పు-నాకు
ఆజ్ఞ యిమ్మది పదివేలటంచు మ్రొక్క
'హరి'యనం "డచ్యుతా"యనం డా శివుండు. ౫౬

గీ. దారిలో నాల్గుపగ్గాల దూరమరిగి,
నిలిచి, యొక బిల్వవృక్షపు నీడలోన
క్రిందికిని జూడఁగాఁ దల క్రిందయినటు
స్వర్గమునుండి భూమికి జారినట్లు- ౫౭

గీ. కొండపైనుండి లోయలోఁ గూలినట్లు
పిడుగులురలఁగ మిన్నుపైఁ బడినయట్లు
డెందమున దోపఁబోలేక డిందువడుచు
దేశికుని గూర్చి యిట్లు ప్రార్థింపఁ దొడఁగె. ౫౮

గీ. తల్లి, తండ్రియు, గురువును, దైవ, మనగ
నలువురుందురు రక్షకుల్ నరుల, కందు
తల్లిదండ్రులు బాల్యానఁ దరలినారు
దైవమా! నేడు దయమాలి తఱిమినాఁడు. ౫౯

గీ. హరుఁడు కోపింప రక్షించు గురువరుండు
గురుఁడు కోపింప రక్షించు దొర నెఱుంగ
సద్గురూ! నీదు పదములె శరణమింక
దర్శనంబీవె నీవాఁడ దండమిడెద! ౬౦

గీ. గోచిపెట్టని నాఁడె నన్ బ్రోచినావు
ప్రోచెదే! నేఁడు సంసార తోయరాశి
పాహి! మాం పాహి! యని ప్రేళ్ళు పదియుఁ గూర్చి
యోగులుండెడి యుత్తర భాగమునకు— ౬౧

గీ. మ్రొక్కి గురురూపు మనమునఁ జిక్కఁబట్టి
వేడికొన యోగశక్తిచే వినఁబడనట
దేశికుఁడె శిష్యునకు మహాదేవుఁ డగుట
వాని చింతను బోనాడఁ బూనె మౌని. ౬౨

క. మందరధర! బృందారక
వందిత చరణారవింద! వైకుంఠ! సదా
నందా! నంద సునంద పు
రందర ముఖ దేవ పూజ్య రాజీవాక్షా! ౬౩

---

# స్వయంప్రకాశప్రబోధము

## గురూపదేశపర్వము

క. శ్రీరామా చిత్తహరా!
ఘోరాహితదనుజవీర కుంజకుఠారా!
పారావార గభీరా!
నారాయణ సర్వలోకనాయక శౌరీ! ౧

క. మోదమ్మున నిగమమ్ములు
వేదాంతులు నిన్ను విశ్వవేద్యుఁడ వనుటన్
శ్రీదయితా! నీదయయె యు
పాదానము జీవులకు శుభస్థితిఁ గాంచన్. ౨

క. శ్రీగిరిని దపోవనమున
ఆగతి శిష్యుండు వేడ నాతనికి దయన్
యోగీశ్వరుండు దెల్పిన
భాగమిది గురూపదేశ పర్వము వినుమా! ౩

గీ. గురుఁడు శిష్యుని వేడికోల్ గుఱుతెఱింగి,
మానసము దారితీయ విమానమట్లు
ఱెక్కలను విప్పి వ్రాలెడిపక్కిరీతి
శ్రీగిరిని వ్రాలె హిమ శైల శిఖరము విడి. ౪

గీ. వచ్చి నిలిచిన యాచార్యవర్యుఁ జూచి,
కటికి నిఱుపేద మేరువుఁ గాంచినట్లు
కంఠ మరికట్ట మేనికి గగురు పుట్ట
చుట్టి మున్మారు పాదముల్ పట్టి మ్రొక్కె. ౫

గీ. అర్ఘ్య పాద్యము లొసఁగి, దర్భాసనమిడి,
కూరుచుండిన గురునాథు కుశలమడిగి
పాదములు సోక సాష్టాంగ పడిన శిష్యు
ప్రక్క గూర్చుండఁ జెయిసూపి పలికె నిట్లు ౬

గీ. "కుశలమా వత్స! ఆరోగ్యవశమె మేను!
స్నానపానములకు శుద్ధజలము గలదె!
కందమూలఫలమ్ములు గలవె యిచట!
శీతవాతాతపములచేఁ జిక్కవుగద! ౭

గీ. ప్రాలుమాలవుగద లేవ బ్రాహ్మియందు!
ఆహ్నికము దీర్తువా తటియైన యపుడ!
ప్రాణులందెల్ల నీశ్వర భావ ముంతె!
అనయ మశ్రద్ధ దుర్మేధలను త్యజింతె! ౮

గీ. భక్తియును. శ్రద్ధ, యాస్తికత్వమును, యమము
నియమమును. దాల్తె! యాసనజయము గలదె!
ప్రాణసంయమనము వశపడెనె! మనము
నిలుచునా ధ్యాననిష్ఠలో నిశ్చలముగ! ౯

గీ. ఇంద్రియమ్ములైదు మనముతో నేకమగుచు
పండువెన్నెల వలె నుండు బయలు గాంచి
వెల్లివిరిసెడి యానంద వీధి దాటి
ఎఱుక మఱపుల కేకమౌ గుఱుతు గంటె!. ౧౦

గీ. దేవి నీయందు, నీవునా దేవియందు
కలసియున్నట్లు భావింప వలఁతివిగద!
కూర్మయంత్రము భూశుద్ధిఁ గూర్తువుగద!
స్థిరముగా నాసనములను సిద్ధపఱతె! ౧౧

గీ. జపము నక్షరలక్షగా జరిపినావె!
దశము శతము సహస్రమ్ము తత్తదంశ
తర్పణములను హోమ సంతర్పణముల
కొరవడినదేది? యిందొడఁగూడె నేది? ౧౨

గీ. నూతనాభ్యాసములఁ దెల్పెనో క్రమముగ!
మంత్ర బీజాక్షరములను మఱచినావొ!
సంశయము గల్గెనో ధ్యాన సమయమందు!
తపము సేయఁగ దార్ఢ్యము తగ్గెనొక్కొ! ౧౩

గీ. విఘ్నములు నిన్ను విడువక వెంటఁ బడెనొ!
దేవి మాయలలోఁ జిక్కి దిగులువడితొ
ఈసడించెనొ నీచర్య కీశ్వరుండు!
నన్ను దలఁచిన పనియేమి?" యన్న ననియె. ౧౪

గీ. "కమఠము తలంపుచే బిడ్డఁ గాచినట్లు
హే ప్రభూ! నీదుకారుణ్య మెల్ల ప్రొద్దు
రక్షయైయుండ నాకుఁ గొఱంతగలదె
అంబ 'పెండిలికమ్మ'ని యడలు గొలిపె. ౧౫

గీ. తావకానుగ్రహమె మార్గదర్శకముగ
మేరువెక్కిన నన్నమ్మవారు మఱల
ఘోర సంసార వారాశిఁ జేరుమనుట
తపము పోలివోయె మదిని సంతాప మొదవె. ౧౬

గీ. బిచ్చమొసఁగక కుక్కను విడిచినట్లు
మోక్షమిడలేదు సరి పెండ్లిముచ్చటేల!
యోగినై జోగినై, యెట్లొ బాగువడనె
ముక్తినిధి డాసి పడుదునే ముఱికిగుంట! ౧౭

గీ. కోమలిని వీడి, తపము గైకొనును గాని
తపము విడనాడి, కోమలిఁ దగులు నెవఁడు!
మేడపైకెక్కి జారిన మేలు గలదె!
ముఱికి పడియను గంగగా మునుఁగఁ దగునె! ౧౮

గీ. అనెడి శిష్యుని పలుకుల కలతినవ్వు
మోమునందోప శ్రీగురుమూర్తి పలికె
భ్రాంతి పడఁబోకు గోరంత భయములేదు
ముక్తియనఁ బిల్లి గొనిపోవు మాటగాదు. ౧౯

గీ. దేవి తా ముక్తి నిడ నీవు దీసికొనెదొ!
బంధ ముండినఁ గద! ముక్తి బడయఁ గనుట
బంధమేలేక ముక్తితోఁ బని యెవరికి!
బంధ మోక్షములు లేని పరుఁడ వీవు! ౨౦

గీ. కారణము మది బంధమోక్షములు గలుగ
తనను తనచేతనే కాచుకొనఁగ వలయు
మనమునకు లోఁగి యింద్రియ గణములున్న
బంధువౌ మది యటుగాదొ పరమవైరి. ౨౧

గీ. గుణము లొండొంటితోఁ గూడుకొనుచు, విడుచు,
తిరుగుచుండును నీకేల దిగులు పడఁగ
వానిదీమాయ, మాయకు వశపడకుము
గుణములకు, మూలశక్తికి, గురుఁడవీవు. ౨౨

గీ. బ్రాహ్మణుఁడఁ, దాపసుఁడ, లేతవయసువాఁడ,
అనుకొనుట భ్రాంతి యూర్ములకందనట్టి
జనన మరణము లెఱుఁగని శాశ్వతమగు
సచ్చిదానంద మేనంట శాస్త్రమతము. ౨౩

గీ. నిత్యుఁడవు, నిర్గుణుండవు, నిర్మలుఁడవు
సర్వమయుఁడవు, జగము నీచాయఁగలుగు
అభయ మద్వైతమౌ, ద్వైతమౌ భయంబు
అభయమౌ "నహంబ్రహ్మాస్మి" యని యెఱుఁగుట. ౨౪

గీ. దేహమే నీవు గావన దీనివలన
కలుగు సంబంధ బంధుల గమనమేల!
వచ్చుదానిని రానిమ్ము మెచ్చుకొనక
పోవుదానిని వగవక పోవనిమ్ము! ౨౫

గీ. కమలజుని యాజ్ఞఁ దొలి మేని కర్మవలన
వచ్చుచును బోవుచుండును వస్తుచయము
వానికై పొంగుఁ గ్రుంగును బాలిశుండు
పండితుఁ డుపేక్షతో నుండుఁ బ్రవిమలమతి. ౨౬

గీ. భ్రాంతి విడనాడవలెఁ గాని వస్తువులను
వదలసాగిన దేహము వరకుఁ బోవు
దేహమే లేక ముక్తి సాధించు టెట్లు!
శ్రవణ మననాదికములను సలుపు టెట్లు! ౨౭

గీ. వస్తువుల వీడి, భ్రాంతిచే వానిఁ దలఁచు
వానికంటెను భోగ్యాళి వలన భ్రాంతి
వీడి వానిని సేవించువాఁడు మేలు
రాగయోగరతుల్ సరి బ్రహ్మనిరతి. ౨౮

గీ. మూడు పురుషార్థముల సారమును గ్రహించి
చివర పురుషార్థమును జెందఁ జేటు రాదు
ఘనుఁడ నేనని మొదటనే గంతు వేయ
దొరలి పడవచ్చుఁ గాలంత విఱుగవచ్చు. ౨౯

గీ. తపసులై, బ్రహ్మచర్యము తాల్చి, పిదప
గోతిలోఁ బడ్డవారి, లోఁ గుములువారి,
పొరలుకొని లేచి, ముక్తికిఁ బోవువారి
అందు నిందును జెడువారి, నరసి కనుము! 30

గీ. సౌభరియు, మాండకర్ణియుఁ, జ్యవనఋషియు
కండు పార పరాశర కౌశికులును
ఋష్యశృంగ విభాండక కృష్ణ మునులు
తాపసులె యయ్యుఁ గాంతల తవులు గనిరి. 31

గీ. ఆదిశక్తి మహాదేవి వేదవేద్య
భ్రూద్వయీమధ్యఁ గుంకుమ బొట్టు పెట్టి
పెండ్లి కొమరుని గావించె విభుని యాజ్ఞ
తప్పదిక పెండ్లి ధరణిపైఁ దరణి వడిన. 32

గీ. విహాగ మేగెడి త్రోవ, పిపీలిక చను
మార్గమన రెండుగలవు సన్మార్గమంద్రు
చెఱుపు నొందక సాగుట చీమ దారి
కష్టతరమంద్రు విహాగపు గమన పథము. 33

గీ. పండియున్నట్టి పండుపైఁ బక్షి వ్రాల
ఉండెనా యుండు, లేకున్న నూడిపడును
ఉండినను ముక్కుతో గీరి యుమిసివైచు
తోలు తొంబకల విడనాడి తొలఁగి చనును. 34

గీ. చీమ మూలము మీఁదుగాఁ జేరి ఫలము
బెజ్జమును వేసి రసమెల్లఁ బీల్చికొనుచు
సంతసించుచు నానంద సాగరమున
సౌఖ్యమును గాంచుఁ జెడదెట్టి సమయమునను. 35

గీ. వినుము! చెప్పెద శ్రద్ధగా వీనులుంచి
జననమగువాఁడు నాలుగు ఋణము లుడుప
బాధ్యుఁడగు పితృ దేవర్షి వరుల నరుల
ఋణములన వానిఁ దొలఁగించు కొనుట వినుము. ౩౬

గీ. బ్రహ్మచర్యముచే వేదపఠన ఋషుల
యజ్ఞ యాగ హవిస్సుల నమరవరుల
సంతతిని శ్రాద్ధములఁ దృప్తిసలిపి, పితల
అతిథిపూజల మనుజుల యప్పుతీర్పు. ౩౭

గీ. తలలుక్రిందుగఁ బాదముల్ తరువుఁ గూర్చి
వ్రేలుచుండి జరత్కారు పితరు లతని
సుతులఁగని గతుల గల్పింపఁ జూడుమనిన
పెండ్లియయి, కాంచి యాస్తీకుఁ, బితలఁ దనిపె ౩౮

గీ. తపము చేయఁడె! వ్యాసుఁడు తనయుఁ గోరి
శివగురుఁడు సంతతికి గాదె! శివుని గొల్చె
విను మృకండుడు తపము గావించెఁ బుణ్య
గతికి బోరామి సంతతి సాగకుంట. ౩౯

గీ. అంధపుత్రకులకు గతి నాస్తి యంచు
శిష్యునకు దేశికుఁడు వేద శిక్షఁ దెలిపె
వంశ విచ్ఛేదమును జేయ వలదటంచు
సుతుఁడు సుతుఁడన్న నీకింత చులుకనగునె! ౪౦

గీ. అనిన గురుమూర్తి వాక్కుల కంజలి యిడి
మనవి విను సుతులఁ గాంచుట మంచిపనియె!
బ్రహ్మసూత్రములను వ్రాసి ప్రౌఢిగనిన
వ్యాసుఁడే "హా! శుకా!" యని గాసి వడడె. ౪౧

గీ. అల మృకండుని యాయాస మడుగ నేల!
తక్కు వారల మాటలఁ దలఁప నేల!
బ్రహ్మవేత్త వసిష్ఠుఁడు ప్రాణములను
విడువఁ బడరాని పాట్లు గావించు కొనఁడె! ౪౨

గీ. సుతులు నూర్వురు పోలిపోవఁ జూడలేక
మోహమను రొంపిలోఁ జిక్కి మునిఁగి తేల
దాని నావంటి వాఁడెట్లు దాటఁ గలఁడు!
అడుసు దిగనేల! పైపైనఁ గడుగ నేల! ౪౩

గీ. విను కుమారక! నీవింత వెఱవనేల!
ఏటి కెదురీదునట్టి పెల్లీతకాఁడు
దిగుడుబావులఁ దిరుగాడ దిగులు పడునె!
బ్రహ్మభావన బలమైన భ్రాంతిఁ గనునె! ౪౪

గీ. భోగి కృష్ణుఁడు, శుకయోగి త్యాగి, జనక
రాజు సమ్రాట్టు, వేశ్యానురాగి వామ
దేవఋషి, పిప్పలుఁడు మాంసజీవనుండు,
కర్మయోగి వసిష్ఠుఁడు, కనిరి ముక్తి. ౪౫

గీ. పరమప్రజ్ఞాననిధి శుక బ్రహ్మఋషికి
గురువు జనకుఁడు తెలిపిన గుఱుతుఁ గనుము
షోడశసహస్రకాంతలఁ జొక్కు హరిని
ఋషు లనాదిగ బ్రహ్మచారిగ వచింత్రు. ౪౬

గీ. త్రిగుణములు మాయ, వానితో జగము మాయ
మాయయన లేనిదే–దాని మహిమఁ గనుము!
అరసి చూచిన బుడకోడి యట్లు మునుఁగు
మఱలఁ దలయెత్తి మానస సరసిఁ దిరుగు. ౪౭

గీ. చోరులింద్రియములు పట్ట నేరకున్న
మీాటి విజ్ఞానధనమెల్లఁ జూఱఁగొనును
బాలునకు బుద్ధి సెప్పిన పగిది చెప్పి,
మరలుపందగు నమ్మాఁగా వెరవుగాదు. ౪౮

గీ. శత్రులును, మిత్రులును, లేరు సర్వసమము
బ్రహ్మము జగముగాఁ గానఁబడును నిజము
తోయనిధి తోయ మలలుగాఁ దోచినట్లు
ఇంద్రజాలములో భ్రమ జెందినట్లు. ౪౯

గీ. ఎండమావుల నీరు లేకుండికూడ
ఉన్నటులఁ దోచదా! జగంబెన్ను మటుల
జాగృతిం దోచి పయిలేమి జగమటంచ్రు
ఇదియె నిజమైన స్వప్నమందేల లేదు! ౫౦

గీ. స్వప్నము, సుషుప్తి, జాగృతి, జనులకొదవు
స్వప్నకారణమగు సూవె జాగరమ్ము
జాగరము కారణము పూర్వజన్మకర్మ
కర్మజన్మము లజ్ఞాన కారణములు. ౫౧

గీ. అల "అహం" "మమ" లజ్ఞానమని యెఱుంగు
అది యనాది, యనిర్వాచ్య, మని వచింత్రు
దాని యుత్పత్తి లయముల స్థాన మీావ
'తత్వమస్యాది' వాక్యార్థ దర్శనమున ౫౨

గీ. 'భ్రాంతి యననేమి! దానిని వదలుటెట్లు!'
అందువా! చెప్పెదను, వీడు సందియములు
బ్రాహ్మణుఁడఁ, దాపసుఁడ, లేతవయసువాడ
అనెడి తనుధర్మములు, డప్పి, నాకటితమి ౫౩

గీ. తవిలి ప్రకృతి నను ప్రాణిధర్మములును
సుఖిని, దుఃఖిని, శాంతుఁడ, సూక్ష్మమతిని
అను మనోధర్మములు, నూర్ములనఁగ నాఱు
తనకుఁ దగిలించుకొనుటయే తప్పు మొదట. ౫౪

గీ. కాఁడు తా నింద్రియమ్ములు, కాఁడు మనము
కాఁడు చిత్తము, బుద్ధ్యహంకారములును
కాఁడు స్థూలము, సూక్ష్మము కారణమ్ము
కాఁడు జీవుఁడు, పరమాత్మగాని, వత్స! ౫౫

గీ. మూడవస్థలు, గుణములు మూడు, కాఁడు
పంచభూతాలు, ప్రాణముల్ పదియు, కాడు
పంచతన్మాత్రలును, మూలప్రకృతి, కాఁడు
వీనినన్నిఁటి నెఱిఁగెడి విభుఁడు తాను. ౫౬

గీ. “సాక్షి, కూటస్థుఁ డీశుఁడు, శాశ్వతుండు
అచలుఁ డచ్యుతుఁ డమలుఁడు హంస, పరమ
పావనుఁడు, సచ్చిదానంద భద్రమూర్తి”
అని నుతింతురు వాఁడె నీ వమల చరిత!. ౫౭

గీ. స్వప్నదశయందుఁ గలుగదు జాగరమ్ము
జాగరూకతఁ గలుగదు స్వప్నమపుడు
ఘనతర సుషుప్తి నివి రెండు కానఁబడవు
ఎఱుఁగు నీమూటి నేది! యాయెఱుక నీవు. ౫౮

గీ. అధికులను సంశయమ్ముల నడిగి వినుము
సములతోఁ జేరి తత్వము సంప్రదింపు
అజ్ఞులడిగినఁ దెలిసిన యది నుడువుము
వాద మెవ్వరితో నీకు వలదు వత్స!. ౫౯

గీ. పెద్ద లెయ్యది సెప్పిన వినుట మేలు
వినినదే చాలు పొమ్మని విసుగు పడకు
వేడి నిట్టూర్పు నైనను విడువఁ దగదు
సాధులకు బాధగా-ఇది వేదమతము. ౬౦

గీ. తపము, హోమము, దానము, జపము, కర్మ
మధిక ఫలమిడు శ్రద్ధతో నాచరింప
దాన నొకకొంత యశ్రద్ధ దవిలెనేని
యిహ పరమ్ముల నిష్ఫల మెఱిఁగి కొనుము. ౬౧

గీ. శ్రద్ధతో సాధుకర్మముల్ సలిపి, ఫలము
భగవదర్పణ మొనరింప భద్రమగును
కర్మ మనవంతు; ఫలము శంకరుని వంతు
కర్మ విడువకు! ఫలముపైఁ గాంక్ష వలదు. ౬౨

గీ. ఇష్టము, ననిష్టమును, మిశ్ర, మనెడి కర్మ
ఫలము త్రికరణశుద్ధిగా బ్రహ్మమునకు
అర్పణము చేయఁ బరమునం దంటదు-ఫల
కామికే బంధకము దీనిఁ గనుము గీత. ౬౩

గీ. భద్రమేదియొ! తనకు నభద్ర మెదియొ!
గుఱుతెఱుంగక యశుభమే కోరు నరుఁడు
బాలకుఁడు కత్తి కేడ్చిన పగిది కాన
"ఏది మంగళమో! దాని ని"మ్మనె శ్రుతి. ౬౪

గీ. లేమి నగువంత నీకన్న లేని వారి,
కలిమినగు పొంగు నీకంటె కలుగు వారి,
చూచి తగ్గించుకొనుము! వస్తువులఁ గాదు
తృప్తి, మానససంబంధి తెలిసికొనుము! ౬౫

గీ. బుద్ధికందని విషయమే మొదలు గాఁగ
శాస్త్ర మెరిగించు; దాన విశ్వాసముంచి
అర్థకామము లొడఁగూర్చు నట్టి తెఱిని
ధర్మమును వీడకుండిన దారి చెడదు. ౬౬

గీ. అనుచు గురుదేవుఁ డీరీతి నాజ్ఞ నొసఁగి
నీడమును జేరు విహంగపు జాడ నేగ
భక్తి శ్రీశైల మల్లేశుఁ బ్రస్తుతించె
తప్పు చేసితి నని మదిఁ దహతహ పడి. ౬౭

గీ. తొండములఁ దాల్చి నడయాడు కొండల నెడి
కరులు, గాలిని గాలెత్తనీని హారులు
పురమునం, దజ్ఞముఖు లంతిపురిని, గలుగు
వాఁడు తొలిమేనఁ బూజించినాఁడు నిన్ను. ౬౮

గీ. వలదనిన నష్టభోగ సంప్రదుఁడ వీవు
ఉన్న సర్వస్వము హరించు వెన్న దొంగ
కంఠగత ప్రాణుఁ డగుదాఁక కావఁ డతఁడు
సులభుఁడవు గాన నిన్ గొల్తు సుర లసురులు. ౬౯

గీ. కాష్ఠములు, కలల్, నిముసముల్, గడెలు, జాలు
వారములు, మాసములు, ఋతుల్, వత్సరములు
వర్ణ, పద, వాక్య, పాద, సుపద్యములన
పుటలు, సర్గలు, కాండ సంపుటము లనఁగ- ౭౦

గీ. ముద్రితంబైన యీకాల పుస్తకమున
వ్రాసియుంచిన కథ నాడవలయుఁ గాని
దేవతలకైన దానిని దిద్ద వశమె!
పోయివచ్చెద దయయుంచు భుజగ భూష! ౭౧

గీ. అనుచు సాష్టాంగవందన మాచరించి
అంబ సెలవంది గణనాథు నభినుతించి
ప్రమథుల నుతించి నందిని బ్రస్తుతించి
తల్లివలెఁ బ్రోచు గంగమ్మ తల్లి కెఱఁగి ౭౨

గీ. కొండదిగి, శిఖరము జూచి, కూరుచుండి
మ్రొక్కి, నిను జూచినంతనే ముక్తి యండ్రు
శ్రీగిరీ! పోయివచ్చెద సెలవొసఁగుమ!
అనుచు వినుతించి చనియె వచ్చిన పథమున- ౭౩

మా. కమలదళ నిభాక్షా! గాన విద్యాతి దక్షా!
నముచి దమన పక్షా! నంద గోబృంద రక్షా!
విమత దనుజ శిక్షా! విశ్వ సంతాప మోక్షా!
కమల నిలయ వక్షా! కార్య నిర్వాహ దీక్షా! ౭౪



# స్వయంప్రకాశ ప్రబోధము

## గృహస్థపర్వము

క. శ్రీవాసుదేవ! సోమక
దేవాహితదర్ప దళన! దీన శరణ్యా!
కోవిదజన సంతారక!
పావన మృదుచరణ! భక్తభవ సంతరణా! ౧

క. నాగేంద్ర తల్పమున సిరి
రాగాధికతం భజింప, ప్రజ్ఞానధనుల్
యోగీంద్రులు చేమోడ్పుల
నాగమసూక్తుల నుతింప సలరు మురారీ! ౨

గీ. చిత్తగింపుము శ్రీశైల సీమ వాసి
అతఁ డడవులు, నగములు, నాలయములు
కోటలును, పేటలును, పండ్లతోటలు, గని
నెమలిపురిఁజేరి వాకిట నిలిచినంత- 3

గీ. అత్తయును మామ చక్కఁగా నరసి చూచి
వచ్చెనని పొక్కు జామాత వచ్చెననుచు
హర్షమునఁ బొంగి మామగా రక్కుఁ జేర్చి
తనకు మ్రొక్కిన భాగినేయుని నుతించి- ౪

గీ. దీవెన లొసంగి పాద్యము తీర్థ మొసఁగి
అన్నపానములను ముదమందఁ జేసి
కూతునొసఁగి వివాహము గూర్పఁదలఁచి
భార్య సమ్మతిఁ గొని లగ్న మార్య లిడఁగ- ౫

గీ. అనుఁగు జామాత శ్రీహరి యని తలంచి
తాను సాలంకృతము సాక్షతము హిరణ్య
దాన పూర్వక కన్యాప్రదాన మతఁడు
సలిపె వైభవముగ బుధుల్ సన్నుతింప. ౬

గీ. వరుస పదియాఱు రోజుల పండువు సన
చనియె మఱుదిన మిలువీడి వనమునకును
దేవరంపాటి వేంకటదేవుఁ జేరి
సలిపె షణ్మాసములు పునశ్చరణ మతఁడు. ౭

గీ. అంత నర్ధాంగి వామాంకమందుఁ జేర
కాపురము చేయుచును కొంత కాలముండి
అత్తవారింటిలో నుండుటనువు గాదు
పూర్వులుండిన మనయూరె పోవఁదగును. ౮

గీ. పండితులపాలి బంగరు కొండ యనఁగ
నేతియప్పన్న యన మహాఖ్యాతి గాంచి
ప్రబలుఁడై యుండె నూర నప్పన్న నేఁడు
అండయగు జ్ఞాతి నగు నాకుఁగొండ వోలె. ౯

గీ. అనుచుఁ దలపోసి మంచిరో జరసి యత్త
మామలకుఁ జెప్పి వారి సన్మాన మంది
వచ్చి భార్యాసమేతుఁడై పంచ నుంట
వీనులను సోక అప్పన్న వెడలివచ్చి- ౧౦

గీ. నాయనా! వచ్చితివె యిన్నినాళ్ల కనుచు
కన్నులను గప్పుకొని, బిగ్గఁ గౌఁగిలించి,
కాళ్లకిడి నీళ్లు ప్రియముగా గారవించి,
ఆసనంబిడి, కుశలము నరసి మురిసె. ౧౧

గీ. అతని యర్ధాంగిఁ బేరమ్మ నాదరించి,
పిలుచుకొనిపోయి లోనికిఁ, బ్రియము చెప్పి,
మనసు మనసున గలియఁగా మాటలాడి,
సోదరికి మిన్నగాఁ జూపె నాదరమ్ము. ౧౨

గీ. అట్టులోకమాస మేగిన యంతలోన
పల్లివారింటి పశ్చిమ భాగమందు
పూరిగుడిసెను జక్కఁగాఁ బూర్తి చేసి
వలయు పరికరములఁ గూర్చి, నిలిపె వారి. ౧౩

గీ. గ్రామమా! క్రొత్త, లోకులఁ గనుట క్రొత్త
వస్తువులు క్రొత్త, భార్యకు వంటక్రొత్త
ఇరుగు పొరుగమ్మలా క్రొత్త, యిల్లు క్రొత్త
చిత్తజుని కొల్వు గొలుచుట క్రొత్త క్రొత్త. ౧౪

గీ. చిత్తజుని నీరుచేసిన శివుని మఱల
చిత్తజన్ముని గొలువఁగాఁ జేసిన విధి
చిత్తజారాతి సేవించు చేతి తోడ
చిత్తజుని సేవ చేయింపఁ జిత్రమేమి! ౧౫

గీ. బొండుమల్లెలు గూర్చిన చెండు తుఱిమి
జేగుఱు మెఱుంగు జల్తారు చీర గట్టి
జవ్వనము సొమ్ము సొమ్ముగా నివ్వటిల్ల
ప్రేమతో భర్త సేవించుఁ బేరమాంబ. ౧౬

సీ. సురనాథుఁ గన్నెత్తి చూడనొల్లమి గాని
పృథఁబోలు క్షమలోనఁ బృథివిఁబోలు
పతిమాట నిరసించి పరువు లెత్తదు గాని
సతిఁబోలుఁ బరిశుద్ధి సవతిఁబోలు

పొరుగిండ్ల కేఁ బ్రొద్దు తిరుగఁ బోవదు గాని
సిరిఁబోలు నేరాలి గరితఁ బోలు
పతివోయి తపియించు పాపమొందదు కాని
రతిఁబోలు నుదుల భారతిని బోలు.

గీ. ఘనతరోద్యోగి, విజ్ఞాని, గర్మయోగి
సుతుల ముప్పుర గాంచె విశుద్ధయశుల
తనకు సరివారు సేవింపఁ దనియ మనియె
పేరు ప్రఖ్యాతి గడియించి పేరమాంబ. ౧౭

గీ. కాల్యముల దీర్చి తానుషః కాల మందు
స్నాన సంధ్యలు, జప హోమ సముదయములు,
దేవతార్చనయును, వైశ్వదేవ విధియు,
చేయు; మున్మున్న యిలుశుద్ధి చేయజాయ. ౧౮

గీ. జలజపత్రము నంటని జలకణమ్ము
చందమున నుండి సంసార సంగి గాక
జనకరాజును మించిన జ్ఞాన ధనుఁడు
ఆచరించుచునుండె గృహస్థ విధులు. ౧౯

గీ. తాను దరియించి సుజనుల దరికిఁ జేర్ప
ధర్మమని యెంచి, విజ్ఞాన దాన మొసఁగ
దేశ సంచారమునకయి దీక్షఁ బూని
శుభదినమ్మున శకున సంశుద్ధి వెడలి- ౨౦

గీ. పేరు గల వారి యిండ్లలోఁ జేరి నియతి
ఆహ్నికముఁ దీర్చి ధ్యానాదు లాచరింప
శిష్టుఁడని జ్ఞానియని పూజచేయ వారు
క్రమముగా నయ్యవారను ప్రభ గడించె. ౨౧

గీ. వ్యాధి గలవారు, భూతముల్ పట్టువారు,
సంతతిని గోరువారు, జిజ్ఞాసువులును,
తంత్రముల, యంత్రముల, మహామంత్రములను
సూక్తులను గాంచి సౌఖ్యముల్ చూఱఁ గొనిరి. ౨౨

సీ. తలలూపి యాలింపఁ దత్త్వముల్ రచియించు
రాజయోగము నాచరణకుఁ దెలుపు
ఆచారవిధిఁ దెల్పు నఖిలధర్మమ్ముల
సాధించు వెరవుల బోధపఱచు
యోగశాస్త్రములోని భాగము లెఱిఁగించు
నష్ట సిద్ధులను విస్పష్ట పఱచు
క్రమ ముక్తియును విహంగమ ముక్తి మార్గముల్
విజ్ఞాన శాస్త్రముల్ విశద పఱచు
బోధ పఱచుఁ బురాణముల్ బుధులు మెచ్చ
సాధనములను నాల్గింట సాధుసేవ
ముక్తికిరవను, శ్రీనాథు భక్తిఁ గొలిచి
పారమును జేర నరజని వచ్చెననును. ౨౩

గీ. భూతి యొసఁగును పాఱి పో భూత గణము
తీర్థము నొసంగు నజ్ఞాన తిమిర మడఁగ
సంతతిని గోర, గోపాల మంత్ర మొసఁగు
తారకము దెల్పు సుజన సంతారకముగ. ౨౪

గీ. కాల మీరీతి సుఖముగాఁ గడచుచుండ
దేశ దేశములను గల్గు ధీరమతులు
శిష్యులై పాదములఁ గొల్చి సేవఁ జేయ
గౌరవము గాంచె గురుఁడను ఘనతఁ గాంచె. ౨౫

గీ. కంటలపుబెద్దు నిచ్చె నొక్కఁడు మ్రొక్కి
ఉత్తమాశ్వము నొక్క గుణోత్తరుఁడిడె
సంతతిని గోరి సఫలుఁడై సంతసించి
హారమిడెఁగాన్కగా జమీందారు డొకఁడు. ౨౬

క. ఉత్తరపుఁజేను పదిగొ
ర్లత్తరి సమకూర్చికొనియె నర్థులవలనన్
గ్రొత్తగ కుటుంబమున కది
బత్తెము సమకూర్చు మెట్టపంటల నిడుచున్. ౨౭

గీ. పప్పువెంకయ్య మొదలైన పండితాళి
ఛాత్రులై వెంటరాఁ బ్రభు స్థానములను
పూజలందుచు సంచారమును ముగించి
వచ్చె నింటికి లోకులు మెచ్చి పొగడ. ౨౮

శా. శూరాగ్రేసర! భోగితల్పశయనా! శుద్ధాంతరంగా! గుణా
ధారా! దర్పిత వైరివీర దమనా! దంతీంద్ర సంరక్షణా!
పారావారగభీర! భక్తవరదా! ప్రఖ్యాత యోగీశ్వరా!
గౌరీనాయక! పంకజోదరనుతా! కారుణ్య రత్నాకరా! ౨౯



# స్వయంప్రకాశప్రబోధము

## విజయ పర్వము

క. శ్రీ వైకుంఠ విహారా!
కోవిద మందార! విమతకోటి విదారా!
శ్రీ వనమాలా సంయుత
శ్రీవత్స విలాసివక్ష! శ్రిత సంరక్షా! ౧

క. రాజీవ లోచనా! గజ
రాజ విమోచన! నిలింపరాజ పురంధ్రీ
భ్రాజిత కర నీరాజన
రాజిత సుందర ముఖాబ్జ! రత్న విభూషా! ౨

గీ. అనఘుఁ డాతఁడు తన గృహస్థాశ్రమమున
శిష్యులను సంగ్రహించి, విశిష్ట ధర్మ
ములను దెలుపుచుఁ గుమతుల నలఁచినట్టి
విజయ పర్వపు కథ యిది విన్నవింతు. 3

గీ. కంటలపు పెద్దు పై వస్త్ర చయము గట్టి,
కండువా జుట్టి తలను, పైఁగప్పి శాలు
బొమలలోఁ గుంకుమును బెట్టి భూతిఁ బూసి,
పైడి రుద్రాక్ష మాల వ్రేలాడ నలుత-- ర

గీ. బ్రహ్మ తేజము ముఖమునఁ బ్రజ్వరిలఁగ
నందిని దొడంగి భూతాల పొందు విడిచి,
అశ్వమున వచ్చు శంకరుఁ డనఁగఁ దనరి,
వెడలు శిష్యులు వెంటరా విజయ యాత్ర. ౫

గీ. ఛాత్రు వీరీతిఁ గొల్చిరా జనపదములు
తిరిగి చూచుచుఁ బశ్చిమ దేశమునకు
పోయి జంగాలు మెండుగాఁ బొదలు చుండు
ఒక్క కుగ్రామమున కేగి, యుదయమైన- ౬

గీ. ఊరి వెలుపలి నడబావిఁ జేర నరిగి
దంతధావన మొనరించు తరిని, గడుసు
జంగ మొక్కఁడు మఱియొక జంగముఁ గని
పలికె, నవమాన మొనరింప బ్రాహ్మణులను. ౭

గీ. "శంభులింగమ! బ్రాహ్మణ జనన విధము
'వింటివే!' యన 'లే'దన్న విను! దెలిపెద
బసవదేవర మనవేల్పు వాఁడు మున్ను
స్వేచ్ఛగాఁ జేలలో మేసి వృద్ధిపొంది- ౮

గీ. పిత్తె నొకనాఁడు తోక పైకెత్తి గురుత
రధ్వని భరామణన, దాన బ్రాహ్మణుండు
వెడలివచ్చె, భరామణ నుడి జనింప
బ్రాహ్మణుండయ్యె" నన, నయ్యావారు కనలి. ౯

గీ. కుక్కకాటుకుఁ జెప్పుతోఁ గొట్ట నెంచి
వెంకనా! జంగముల జన్మవిధము నీవు
వింటివా? యన స్వామి! నేవిన నదెట్లు!
తెలుపుమా! యన మును లింగబలిజలకును. ౧౦

గీ. ఉండె బసవన్న, వాఁడు పెంపొంది బలిసి
సెనగచే ల్మేసి, జీర్ణించు చేవ లేక
కడుపు కుట్టెత్తి చచ్చెనఁ గటికి వాండ్రు.
చెప్పులను గుట్టె బ్రాహ్మణ శ్రేష్ఠుల కిడ- ౧౧

గీ. తొడిగి బ్రాహ్మణుఁ డొక్కఁడా త్రోవ నేగ
'జ'మ్మటం చొక్క చెప్పెండు 'గ'మ్మటంచు
'జ'మ్మటంచును 'గ'మ్మంచు 'జంగ'మనుచు
మ్రోగ సాగిన జంగము మొలిచి వచ్చె. ౧౨

గీ. అనుచుఁ జెప్పిన గురునాథు నభినుతించి
శిష్యు లాజంగముల గేలి చేయఁ దలఁచి
జంగముల కౌర! చెప్పెలా! జన్మ భూమి
వింటిమిది క్రొత్త కత యని వికవిక నగ- ౧౩

గీ. జంగ మదిగాంచి కాలాగ్ని సదృశుఁ డగుచు
ఏపురాణానఁ జూపింతు విద్ది యనిన
బ్రాహ్మణుల జన్మ వ్రాసి పంక్తి క్రింద
జంగముల జనన పంక్తి విచార్య మనియె. ౧౪

గీ. గురుని, శిష్యులఁ బలువురఁ గొట్ట లేక
కోపమున క్రింది పెదవిని గొఱికి కొనుచు
పోయె జంగము మాపటి పూట వీని
బూడిదను బుంగ కెత్తింతుఁ జూడుఁ డనుచు. ౧౫

గీ. అంత స్నానాదికము గురుఁ డాచరించి
బసకు వేంచేయ నాయింటి బ్రాహ్మణుండు
ఛాత్రు లాడెడి మాటల సర్వ మెఱిఁగి
కొంప మునిగిన దిఁక నేటి గుసగుస లనె. ౧౬

గీ. "ఉండ రిక మీరలయ్యవా రుండఁ బోరు
బిడ్డలు గలాఁడ నా కేమి బెడద యగునొ
దక్షుఁడు ప్రయోగమున వానిఁ దలఁచి నంత
పాలు ద్రావదు పసిబిడ్డ ప్రక్కలోన- ౧౭

గీ. వాని కిసుమంత కోపము వచ్చెనేని
బత్తె నెత్తురు పిదుకును, జ్వరము వచ్చు
బిడ్డలకుఁ, గాలు దండెపు గుడ్డలెల్ల
అన్నము నమేధ్యముగ మాఱు, నాఁడు వారు- ౧౮

గీ. గుడ్డలను వీడు బాధతోఁ గుములు చుండ్రు
కట్టి వేసిన పశువు లెక్కడికొ పోవు
తీసి గడియలు వాకిండ్లు దెఱచి యుండు
మంచ మెక్కిన వాఁడెల్ల మనుట కల్ల. ౧౯

గీ. అట్టి భయమున వాని నోనాడ వెఱచి
వక్క లడకొత్తులో నున్న పగిది మేము
కాయ గూరలు మొదలగు కాన్క లొసఁగి
మ్రొక్కుచుందుము చూచాయ మోముగన్న". ౨౦

గీ. అని వచింపఁగ నాపల్కు లయ్యవారు
వినియు వినకున్నయటు లెక్క పెట్టకుండె
అంత సాయాహ్నమున సంధ్య నాచరించి,
పండుకొనె శిష్యుఁ డొత్తఁగాఁ బాదములను- ౨౧

గీ. స్వామి! చూచితిరా! పెద్ద బత్తె యొకటి
బారకొమ్ములు నిప్పు కుంపటియుఁ దాల్చి
వచ్చె, మనవాకిటికి లోనఁ జొచ్చె ననిన
దానితో నేమి యొత్తరా! మాని పోదె- ౨౨

గీ. అనుచు దానికిఁ బ్రతిఘాత మాచరింప
మంచ మడుగున నుంచిన పంచపాత్ర
మొఱగి గిరగిర దిరుగుచు నొలుక నీరు
కాల్వగాఁ బారి మహిషి శృంగములఁ గొట్టె. ౨౩

గీ. దేవరా! బట్టె పసువెత్తె తిరిగి యనిన
మంచిదే పోవనీ! వాని మచ్చుమాపు
బండపై గట్టిగా ఉవ్వఁబడ్డ తాయి
ముక్కలై వచ్చి తగులదా! ముఖము పగుల. ౨౪

గీ. అంత నది పోయి, యాజంగమయ్యఁ దవుల
మలము మూత్రము బండైన గిలగిలయని
కొట్టుకొను, మంచమునఁ బొర్లు, గోడుగుడుచు,
అయ్యయో! యింక నెట్లని యంగలార్చు. ౨౫

గీ. బావికడ కేల పోయితిఁ బాపలేల
వచ్చి రచటికి నేనేల వారిఁ జెనకి
చెప్పితిని కథ వాఁడేలఁ జెప్పె మఱల
అంతలో నూరకున్న నాకింత యగునె! ౨౬

గీ. చేసితిఁ బ్రయోగ మది వాఁడు చిట్లఁ గొట్టె
గట్టివాఁడౌర! బాపఁడీ గుట్టెఱుఁగక
మోసపోయితిఁ, బ్రాణముల్ తీసికొనక
పోవదూరక శంకరా! నీవె దిక్కు! ౨౭

గీ. పొట్టలో శృంగములతోడఁ బొడిచినట్లు
బాధ జీవింపనని యేడ్వ భార్య యేడ్చె
ఆవురని తల్లి పెల్లేడ్చె నర్భకాళి
'కావుకా'వని యేడ్వంగఁ గాకి గోల. ౨౮

గీ. ఇరుగు పొరుగుల బంధుగు లెల్ల వచ్చి
బట్టె దూడట్లు కడుపుబ్బి బాధ పడుట
చూచి, సంగతివిని, మాఱు దోచకుంట
అయ్యవారికి శరణార్థి నన దలంచి- ౨౯

గీ. మంచమున నెత్తికొని పోయి దించి యచట
'దేవరా! వీడు తమశక్తిఁ దెలియ లేక
ఉలిపికత పన్ని యాగ్రహ మొదవఁ జేసె
శరణు! రక్షించు మాపాలి శంకరుఁడవు- 30

గీ. తప్పుఁ జూచిన ప్రాణముల్ దక్కవింక,
అనుచు మొఱ చెప్పుకొన భార్య యడుగులఁ బడి
లేవకుండుటచే వాని బ్రోవఁ దలఁచి,
అందఱిని గూరుచుండఁగా ననుమతి యిడి- 3౧

గీ. బ్రాహ్మణుల నింద చేసె మీవాఁడు రాత్రి
పంపెఁగొమ్ములమైసమ్మ జంపఁగ నను
అంబ దయచేత నది పరాస్తం బగుటను
బాధపడు గాని నేనేమి పాప మెఱుఁగ. 3౨

గీ. దేవరా! సత్య మిదియెల్లఁ దెలియు మాకు
చేయుటే కాని, త్రిప్పగాఁ జేత గాదు
అనుపమాన తపోధను లయ్యువారు
కావఁగాఁ ద్రోఁవగా శక్తి గలుగువారు. 33

గీ. పదరి మాటొడ్డ శిక్షింత్రు పదములఁ బడి
బుద్ధి యని వేడ రక్షింత్రు బుధ జనములు
ఏటు వ్రాకులఁ బడఁద్రోయు గోరుఁ గాని
తలను వ్రాల్చిన తుంగపైఁ దారసిలదు. 3౪

గీ. అనుచు విజ్ఞాపనము చేయ ననియె నిట్లు
'బ్రాహ్మణుల నింద చేయక బ్రదుకఁ గనిన
ఒరుల కపకార మొనరింపకుండి-మనిన
చేతనైనంత యుపకృతిఁ జేతు'ననియె. 3౫

గీ. పాదములఁ గొట్టి, లింగముల్ బట్టి, సుతుల
శిరములను ముట్టి శపథముల్ చేయఁగఁగని
దేహమున భస్మమును బూసి తీర్థ మొసఁగి
కుంకుమ౦ బెట్టె నొసట 'జై శాంకరి' యని. ౩౬

గీ. తగ్గె నాబాధ మాత్రము దారి నడిచె
క్రమముగాఁ దేలుకొని లేచి కాళ్ళ కెఱఁగి
బుద్ధి వచ్చెను సెలవిమ్ము పోవుదునన
'తెలిసెనా! బాధ' నీయట్లె తెలియు మొరుల. ౩౭

గీ. అర్ధపద్యాన కోటి గ్రంథార్థ మెల్ల
పండితోత్తముఁ డొక్కండు పలికె మున్ను
పరుల కుపకృతి పుణ్యము బాధ లిడుట
పాపమని భోజరాజు సభాస్థలమున. ౩౮

గీ. జనపతిని జూచి వేరొక ఘనుఁడు నేను
అట్టులే చెప్పఁ గలవాడఁ నని వచించి
జగమనఁగ మిథ్య బ్రహ్మము సత్యమగును
జీవుఁడు సనాతనుఁడు వాఁడె దేవుఁ డనియె. ౩౯

గీ. సకల శాస్త్ర పురాణ విజ్ఞాన మిదియె
పొమ్ము నెమ్మదిగా బుద్ధిఁ బొంది బ్రతుకు,
మనుచు సెలవీయఁ జని, వార లయ్యవారి
కుత్సవ మొనర్చి, కానుక లొసఁగి పనుప. ౪౦

క. లింగము ప్రాణ మ్మందురు
జంగములకు దానిఁ బట్టఁజన దెయ్యెడలన్
లింగము భంగమ్మైనన్
జంగము పసయెంత! వాఁడు చచ్చిన వాఁడే! ౪౧

క. తప్పనలదు నాయానతి
చెప్పకుఁడీ బ్రాహ్మణులకు చెనటి వచనముల్
మెప్పొదవఁ గొలిచి బ్రతికిన
కుప్పలుగా మంగళములు గూడును మీకున్. ౪౨

క. అన్న ద్వేషము బ్రాహ్మణుఁ
డన్నన్ ద్వేషమ్ము గలుగ నరిది బ్రతుకుటల్
మిన్నక చెడిపో నేటికి
తిన్నదఱుగ కేల! యిట్లు త్రిప్పలఁ బడఁగన్. ౪౩

క. అని యిటు హితోపదేశ
మ్మొనరించి తురంగమెక్కి యుత్సాహముతోఁ
జనుదెంచెడి పౌరుల వీ
డ్కొని నిలువుండనుచుఁ బల్కి, కొలువఁగ శిష్యుల్. ౪౪

గీ. విమతుల నడంప, సుమతుల విస్తరింప,
విధి నిషేధాది సత్కర్మ విధులు తెలుప,
సత్య మద్వైతమని బోధ సలుపఁదలఁచి,
చనియె వేరొకయూరి కాచార్యవరుఁడు. ౪౫

భు. మునీంద్రానుకూలా! ప్రమోదాబ్ధిఖేలా!
కనద్భర్మచేలా! జగద్రక్షశీలా!
ధనేశాదిపాలా! సుధాధామఫాలా!
మనోజ్ఞాతిహేలా! రమారూపలోలా! ౪౬



# స్వయంప్రకాశప్రబోధము

## పరిబోధపర్వము

(పూర్వఖండము)

క. శ్రీమందరశైలధరా!
కామితమందార! లోకకళ్యాణకరా!
శ్యామలసుభగశరీరా!
దామోదర! మేరుధీర! ధర్మవిచారా! ౧

క. యదుకులరాకాచంద్రా!
పదనీరజసేవ్యమానభక్తమిళిందా!
విదళితరాక్షసబృందా!
హృదయస్థితసర్వలోకబృంద! ముకుందా! ౨

క. ఆకర్ణింపు మురారీ!
లోకము నుతియింప ధర్మలోపము వాపన్
శ్రీకరుఁ డతఁడు వచించిన
ప్రాకట ధర్మప్రబోధ పర్వము; దీనిన్. ౩

క. బృందావనపురి కరుగఁగ
వందనములుచేసి, విబుధవర్గము గురు మీ
రిందొక నెల నిలిచి, వచిం
పందగును ప్రబోధమనినఁ, బండితవరుఁడున్- ౪

గీ. అట్టులేయగు నారులు నాచుట్టలె! యని
చదువు సుందరకాండము నుదయ వేళ
భారతము శాంతిపర్వము పఠనచేయు
నాపడినమీద నుపకథాచయముఁ గూర్చి. ౫

### మనోనిగ్రహము

క. మనమే బంధము, మోక్షము,
మనమే నిరయమును, దివము, మనుజుల కొసగున్
మన మంతరాత్మ వశమై
పనివినినం బరము, నిహము, పడసిన వాఁడే! ౬

క. వెలిమొగముగాఁగ నింద్రియ
ముల నలువ సృజించెఁ; గానఁ బొందవు పరునిన్
మలిపి యొకానొక ధీరుఁడు
వెలుగుంగని విషయములకు విముఖతఁ గాంచున్. ౭

క. పొగరెక్కిన తురగములన్
మగఁటిమిగల చోదకుండు మలిపిన మాడ్కిన్
వగఁగొనక, వశముగావని
దిగులొందక, పట్టువిడక, త్రిప్పఁగ వలయున్. ౮

క. స్రోతోవేగము వలనం
బోతమ్మును ద్రిప్పనేర్చు ప్రోఢ విధమునన్
ప్రీతి విషయాళి కుఱికెడి
చేతమ్మును ద్రిప్పవలయు స్థిరయత్నమునన్. ౯

ఆ. ఊరకుండఁ జాల దొక నిముసమ్మైన
మనము చేయుకేది మానలేదు
కాన దాని కెపుడు కమలాక్షుపదసేవఁ
జూపవలయుఁ గీడుఁ బాపుటకయి. ౧౦

### జీవశర్మకథ

ఆ. జీవశర్మ గురుని సేవించి, మానియై
పాంచభౌతికమను పట్టణమున
జపము సల్పుచుండ, జనులెల్ల గుమిగూడి,
సాగనీక, ప్రశ్నశతము లడుగ. ౧౧

క. ఊరేమని, పేరేమని,
మీరెవరని, వికలమతులు మిడికింతురు నా
చేరువ శిష్యుం డుండినఁ
దీరుఁగదా! వీరితోడి త్రిప్పలటంచున్. ౧౨

ఉ. కోరినమాత్రఁ జేరె నొక కుత్సితశిష్యుఁడు వానిఁ జూచి యా
పౌరులగోలఁ బాపుమనఁ బల్కె నతండు; గురూ! వినుండు! నే
నూరకయుండఁ జాలఁ బనులొప్పఁగ నెప్పుడు చెప్పెదేని, నిన్
జేరి వసింతు, నీవటులఁ జెప్పవొ! గ్రుద్దెద, నొప్పికొందువే? ౧౩

ఆ. అట్టులైన నుందునన నాతఁ డాలించి,
చింతచేసి, పనులఁ జెప్పలేనె!
చేయలేక వీఁడె చేతులు జోడించి
వదలు సమయమనుచు వల్లె యనియె. ౧౪

క. మానససృష్టి యొనర్చిన
పూనికఁ బని చెప్పినపుడె ముగియించుచు, నే
దేని మరి సెప్పుడనుచుం,
గానీయమిసందు జపము గంగంగలిసెన్. ౧౫

ఉ. పౌరులబాధ వాయునని, బాపురె! శిష్యుని జేర్చుకున్న, వాఁ
డౌర! విరామమించుకయు నబ్బగనీక కలంపఁ జొచ్చె, నే
తీరునఁ బాయు నీశ్రమము దించియు మొద్దును, దుంగ నెత్తిపై
కోరి ధరించినట్లు పిడిగ్రుద్దుల భీతి వడంక నయ్యెడిన్. ౧౬

క. అని యిట్లాలోచింపఁగ
పని చెప్పుము, చెప్ప వేని పడు గ్రుద్దనుచుం
దనమీదికుఱుకు శిష్యుని
గని గురుఁడికఁ జచ్చితినని గడగడ వడఁకెన్. ౧౭

క. పనిగలదు పోయివచ్చెదఁ
జనకెచటికి నిలువుమిచట జపమాలాదుల్
కనిపెట్టియుండుమని చనె
తనగురుని గనంగ ముప్పు తలఁగించుకొనన్. ౧౮

ఆ. "దేవ! కరుణఁ దమరు చెప్పిన మంత్రమే
జపము చేయుచుండ, జనులు మూగి
గోలచేయ, వారికొఱకొక శిష్యుని
గూర్చికొంటిఁ గొఱవిఁ జేర్చినట్లు. ౧౯

ఆ. పలికె వాఁడు నాకుఁ బనిచెప్పవలె నెప్డు
చెప్పవేని గ్రుద్దు కొప్పి కొనెదె?
అనిన నొప్పికొంటి నట్టులేయని, కాని
ముప్పుగంటిఁ బనులఁ జెప్పలేక. ౨౦

ఆ. చెప్పినట్టిపనులు చిటికలోఁ గావించి
'చెప్పు చెప్పు' మనును జెప్పక మును
గ్రుద్దు మఱుగుగ్రుద్దు గూడలు విఱుగఁగా
వదలిపోఁడు కొలువ వలవ దనిన. ౨౧

ఆ. చావు దెచ్చికొంటి దేవరా! నాకేది
దిక్కు" టన్న; గురుఁడు పిక్కటిల్ల
నవ్వి, మేలు మంచి నాకెంపు శిష్యునిఁ
గొంటి వనుచుఁ దెల్పె గుట్టొకండు. ౨౨

ఆ. పాతు! తాటిమొద్దు పైకిని క్రిందికి
ఎక్కు దిగుచు నుండ నేర్పరింపు!
పిలిచినపుడు వచ్చి, వలసిన పనిఁజేసి,
పోయి తొంటిరీతిఁ జేయుమనుము. ౨౩

ఆ. వాని రోగమునకు వైద్యమా నిది"యన్న
సంతసించి పోయి సర్వమట్లు
సిద్ధపఱచి యాజ్ఞ చెప్పిన దుర్మతి
బాధతొలఁగె జరిగెఁ బనులుగూడ. ౨౪

క. కూటస్థుఁడనెడి గురుఁడీ
సాటువతో జీవశర్మ సంబోధింపన్
పాటించి వాఁడు దుర్మతి
పోటులఁ బెడబాసి సుజనపూజితుఁ డయ్యెన్. ౨౫

క. గురుఁడంతరాత్మ, శిష్యుఁడు
పరగుం జీవుఁడయి, గ్రుద్దుపలున కుమతియనా,
సరసీరుహాక్షుఁడగుఁ దాఁ,
డరయవలయు నిట్టు లుపమలని బుధు లెదలోన్. ౨౬

చ. పనిగలవేళ మానసముఁ బంచి సమస్తము పూర్తి చేసి, యా
పని ముగియంగ మాధవుని పాదములందు వసింపఁ జేయుచుం
దన వశవర్తిఁ జేసికొన దాసుఁడుగా మనముండు నూరకే
పని యొదవింపకున్నఁ బలుబాములఁ బెట్టక నిల్వనేర్చునే. ౨౭

క. వలలేక పక్షిఁ బట్టఁగ
నలవడునే! యేనుగోదమడరక పడునే!
అలవియె! మనమును బట్టఁగ
జలజాక్షుని సేవఁ గాక; శర్వునకైనన్. ౨౮

క. తప్పిన పరీక్షఁ గ్రమ్మరఁ
జెప్పుటకై తిరుగఁ జదువు శిష్యుఁడు పోలెన్
తప్పి మనము చెడుదారిం
ద్రిప్పినఁ జింతించి, హితము దెలిపి, నిలుపుమా! ౨౯

క. అలవడియె నింద్రియములని,
వలవదు మదవతులపొంత వర్తింపఁగ, నీ
తలదన్ను మునుల సైతము
జలచరమట్లీడ్చు మరుఁడు సతుల బలమునన్. ౩౦

క. వెలిపగతుల గెలుచుట ని
ష్ఫలమగు నర్థార్జనమునఁ బలువురు పగతుల్
కలుగుదు రెందటి గెలుతువు!
తొలఁగింపుము! మేనిలోని ద్రోహుల వరుసన్. ౩౧

ఆ. తెలికపిండి గెనుసుతీగెయు నవిసాకు
వైవ దొంగబత్తె వచ్చునట్లు
విషయసుఖము కంటె విమలమౌ చిత్కళా
నంద పరత నాత్మఁ జెందు మనము. ౩౨

సరివిశెట్టికథ

గీ. జరుగఁగఁ బురాణమిటు వైశ్యసాధ్వి యోర్తు
నిత్యమునువచ్చి వినిపోయి, నిజవిభునకు
చెప్పుకథ; నయ్యవారు మున్ జెప్పినటుల
విను నతండును గనుతెప్ప వేయకుండ. ౩౩

గీ. ఒక్కనాఁ డాపె గురునకు మ్రొక్కిపలికె
'చిత్తము! మహాత్మ! మనవి మా సెట్టిగారు
వెడలి విను' మన 'మిముడాయ బిడియ' మనును
పంపెదను నచ్చఁజెప్పి పాలింపు దయను.' ౩౪

గీ. 'అట్టులే! పంపు'మనఁ బోయి యధిపుఁ గాంచి,
"ప్రేలుకుండలములు కావు వినికి చెవికి
సొమ్మునెద రయ్యవారివి సూక్తులు విను
ఏఱు దరినుండఁ బ్రాచీసి రేల క్రోల. ౩౫

గీ. కంటిపై తెప్పవాల్పక, కాతు నిల్లు
వెంట రాఁబోదు; దీనిపై విడువు భ్రాంతి
పోయి వినుమని, గట్టిగాఁ బోరువెట్ట
వచ్చి, దూరముగాఁ గూలఁబడె బెదరుచు. ౩౬

మనోభూషణములు

గీ. స్వస్తిచెప్పిన తరువాత వానిఁ బిలచి
అరసి యనామయంబు, నెయ్యంబుతోడ,
భయము దొలఁగించి! "లాభమే, వర్తకమున!
కొడుకు లెందరు? పొలమెంత? గోవు లెన్ని? ౩౭

గీ. ద్రవ్య మడుగను లే! మేనఁ దాల్పఁదగిన
సొమ్ములుండిన మైఁదాల్చి రమ్ము! జేపు
చూతు"నన బుద్ధియని పోయి సుదతిఁ గాంచి,
మంచివాడయ్య నాతోడ మాటలాడె. ౩౮

గీ. సొమ్ములనుదాల్చి రమ్మనెఁ జూతుననియె
చెప్ప వింటిని; మఱల నేఁ జెప్ప లేను
కత యదేమియొ! వేదాంత గాథ యంట
తెలిసినటు లుండునే కాని తెలియ దబల! ౩౯

గీ. సొమ్ములను దాల్చియే తేపు పొమ్మటంచు
కంకణమ్ములు హారముల్ కడియములును
గోవ మొలత్రాడు నుంగరాల్ కూర్చి పంప
మధురతలగుడ్డతో సెట్టి మగువలు నగ- ౪౦

గీ. వచ్చి నెమ్మదిగా నయ్యవారిఁ జేరి
దండమని మ్రొక్కి, కూర్చున్నఁ; 'దగు సెబాసు!
సెట్టి! బాగ'ని నవ్వించి చెప్పె మిగుల
ధర్మములు బోధపడునట్లు నిర్మలముగ. ౪౧

గీ. "ఉన్నవా! సొమ్ము లివియేన?" "ఉన్నవి గురు!"
"మంచిదియె వీనిఁ దాల్చిన మనుజుఁ డెవఁడు?"
"స్వామి! నేనన" నేనను వాఁ డెవండు?
చూపు"మనఁ జేతితో మేను జూపె నతఁడు, ౪౨

గీ. "ఔను! సొమ్మిడ సంతోషమందు నెవఁడు?
పోవ దుఃఖించు నెవ్వఁడు? బుద్ధిఁ గనుము
నిద్రలో సొమ్ములను బెట్ట భద్రపఱుప
ముదముగనఁబోవు, లేవని పొగులవుగద! ౪౩

గీ. పాఱఁజూడుము! సంతోషపడదు దుఃఖ
ములను గాంచదు మే"నన, బోధపడదు
పెద్దవాఁడను దేవరా! విసుగుకొనక
తేటమాటల దయచేసి తెలుపుఁడనియె. ౪౪

గీ. "తొట్టెలోఁ బాపనికి సొమ్ము పెట్టి నీవు
సంతసింతువు! బాలుఁడా నడి నెఱుఁగఁడు
మువ్వలును గంటలును గట్టి ముఱియుదీవు
వృషభమునుగాంచి, యాకోడె బెదరిపడును. ౪౫

గీ. అట్టులే మేనికిని సొమ్ము వెట్టినపుడు,
సంతసించెడి దదిగాదు; స్వప్నమందు
మంచమున దేహమున్నఁ బ్రపంచమెల్ల
తిరుగునది యేది? యూహించి తెలియుమద్ది". ౪౬

గీ. "ఉన్న దేదియొ! మేనుగా దెన్నరాదు
కానఁబడ"దన్నఁ జా లింత జ్ఞానమున్న
సూదిబెజ్జములో నేన్గుఁ జొనుపవచ్చు
మనము; సుఖదుఃఖముల నదిగనవలంతి. ౪౭

గీ. పరులఁగై చేసి సంతోషపడుట కంటె,
తానె కై చేసికొనుట మేల్గాన నీవు
ముదముఁగను మానసమునకే భూషలనిడి,
దేహమునకున్న, లేకున్న, దిగులు పడకు". ౪౮

గీ. "ఔను! దేవర! యెఱిగింపుమా! నగలను
తెచ్చెదను రొక్క మెంతయే నిచ్చి" యనిన
'మైత్రి, కరుణ, యుపేక్షయు, మఱియు ముదిత,
సొమ్ములివి నాల్గు; వీనిదేఁ జూడు జేవు'. ౪౯

గీ. అనిన నగసాలి వారల నడుగ; వారు
వినము! వీని నమూనాలఁ గనఁబఱచిన
చేసియిత్తుము కనుగొమ్ము చెప్పినతని
అనిన నెఱిగించె గురువున కా విధంబు. ౫౦

గీ. వాని ముగ్ధతకును నవ్వి పలికె నిట్లు
ఒడలివలె మానసము కానఁబడదు గాన
దాని కేసొమ్ము పెట్టఁగాఁ దరముకాదు
భావనయె సొమ్ము వివరించి పలికెద విను. ౫౧

గీ. "పుణ్యపురుషులయెడ మైత్రి ముదిత, సకల
సంపదలుగల్గి మనఁజూచి సరివిసెట్టి!
కరుణ దీనులయెడఁ, బాపకర్ములందు
తగు నుపేక్షయు, నివి సొమ్ములగును మదికి. ౫౨

గీ. క్రతువులు, వివాహములు, తటాకములు, గుడులు
దానములు, తీర్థయాత్రలు, దానవారి
అర్చనము, వంటి పుణ్యకార్యములు చేయు
మనుజులంగని ముదమంద మైత్రి యంద్రు ౫౩

గీ. కూడుదొరకక, వీధిలోఁ గొట్టుకొనుచు
రోగములు పట్టి పీడింప రోఁజువారిఁ
గాంచి కనికరమున జాలిగనుట 'కరుణ'
అనెడి సొమ్మని వచియింతు రలఘుమతులు. ౫౪

గీ. సంతతియు, సంపదయుఁ, గల్గు జనులఁ జూచి,
కుళ్ళిచావక చెడిపోవఁ గోరుకొనక
సంతసించుట 'ముదిత'నాఁ జనెడి సొమ్ము;
బోధపడుచున్నయవె! మనోభూషణములు! ౫౫

గీ. అగ్గినిడి, గరళమును బెట్టి, యూలిఁబట్టి,
ధనముఁ బొలమును గాఁజేసి, జనులఁగొట్టు
వారితో నేమి? మనకని దూరముంట
చను 'నుపేక్ష' యనఁగ నివి మనమునగలు. ౫౬

గీ. విఱుగ వఱుగవు దొంగచేఁ జోరవు భయము
కూర్పవెన్నఁడు నిహమున గొప్పదెచ్చు
పరమునను సౌఖ్యములఁగూర్చు బాధలుడుపు
సొమ్ములివి, తక్కినవి బండికమ్ములె సుమ. ౫౭

గీ. కర్తయును, ప్రేరకుండును, గారయితయు,
వరుస ననుమోదకుఁడు, సమభాగములుగ
పుణ్యపాపఫలమ్ములఁ బొందుచుండ్రు
భావనను గూడ పుణ్యపాపములు వచ్చు-" ౫౮

గీ. అనెడి సద్బోధ సభలోన వినిన వారు
సంతసింపుచుఁ దమ మది సందియములు
తెలిసికొన నాజ్ఞఁ గైకొని పలికిరిట్లు
సాధుసంగమునకు మది సంతసిలుచు. ౫౯

## సంచితాగామిప్రారబ్ధములు-వాని యనుభవము

గీ. 'సంచితాగామిప్రారబ్ధసముదయమున
జ్ఞానమున రెండు నశియించుఁ గాని తుదిది
అనుభవింపక తీర' దం ద్రష్టులైన
శాంతులేటికి? పాపు మీాసందియమ్ము. ౬౦

గీ. అనుభవింపక ప్రారబ్ధ మడఁగకుంట
తెలిసి రాముఁడు, నలుఁడు, యుధిష్ఠిరుండు,
కానలకుఁ బోయి, కష్టముల్ కనిరి; కాని
శాంతులొనరించి, సుఖమంద శక్తిఁ గనరో! ౬౧

గీ. అదియె సరియనఁ బూర్వజన్మార్జితమగు
కిల్బిషము వ్యాధియై మహాక్లేశమొసఁగు
ఔషధమ్ముల, దానజపార్చనముల,
హోమముల, వాని దొలఁగింప నొప్పనంద్రు. ౬౨

గీ. ఏల! రుద్రాభిషేకము, లేల! జపము,
గ్రహములను గొల్వఁగా నేల!, వ్రతము లేల!
దానములు, హోమములును, సంతర్పణములు,
చేయఁగా నేల! విబుధులసేవ యేల! ౬౩

గీ. ఒక్కొకప్పుడు శాంతిచే నుడుగుఁ గీడు
ఉడుగ దొకపరి నదియేమొ! పిడుగయిపడు
సంచితాగామిప్రారబ్ధసరణి యెట్లొ!
స్వామి! సెలవీయుఁడని, రామశాస్త్రి వలుక. ౬౪

గీ. సప్తజన్మలకర్మము సంచిత; మది
పుణ్యమనఁ, బాపమున, రెండు ప్రోవులగుచు
నుండుఁ బరలోకమున, జన్మమొందినపుడు
అనుభవింతురు ప్రారబ్ధమనఁగ కొంత.

గీ. ప్రస్తుత మొనర్చు నిజకర్మ ఫలము వోయి
చేరు సంచితమున; వడ్డిచేరునట్లు
ఆదిఋణమున, విజ్ఞాని యయ్యెనేని
సంచితాగామము లివి రెండు వంచ వతని. ౬౬

గీ. అప్పువల దా స్తివలదని, తప్పుకొనిన
వాని కేబాధయును లేనిపగిది నుభయ
కర్మఫలములు త్యజియించు నిర్మలునికి
అనుభవమునకు రా నేర వందెయుండు. ౬౭

గీ. పుణ్యమును వాని నుతియించు పురుషునకును
పాపమును వాని నిందించు బాలిశునకు
పంచి యిడుచుండు రవినశియించువరకు
జ్ఞానులను నిందచేసినఁ గలుగు నఘము. ౬౮

గీ. త్రిప్పి విడిచిన సారె తాఁ దిరిగి తిరిగి
ఆగునేకాని, నడుమఁ దా నాగని గతి
సాగి నడిచెడి పారబ్ధ మాగ దండ్రు;
శాంతిచే నాగియాగి, పైఁజను నటండ్రు. ౬౯

గీ. పొర్లి పరతెంచు కాలువ ముంచకుండ
అడ్డకట్టల నిర్మింప నాగిన గతి
శాంతులను బాపసామాన్యశమము గలుగు
అడ్డకట్టల గాతమి నాపఁ గలమె! ౭౦

గీ. యోగులది ద్రోయఁగా శక్తి యుండి కూడ
ఎప్పుడేనియు నిదిముందు తప్పదనుచు
కారణమ్మగు మరుజన్మ గాంచ ననుచు
అనుభవింతురు తీర్చెడి అప్పు వోలె. ౭౧

శివశర్మకామశర్మల కథ

గీ. అయిన, బుధు లెఱింగించిన యట్టి కథను
చెప్పెదను దానితో మీకుఁ జెడుఁ గలంక
కలరు విప్రులు; శివశర్మ, కామశర్మ,
అనఁగ నిరువురు గుచ్ఛాద్రియందుఁ దొల్లి. ౭౨

గీ. వైదికుఁడు, కర్మఠుఁడు, సాధువర్తనుండు,
భక్తియుక్తుఁడు, శివశర్మ; భ్రష్టతముఁడు,
మాటనేర్పరి, టక్కులమారి, ధూర్తు,
కాముకుండు, ననాచారి, కామశర్మ. ౭౩

గీ. కాంచి శివశర్మ నొకనాఁడు కామశర్మ
ఏమిర! శివాయ! కనుపడ వేమి? యెచట
కాల మీరీతి కటిక్రుతోఁ గడచుచుండ
దిగులు లేదేమి! నీకు నేతీరు గడచు! ౭౪

గీ. పెద్దలు గడించి యిచ్చిన విత్తమింట
ఉండెఁ గాఁబోలు నటుచేయి గుండె నుంచి
పండుచున్నావు! నాబోటివాని బ్రతుకు
జరుగదని తోఁచు నిందుండ వెరవుగాదు. ౭౫

గీ. చనెద యాచన”కని కామశర్మ పలుక
పలికె శివశర్మ “రెండవవాఁడు లేమి
ఒంటిగాఁ బోవలేక నే నున్నవాఁడ
కట్టి మడిసంచి వంకెకుఁగట్టి మున్న. ౭౬

గీ. దశమియు, పునర్వసును, పూర్వదిశకుఁ బోవ
మంగళము మంగళముఁగూర్చు మంచిదెల్లి
పయనమైయుండు ముదయమే వచ్చి పిలుతు”
అనుచు శివశర్మ పల్కె లోననుకొనె నిటు. ౭౭

గీ. "పోయి యాచించి, యొరులతో బూమెలాడు
మాట తెఱుఁగను, బొరుగూళ్ళ బాట తెఱుఁగ,
పుల్ల కదలిన నాగుండె 'ఝల్లు'మనును
వీని తోడ్పాటు వలయు నెంతేని తవర". ౭౮

గీ. అలరెనిటు కామశర్మ "విద్యాతిశాయి
నోరు మెదలుప వలఁతి యాచారపరుఁడు
వాని తోడ్పాటుతోఁ 'దిమ్మిబ్రహ్మిఁజేసి'
సుష్టుగా మేయఁగా వచ్చు సుజనులిండ్ల. ౭౯

గీ. వాని నొక్కింత ముందుగా వాగనిచ్చి,
ఛాందసులముందు లెక్చర్లు చాలఁగొట్టి,
లౌకికగృహాల చిల్లరల్ లావుచదివి,
రెండు తెలిసినవారిఁ గీర్తించి పొగడి,- ౮౦

గీ. రెండు లేకున్నయెడ మేమె పండితులని,
దాత యాలాపనకుఁ దగు తాళమిచ్చి,
దేశకాలపాత్రములను దెలిసి నడువ,
మోసముండదు; శివశర్మ ముండమోపి". ౮౧

గీ. వారలిద్దరు వేకువ బయలుదేరి,
గుండ్లపల్లెను విప్రులఁ గోమటులను
చూచి సంపాదనముచేసి, జోస్యులింట
కామశర్మ భుజించెను గారెలుసహా. ౮౨

గీ. శివుని దర్శింపకయె భుక్తి చేయననెడి
నియమముండుట శివశర్మ నీట మునిఁగి,
ఆహ్నికముఁదీర్చి, శివదర్శనార్థమఱుగ;
శివునిగుడిలేమి నాయూరఁ జేసె పస్తు. ౮౩

గీ. వారు మఱునాఁడు సకరికల్ దారిఁ బట్టి,
వెడలి, నరసింగపాడను పేరు గల్గి
పాడువడియున్న యూరిలోఁ బ్రాఁత దిగుడు
బావి గనుపింప; శివశర్మ వానిఁ జూచి- ౮౪

గీ. 'స్నానమొనరించి యర్ఘ్యము తోనె మఱలి
వచ్చెదను కొంచె మాగరా! యిచ్చట'నన
'బత్రికును, బాపనికిఁ, గంటఁబడిన మడుగు
బుడక లిడకుండ'రందు రానుడికిఁ దగితి! ౮౫

గీ. ఎద్దు నెనుపోతు నొకకాడి నీడ్చినట్లు
నీదు సహవాస మున్నది నిజము నాకు
సాగనీయవు స్నానము సంధ్య యనుచు
ఛాందసుండవు నీతోడఁ జావువచ్చె- ౮౬

గీ. మూఁడు నిముసాలలో రమ్ము మున్క వేసి,
జాగుచేయకుమని కామశర్మ దంత
ధావనము చేయఁ గూర్చుండె బావి ముందు
తుమ్మపుల్లను గొని పండ్లు తోమికొనుచు. ౮౭

గీ. స్నానము ముగించి, శివశర్మ సంధ్యవార్చి,
జపము కావించి, బ్రహ్మయజ్ఞమును దీర్చి,
లేచి తలయెత్తి, యొకగుడిఁ జూచి, పలికె
కంటివా! కామశర్మ! యీకాననమున- ౮౮

గీ, శివుని గుడి యటులున్నది శిఖరముఁ గను!
నిన్న నుపవాసముంటి ముందున్న యూర
నున్నదో! లేదో! గుడి లేకయుండునేని
నేఁడు పస్తైనఁ బ్రాణముల్ నిలువవింక. ౮౯

గీ. దర్శనము చేసి వత్తునా! తమ్ముఁడ! యన
వాఁడు మఱచుటఁ జూడఁగా వేడికొనిన
తల నెగురవేయఁగాఁ బోయి తలుపు నెట్ట
విఱిగి మీఁగాలి పైఁ బడ్డ వెఱచి, యఱచె. ౯౦

గీ. కాళ్ళు నీళ్ళను దోముచుఁ గామశర్మ
కలుజురాతిని లాగినఁ గలుఁగులోన
పిడుత యొక్కటి కానరా వెలికిఁ దీయ
బీఱపూలట్లు వరహాలు పెక్కులుండ- ౯౧

గీ. పూర్వజనియందు నేనెంత పూజసలిపి
పుట్టినాఁడనొ! వరహాలచిట్టి దొరకె
పాడు శివశర్మ వచ్చెనా భాగమడుగు
కొద్దిగానైన నీకున్న రద్ది చేయు- ౯౨

గీ. దాచఁ దగునని యిడి చంకతాళి లోన
అచట శివశర్మ యెలుఁగెత్తి యఱచి యేడ్చు
రోదనధ్వని నాలించి రోఁజుకొనుచు
పరుగువారి 'యిదేమిరా! పాప' మనిన- ౯౩

గీ. "కర్మఫల మేమిసేతు నాకాలు విరిగె
'చేయఁబోవ నవాజు మసీదు మీఁద
కూలె' నన్నటులయ్యెనన్ గొంపఁ జేర్చు
బ్రతికియుండిన గంజియేన్ గతికి మనెద". ౯౪

గీ. "బుద్ధితక్కువ చేఁ దల్పు పుచ్చియుంట
గుఱు తెఱుఁగక లాగితి! కూలె మీఁద
చావు తప్పెను మేలయ్యెఁ జాలునింక
కర్మఫల మందువా! మంచికాలము సుమ!. ౯౫

గీ. చుట్టు ముట్టించు తన యగ్గిపెట్టె గీరి,
వాని పయి యుత్తరీయము పట్టి లాగి,
కాల్చి మసిచేసి, కూరిచి గాయమందు
చుట్టి గావంచముక్క, పైఁ గట్టె కట్టు, ౯౬

గీ. పట్టుకొని వాని నడపించి వచ్చుచుండ
అడవిలో నున్న దొంగలా యలుకుఁడు విని,
కత్తులును గండ్రగొడ్డండ్లు నెత్తిచూపి,
చుట్టుముట్టిన, శివశర్మఁ జూసి పలికె— ౯౭

గీ. "అడవిదొరలార! చూడుఁడీ! యాగడంబు
పదుగురున్నారు దొంగలు బాఁది మమ్ము
సొమ్ము గైకొని యీకోనఁ జొచ్చి చనిరి
గాయపఱచిరి మావాని కాలు కనుఁడు!" ౯౮

గీ. అనిన మాటల కాదొంగ లాగ్రహించి
మాకు మించిన దొంగలే మాడ్కి వచ్చి
చొచ్చి రీవని కని పొఱఁబుచ్చు కున్న
తీరదని వారితోఁ బోరఁ గోరి చనిన— ౯౯

గీ. "నడవరా! వేగ శివశర్మ! బడుగు విధవ!
తొడుగు లాగిన రీతి నా దుంప తెగెను
బ్రతికి యుండిన వాని నేఁబట్టి యెఱుఁగ
ఎత్తుకొని పోదునా యన్న నెద్దు బరువు!" ౧౦౦

గీ. అనుచు వెనుకకుఁ జూచుచు నరిగి యరిగి
చేరి తమయూరు గృహములఁ జేరుకొనిరి
పథ్యముల స్రుక్కి శివశర్మ బాధ పడుట
కామశర్మ వరాలతోఁ గలిమి గనుట— ౧౦౧

గీ. కాంచి, నారదఋషి బ్రహ్మఁ గానఁ బోయి,
వందనము చేసి, కూర్చుండ; వార్త లేమి?
తెలుపుమన, నేమి చెప్పుదు! దేవదేవ!
పాపికిని మేలు సుకృతికి బాధ కలిగె. ౧౦౨

గీ. తినఁడు శివశర్మ శంకరుఁ గనక నెదియు
వేదవిదుఁడు సదాచారి వినయపరుఁడు
గరళకంఠుని గనఁబోయి గాయపడియె
కాంచె వరహాలు భ్రష్టుఁడౌ కామశర్మ. ౧౦౩

గీ. పాపపుణ్యాల ఫలము విధ్వంసమయ్యె
పాపికే దైవమును దోడుపడు నటంచు
పలుకు వాక్కులు నిజమయ్యెఁ బద్మగర్భ!
కలియుగమునందు ధర్మము కనఁబడ"దన. ౧౦౪

గీ. "అట్టులా! పూర్వవృత్తము నరయ వలదె!
కర్మఫలములు విపరీతగతి జరుగునె!
వినుము! తెలిపెద వారల వృత్తమెల్ల
కొంకణమ్మేలు నొకఁడేలుఁ డెంకణమ్ము. ౧౦౫

గీ. పూర్వజని యందుఁ బ్రభువులై పుట్టి, భూమి
పాలనము చేయుచు, నదోషభాక్కునొకని
కొఱత వేయించె శివశర్మ గుణ మెఱుఁగక
కనకమును బూడ్చె మెండుగాఁ గామశర్మ. ౧౦౬

గీ. అట్టె పాపముచే మృతి నందఁదగియు
సాధుకర్మల పాపము సమసి సమసి
కర్మశేషము కొద్దిగా గాయ పరచె
చెడును బ్రారబ్ధమును మంచి చేయుచున్న. ౧౦౭

గీ. భూమి నిక్షేపబహుళము పూడ్చియుంట
కామశర్మకు వరహాలగని యొకండు
రాఁదగియుఁ, బాపకర్మముల్ రాచఁ దఱిగి
చిక్కె; మిగిలిన స్వల్పమే శిష్టవినుత. ౧౦౮

గీ. పూర్వసుకృతములును బాపమున నశించు
పాపములు చెడుఁ బుణ్యముల్ ప్రబలుచున్న"
అనుచు వాణీమనోహరుం డాజ్ఞ నొసఁగ
తెలిసి ఋషి బుధులగోష్ఠిలోఁ దెలిపె దాని. ౧౦౯

సుగుణ దుర్గుణ గ్రాహకులు

ఆ. పాలొసంగుఁ గాని పట్టిపీకదు గోవు
కఱచుఁగాని పాలు గార్చదు ఫణి
దోషమెంచఁ బోడు దొడ్డచూపు గలాఁడు
గుణమెఱుంగఁ బోఁడు కుత్సితుండు. ౧౧౦

ఆ. రెండు దెలియ నేర్పుఁ బండితుం డగువాఁడు
సరసవిరసములను సాక్షివోలె
వాని నెఱుకపఱచె వనజాక్షుఁడీరీతి
పాండవేయ కురునృపాల కథల. ౧౧౧

ధర్మజ దుర్యోధనులు మనుజపశువును గొనివచ్చుట

ఆ. శౌరి తొల్లి నిండుసభలోనఁ గురురాజు
ధర్మరాజుఁ జూచి ధరణి వెదకి
మనుజపశువుఁ దెచ్చి మాకొసంగితిరేని
సంతసింతుఁ జేయ సమ్మతంబె? ౧౧౨

ఆ. అనిన దానికేమి యట్టులేయని మాస
మవధికాఁగ నేగి యవని నెల్ల
తిరిగితిరిగి దిమ్మతిరిగి కౌంతేయుఁడు
చింతనొందెఁ బశువు చిక్కదనుచు. ౧౧౩

ఆ. "ఒక్క సుగుణమైన లెక్కింపఁగాలేని
వాఁడె కాని, పశువుకాఁడు భువిని
సుగుణమొక్కఁడైనఁ జూడనివాఁడేఁడఁ
గానరాఁడు! నెలయుఁ గడచిపోయె! ౧౧౪

ఆ. పశువు చిక్కదనుచుఁ బద్మాత్ముకడ కేగ
బుద్ధిపుట్ట దెందు పోవువాఁడ?
వాసుదేవుఁ డెట్టివానిఁగాఁ దలచునో!
ముందునూయి, వెనుకఁబోవ గోయి. ౧౧౫

ఆ. కాని పోదుమఱలఁ గాళ్ళలో శనిగాఁడు
తూఱినాఁడు త్రిప్పఁ గోరినాఁడు
పశువుదొరకెనేని పదివేలు చిక్కదా!
పోదునపుడె యత్నమును నొనర్చి". ౧౧౬

ఆ. అనుచుఁ బోవుచుండ నయ్యెడ నొకబాప
నయ్య మాలవాని నెయ్యమునను,
దున్నుచుండెఁ బొలము దున్నలజతలతో;
తోలుచేఱుకోల త్రేల నఱుత. ౧౧౭

ఆ. విప్రుఁడై జనించి, వీఁడు మాలనిఁగూడి,
దున్నసాగెఁ బొలము దున్నలజత
పశువువీఁడు వీనిఁ బట్టెదఁ గానిమ్ము!
ఇంటికేగి చూతు నితని నడత. ౧౧౮

ఆ. అనుచుఁ జేనిగట్టు నందె కూర్చుండిన
పలుకరింపఁ డేమిపని యని యనఁ
దూరిపేరు తెలియఁగోరఁడు చూడఁడు
వేళయైనఁ గాడి విడిచి పసుల- ౧౧౯

ఆ. తోలుకొనుచువచ్చెఁ దోలువాతెన ప్రేల
పీపుమీఁద, నడుమఁ బెరిగియున్న
జమ్మిచెట్టుపుల్లఁ జమిరి ముల్లుత్తతో
నమిలి నోటఁబెట్టి నడచుచు పలు- ౧౨౦

ఆ. తోమికొనుచుఁ బోవఁ దోడ ధర్మజుఁడేగి,
"పండెశ్రమము; కంటఁబడియెఁ బశువు
కోరఁడెద్ది పశువుఁగోరెను గంసారి
చిక్కదనుచు చాల చింతిలితిని. ౧౨౧

ఆ. ఇంక కొంతకాల మీక్షింతుఁ ద్వరపడఁ
గూడదంద్రు మంచి గుణమొకండు
కలిగియున్న ఫలము గలుగమియే కాక
నవ్వుబాటు గలుగు నాకుఁ గూడ"- ౧౨౨

ఆ. అనుచు వెంటనేగ; నాతఁ డింటికిఁబోయి
ఏరుకట్ట పంచఁ బారవైచి
ఇంటిలోనికేగి యిల్లాలితోడ 'మా
అమ్మకన్నమిడితె!' యన్న నాపె- ౧౨౩

ఆ. 'ఆయెనిపుడె, జలకమాడి రానున్నది
పీటవేసి చెంబు పెట్టినాను,
విస్తరియిదె! కూరవేసితి, వడ్డింతు'
ననిన నూర్పుపుచ్చి, యవనిసురుఁడు. ౧౨౪

ఆ, "విప్రధర్మమేద, వెలివానితోఁ గూడి,
పొలముదున్ని, తల్లి పోషణకయి
పడిన కష్టమెల్లఁ బాడుచేసితి వేమి
చేయువాఁడఁ బ్రొద్దుపోయె మిగుల. ౧౨౫

ఆ. పెద్దప్రాణి, నన్ను బెనిచె నాబిడ్డడు
సోలిపోవుఁ బ్రొద్దు తూలననుచు
జాముప్రొద్దువరకె సాపాటు చేయించి;
అట్టితల్లిఁ బ్రేమ నరయనైతి! ౧౨౬

ఆ. యామయుగము వోయె నేమేడ్చెదింతకు"
ననుచు నాలిఁగసరి, అమ్మరాఁగ
వందనమ్మొనర్చి, వడ్డింపగాఁ జేసి,
వచ్చి, నృపతిఁజూచి, పలికె నిట్లు. ౧౨౭

ఆ. "ఎవరుమీరు! సామి! యేయూరు? పేరేమి?
కాళ్ళకివిగొనీళ్ళు కడిగికొనుఁడు
స్నానమాడిరండు! జావయో, గంజియో,
మాకుఁగలది గొనుచు మనుపుఁ డనిన;". ౧౨౮

ఆ. కనులయందు నీరుగ్రమ్మఁగా నరపతి
చుట్టుతిరిగి, కాళ్ళుపట్టి మ్రొక్కి,
పాపినైతి నిన్నుఁ బశువుగా భావించి
ధర్మమూర్తివీవు! తప్పుగావు! ౧౨౯

ఆ. అనినఁ దెల్లవోయి యావిప్రుఁడిదియేమి
వింత నాకుఁ దెలియ విస్తరింపు
ఎవరు మీరటన్న; నేపాండవేయుఁడ
ధర్మరాజటండ్రు తజ్ఞులెల్ల. ౧౩౦

ఆ. మనుజ పశువుకొఱకు వనజాక్షుఁడంపిన
వచ్చి పొలముదున్నువాని నిన్ను
పశువువనుచుఁబట్టి భావించి కూర్చుంటిఁ
జేనిగట్టుమీఁదఁ జివరదాఁక. ౧౩౧

ఆ. జమ్మిపుల్లఁ గొట్టి సాగుచుఁ బలుదోమ
నిశ్చయించినాఁడ నిజపశువని
కాని యింటికేగి కనుగొందునని వచ్చి
చూచి మాతృసేవఁ జొక్కినాఁడ. ౧౩౨

ఆ. పోయివత్తు శుభము పొందెదు నిన్నన
ఆరగించియేగు మర్ధివైతి
కుడువుమనినఁ బోవఁగూడదు వలదని
యన భుజించి చనియె యమసుతుండు- ౧౩౩

ఆ. పోయి కమలనాభుఁ బొడగాంచఁ గృష్ణుండు
సేమమరసి పశువు చిక్కెనేమి?
తెచ్చితే యటన్న, దేవదేవా! లేడ
యోగ్యపురుషుడెందు నుర్వియందు. ౧౩౪

ఆ. కాల బలప మంటఁగట్టితిఁ దిరిగితి
ఫలము గనక తుదకు భంగపడితి
మాటదక్కదాయె మాధవా! యన నవ్వి
ధార్తరాష్ట్ర! యతని తమ్ముఁడవెగ! ౧౩౫

ఆ. పశువునీకు దుర్లభంబాయెనా! యన
ఒకరుగారు పదుగురున్నవారు
మనుజపశువు లట్టిమందలో నీయిచ్చ
వచ్చువారిఁ గోరవచ్చుఁ జూచి. ౧౩౬

ఆ. మెచ్చినాఁడ నిన్ను! తెచ్చిచూపు మటన్న;
పట్టితెచ్చి నిలుప వారిఁగాంచి
ఒక్కరొకరినడత యున్న దున్నట్లుగా
చెప్పఁడీరె! తప్పు చెప్పినారొ!- ౧౩౭

ఆ. కండ లెల్లఁ దఱిగి, కారము నుంచెద మన;
అనృతమేల! సత్య మాడఁగలము
వాని నెల్ల మీఱ పరిశీలనము చేసి,
చిత్తమెట్లొ! యట్లె సేయుఁడనుచు— ౧౩౮

ఆ. చెప్ప మొదలుపెట్టఁ జిత్రముగాఁ దోఁచె
అంతరంగభక్తుఁడగు నొకండు,
సత్యవాదియొకఁడు, సంతుష్టుఁడొక్కఁడు,
కాశికాది తీర్థగమనుఁ డొకఁడు. ౧౩౯

ఆ. జీవహింస చేయఁ జెయిచాపఁ డొక్కఁడు
భూతహితముఁ గోరు బుద్ధినొకఁడు
పరగు నొక్కఁ డేకపత్నీవ్రతస్థుఁడై
తనకొలంది నర్థిఁ దన్పు నొకఁడు. ౧౪౦

ఆ. పుణ్యకార్యములకు మోదమందు నొకఁడు
నదులఁ గ్రుంకు మాఘమొదవ నొకఁడు
వేషభాషలందు వెఱ్ఱులట్లుండిన
పశువులనుచు వారిఁ బట్టె నృపతి. ౧౪౧

ఆ. అరసి వారినెల్ల ననియెఁ బద్మాక్షుఁడు
'పశువులనుచు వీరిఁ బట్టితేల!
మంచివారిఁ దెచ్చి వంచింతువా? నన్ను
వారకరనినవాని దూఱినానె! ౧౪౨

ఆ. మంచి చెడ్డ లేర్పరించఁజాలని వానిఁ
బశువటండ్రు వీరిఁ బంపుమరల
అనియెఁగాన; తత్త్వమరయుట కష్టము
ఎల్లయెడల సుగుణముండు నెదియొ! ౧౪౩

ఆ. దోషమించుకైనఁ దొడరని గుణమేది?
గుణములేని దోషమును గలుగదు
పాలుగూడ వేడి పైత్యము గావించు
గరళమైనఁ బ్రాణిఁ గాచుఁ దతిని. ౧౪౪

ఆ. తత్వమరసి, దోషతమమైన విడనాడి,
గుణవిశేషమైనఁ గొనుట తగవు
పై మెఱుంగు చూచి, పడరాదు పొరపాటు
కొరతపడినరూపు తఱుమరాదు. ౧౪౫

ఆ. అనివచింప దేశికా! సత్యపరుఁడైన
పాండవేయుఁడేల వనులఁదిరిగె?
కుటిల వర్తనుండు కురురాజు సంపద
పెంపుగాంచె? వీరి విధమదెట్లు. ౧౪౬

యుధిష్ఠిర సుయోధనుల పూర్వజన్మ వృత్తాంతము.

క. తెలుపుమని సభ్యు లడుగం,
బలికెం దేశికుఁడు, పూర్వభవమున వీరల్
గలిగిరి విప్రాన్వయముల
కలిమిని ధర్మజుఁడు పేదగాఁ గౌరవుఁడున్. ౧౪౭

చ. చదివినవాఁడు, సాధుజనసమ్మతు, డార్తధనుండు, ద్వాదశిం
బదియునురెండుమంది తగుబ్రాహ్మణులన్ భుజియింపఁజేయు, సం
పదకనుకూలమానటుల మానికముంచి యొసంగు వీడెముల్
వదలక పాండవుం డుభయపక్షములందు వ్రతమ్ము సల్పుచున్. ౧౪౮

చ. చదువరిగామి, జీవనముచాలమి, కాష్ఠము లమ్ముకొంటయే
బ్రదుకున కాకరమ్మగుట, బ్రాహ్మణధర్మము వాసి, నిత్యదుః
ఖదమగు పూర్వకర్మమునఁ గౌరవనాథుఁడు కంది కుంది, యే
యదనునసైన వీని వ్రతమందు భుజించెడి భాగ్యమబ్బినన్ — ౧౪౯

క. దారిద్ర్యముతో సంచిత
ప్రారబ్ధము లెల్లఁ దీరుఁ, బాఱుఁడనై సం
గోరినఁ గై కోఁడు, దురా
చారుఁడనని; దీని కేది సాధనమనుచున్. ౧౫౦

క. పరికించి, నాకుఁగట్టెలె
పరికర, మింకొండునేర, వై చెద మోపా
ధరణీసురు దయవచ్చెడి
వరకు న్దినదినము తెల్లవారక మున్నే. ౧౫౧

ఆ. మంచివాఁడు కొన్ని మాసాలకేనియు
మెత్తపడకపోఁడు; మేలుత్రోవ
కలుగదింతకన్నఁ గానిమ్మటంచట్లు
లాఱునెలలు వైచె నతని దొడ్డి. ౧౫౨

ఆ. మఱల మోపుఁదెచ్చి; మను దానినమ్ముచుఁ
గడచెఁగాలమిట్లు; కాంత పతికిఁ
జెప్పదాయె; విభుఁడు చెప్పి వేయించునో
కట్టెమోపులనుచుఁ గాలుచుంట. ౧౫౩

ఆ. ఎఱుఁగఁడతఁడు, చివర కెఱిఁగించెఁ
'జాలవా! కట్టెలింకఁ బెద్దగుట్ట వడియె
వలవదనుఁడు! తెల్లవారకపూర్వమే
మోపు తెచ్చివైచి పోవునెవఁడో! ౧౫౪

ఆ. వలదటంచుఁ జెప్ప వాంఛింతుఁ గనరాఁడు
మూల్యమెంత? దీని మూలమేమి?,
అనినచింప విప్రుఁడాలించి 'నేనేమి!
కట్టెలేమి! వైవఁ గట్టడేమి! ౧౫౫

క. వేయుమని చెప్ప నెవనికి
నీయను మూల్యమ్ము; దీనికేది హేతువొకో!
ప్రేయసి చెప్పవు మున్నే
పాయక కనిపెట్టి వానిఁ బట్టఁగ వలయున్'. ౧౫౬

చ. అని నడురాత్రినుండి యట నారయుచుండినఁ గోడి 'క్కొక్కొరో'
వినఁబడునంతకుం బడియెఁ బెల్లగు పుల్లలమోపు; వైచివే
చనియెడువాని కష్టపడి, చాలును నిల్వు! మెవండవోరి! యీ
పని యొనరింపు మంచెవరు పల్కిరి నిన్ను వచింపుసత్యమున్! ౧౫౭

ఆ. ఎన్నిదినములాయె నీరీతి కట్టెలు
వేయ సాగియనిన; 'విప్రకులుఁడ
రామభద్రుఁడంద్రు సామి! మీయింటిలో
వ్రతమునాఁడు కుడువ వాంఛగలుగ- ౧౫౮

ఆ. వైతుఁ గట్టెలిట్లు వర్షార్ధమాయెను
దయకుఁ బాత్రుఁడ' ననఁ దగు సెబాసు!
మంచివాఁడ! వెంతమాయలమారివి!
కుడుపు కేమి! విలువఁగోరు మిడెద. ౧౫౯

క. నీ ఋణభారము మాపైఁ
బేరిచితే! కట్టెమండెఁ బేరిచినటులీ
కోరిక మదిలోఁ బెట్టుట
నేరుపరీ! చాలుఁజాలు నిను మెచ్చవలెన్. ౧౬౦

ఆ. చెప్పు! మూల్యమనినఁ గుప్పగా నావొత్తు
ద్రవ్యమిడిన నొల్ల; ధన్యుఁడగుదు
పరమపూజ్యమైన బ్రాహ్మణపంక్తిలోఁ
జేర్చితేని ఋణము దీర్చ్చదనిన. ౧౬౧

ఆ. 'గడుసువాఁడు వీనిఁ గడప సాధ్యముగాదు
అప్పు దీర్ప వేరె యనువు లేదు
ఇతఁడుగూడ విప్రుఁడే కద! పోనిమ్ము
పాపమగునె యొక్కపరి భుజింప. ౧౬౨

ఆ. అని విమర్శచేసి, యట్టులేకానిమ్ము
వ్రతదినాన రమ్ము! వచ్చు నెల్లి
పొమ్మటన్నఁ బొంగి పోయెను విప్రుఁడు
పడిన కష్టమెల్లఁ బండె ననుచు. ౧౬౩

క. ద్వాదశివచ్చిన నతఁడా
భూదేవునియింటఁ గుడవఁబో స్నాతుండై
బూదిజమిరి మేనెల్లను
వేదవిదులపంక్తియందుఁ బీట వసించెన్. ౧౬౪

ఆ. 'దాతచిత్తవృత్తిఁ జూతుఁగాక'ని హరి
ముసలి పాఱుఁడగుచు 'నసురుసుర'యి
వచ్చినిలిచి, తల్పువాయించి, గొంతెత్తి
యఱచె, 'బ్రాహ్మణుండ నతిథి' ననుచు. ౧౬౫

ఆ. వచ్చి తలుపుఁదీసి, వాని పల్కాలించి,
వల్లకాదు, నాకు వ్రతపరిమితి
పూర్తియయ్యెఁ బెచ్చు పొసఁగదు, ద్వాదశి
కుడువఁబెట్టననుచుఁ గూర్చ గడియ. ౧౬౬

ఆ. తలుపు వేయనీక, దారి కడ్డమువచ్చి,
'ముసలివాఁడఁ! బ్రాణములు నిలువవు
కాళ్ళు కొంకుపోయెఁ, గనులు చీకటిగ్రమ్మె,
చెవులు గడియవడియెఁ, జెమట లోదవె. ౧౬౭

చ. కుడిచితి మొన్న ప్రాణములు ఘోషిలుచున్నవి కాలుదీసి యీ
గడపను దాటఁజాల నను గాదని త్రోసితి వేని, ప్రాణముల్
విడిచెద; బ్రహ్మహత్య నిను బీల్చును, బిప్పియొనర్చుఁ, జెల్లరే!
పిడికెఁడుకూడు నాకిడిన వేలగునే? దయలేని మానినీ! ౧౬౮

ఉ. ద్వాదశిఁబెట్టనేల? కలవారలఁ దోకొనివచ్చి, పాత్రునిం
గాదని నన్ను గెంటెదవు; కాదిదిధర్మము, బ్రాహ్మణుండవై
వేదము శాస్త్రముంజదివి వీఁడిట్టివై తివి పెట్టఁదప్పఁగా
బోదికనీకు, నాకుఁ జనఁబోలదు మెక్కక వాద మేటికిఁ?'. ౧౬౯

ఆ. అనుచుఁ గూలఁబడిన నొఁగాక! యట్టులే
కుడిచిపోదుగాని కూరుచుండు
వేడిపాళ మావ వేసిన గారెలు
లేవె కొంపలింక లేకి వాఁడ!. ౧౭౦

ఆ. బిగువుచూపెదార! బిచ్చమునకువచ్చి
దాచినావె నీది తాతముల్లె
పోవడంట తినక చావనీ! నాకేమి?
మొండిగడియకారు ముక్కవీఁడు. ౧౭౧

క. వీనికిఁబెట్టినఁ బాపము
మానక చేకూరు సాధుమార్గము లేదే
కానీ చూతును వీనికి
నేనా లొంగెదను దొలుతనే చెప్పనొకో!. ౧౭౨

క. అనుచుఁ గాఱులఱచి, చని లోనివాకిలి
మూసి, చెప్పి వాని ముచ్చటెల్ల
పంక్తి బ్రాహ్మణులకుఁ బరిషేచనము వేయ
సిద్ధపడినఁ జూచి 'ఛీ' యనుకొని. ౧౭౩

ఆ. కట్టెలమ్మినతఁడు కటకటా! యిదియేమి?
కలిమికాఁడు త్రుత్తుఁ దెలియఁ గలఁడె!
మాటలెన్నియైన సాటియే యొకనాఁటి
అనుభవమున కనుచుఁ గని గృహపతి- ౧౭౪

ఉ. 'వాకిట నుండఁగా నతిథి వానినివీడి భుజింపఁ బాపముల్
చేకురు టబ్రమే! యతనిఁజేర్పఁగ నీకు రుచింపదేని, నా
యాకున నుంచి నేఁజనెద; నర్చితుఁజేయుము నాకు మారుగా
నీకును నాకు మేలు ధరణీసుర శాంతివహింపు నాపయిన్'. ౧౭౫

ఆ. అనుచుఁ దలుపుతీసి యాతనిఁ దోడ్తెచ్చి,
పీటమీఁదనుంచి, వెడలిపోయి
యింటికేగి భార్యయిడిన సంకటిఁదిని
తా భుజించినట్లె తలఁచె మదిని. ౧౭౬

ఆ. చదువనేమి! విబుధ సహవాసి గానేమి!
తెలియనేమి! పరులఁ దెలుపనేమి!
క్రోధలోభములకుఁ గుదురాయెనా; వాని
బోధలెల్ల రిత్తవోవు టరుదె! ౧౭౭

క. కుడిచినపిమ్మట పీడెం
బిడఁబోఁగాఁ గుడువఁ బెట్టితే నీ వతఁడే
యిడుఁదాంబూలము వలదని
'బుడబుడ' చని యడిగి రెండుపోకలిడఁ జనెన్. ౧౭౮

ఉ. ఆదరదూరుఁడై యతిథి నర్చనసేయమి ధర్మరాజు తా
ద్వాదశవర్షముల్ వనులఁ దాపమునొందె ననంతకష్టసం
పాదనఁ గన్న యన్నమిడి, పాలనఁజేసె సుయోధనుండు స
మ్మోదముతో వసుంధరను భూపతియై పదిరెండువర్షముల్. ౧౭౯

క. వారల చరిత్రమిది మీ
రారయుఁడీ! పాత్రభూతు సరసిన ఫలముల్
వారించిన దోసమ్మును
తోరపు పున్నెమ్ము లతిథితోఁజనుఁ దోలన్. ౧౮౦

ఆ. అనిన హర్షమంది యాచార్యు నుతియించి
సభ్యులనిరి పూర్వజన్మమందు
కర్ణుఁడెట్టివాఁడు? కవచముతో నెట్లు
జననమొందెఁ దెలుపఁజను సటన్న. ౧౮౧

కర్ణుని పూర్వజన్మ వృత్తాంతము.

చ. కలఁడమరావతీపురిని గన్నఁపుదొంగ యొకండు, శౌర్యసం
కలితుఁడు, ధీవిశారదుఁడు, కాలుని గేలియొనర్చు సాహసో
జ్జ్వలుఁ, డరిలోకభీకరుఁడు, సాలమహీజలముపోల్కి దీర్ఘమై
వెలుఁగుశరీరముల్, బలము, వింటసమర్థతగల్గి దిట్టయై. ౧౮౨

ఆ. ప్రబలివాఁడు కొంతబలమును జేపట్టి
మూకగట్టి గ్రామములను జుట్టి
ధనికవరులదోచి, దానధర్మములచేఁ
దన్పుచుండు విప్రతతుల నెల్ల. ౧౮౩

ఆ. ఊరిలోనివాని నొక్కని రాఁదీసి
శూరులెవరో! వారి పేరు లరసి,
సమయమనుసరించి సామదానాదుల
వశముచేసికొనును వారిఁదనకు. ౧౮౪

ఆ. కట్టి వారినిట్లు కనకము గలవారి
గుట్టెఱింగి, యిల్లు చుట్టుముట్టి
వడిసెలలను, రాళ్ళవర్షము గురియుచు
తల్పు గడ్డపాఱఁ దన్నివైచు. ౧౮౫

ఆ. నిచ్చెనలఁ బ్రాఁకి గోడలనిలిచి, దూకి
గడియసడలించి, లోనికిఁ గవియఁగుంపు
పట్టి ధనికుల బాధించి, చుట్టఁబెట్టి
దోచుకొనిపోవుఁ జీఁకటిదొర యనంగ. ౧౮౬

క. విపినములనిల్చి, పాంథుల
నపగతకాంచనులఁ జేసి, యనుచరులలరన్
తపనునిక్రియ దుస్సహుఁడై
విపరీతపుపనుల వాఁడు విశ్రుతుఁడయ్యెన్. ౧౮౭

క. పట్టువల దాఁడువారల
ముట్టకుఁడీ! విప్రవరుల మూటలు, దారుల్
గొట్టెడుతఱి, దోపిడికిం
బట్టుగుతఱి, ననుచుఁ దెలుపు బంటులకెల్లన్. ౧౮౮

గీ. పయనమై దోఁచఁజనునప్డు పైడికంటి
కూసినం బైడిమూట చేకూరఁగలదు
ఆవఱచెనేని చేటు మీకావపిల్లి
కయ్య మాఁబోతు ఱంకెతోఁ గాలుదువ్వ. ౧౮౯

గీ. త్రాటఁ బశువునుగొని నరుల్ దారికెదురు
వచ్చిరేనియుఁ దాఁ గట్టువడుట నిజము
ఆయుధము చేతిలోజారి యవనిఁబడిన
గడప, ముంజూరు, నెత్తిపై నడచికొనిన- ౧౯౦

గీ. బల్లి కిచకిచలాడిన, వఱఁ డఱచిన,
కుక్క చెవులను గొట్టిన, గూబఁ గనిన,
కీడు; దుశ్శకునముఁ గని కూడ దరుగ
శకునముల మేలుగని పోవ జయ మగు నను. ౧౯౧

క. సంతర్పణముల బ్రాహ్మణు
లెంతయు ముదమంద నర్థమిడు దక్షిణగా
నింతులకు, గోవులకు, ద్విజ
సంతతులకుఁ, గీడుసేయు జనుల వధించున్. ౧౯౨

క. భీకరకృత్యమ్ములనే
కాక, మేలుపనులఁగూడఁ గడుశీఘ్రముగా
లోకమున వానినామం
బేకాకృతి నల్లుకొనియె నెనిమిదిదెసలన్. ౧౯౩

ఉ. వాఁడొకనాటిరాత్రి తన వారవధూమణి పొందుఁగోరి, కా
రాడగకాఱుమబ్బులు నితాంతపుఁజీఁకటిఁ బొంతపల్లె కా
ల్జాడనఁ బోవుచుండి, వెలచానఁ దలంచు పరాకుతోడ, మన్
దోడిన పెద్దగుంటఁబడె దొర్లి, మహోగ్రశిలాతలంబునన్. ౧౯౪

ఆ. పడ్డపాట రిమ్మవట్టి గాయముగని,
చాలునింక సాని సంగతంబు,
తప్పుత్రోవఁ బోవఁ ద్రిప్పలు తక్కవా!
భాగ్యశేషముంట బ్రతుకుఁ గంటి. ౧౯౫

ఆ. అనుచు లేచివచ్చి, యాలయమ్మొకఁడుండ
చేరి, దానఁ గొంత సేదతేఱి,
అతివమెచ్చుఁగొనిన, యాకులు, పోకలు,
పూలదండ, శివుని మ్రోల నుంచి- ౧౯౬

ఆ. అర్పణమ్మొనర్చి, యంజలిఁ గీలించి,
సన్నుతించి, నేలఁ జాగిమ్రొక్కి,
పోయి కొంపచేరి, గాయము మానఁగా
పూర్వరీతినుండి, పాలిసి పిదప. ౧౯౭

క. తామస భక్తిని వీడెము
కామహరున కొసఁగెఁ గానఁ గలిగె దనుజుఁడై
నేమమునఁ దపముచేసెం
గామితములు శివునివలనఁ గాంచెద ననుచున్. ౧౯౮

ఆ. అంత హరుఁడు వాని యంతికమ్ముననిల్చి
'ఏలతపము! కోరుదేమి?' యనిన
'చావు రుజయులేని జీవనంబొసఁగుమీ!
కరుణ గలిగెనేని, పురహర' యన. ౧౯౯

క. 'యద్దృశ్యం తన్నశ్యం
బద్దిర మృతి కమలభవునకైనఁ గలుగదే!
తద్దయుఁ దగదీకోరిక
ఎద్దేని యొకండు గోరు మిచ్చెద' ననినన్ ౨౦౦

ఆ. 'కవచశతము మేనఁ గలిసి యుండెడునట్లు
వేయియేండ్లు తపము చేయునెవఁడు
వాఁడు వేయియేండ్లు భండనమొనరించి
కవచమొకఁడు త్రుంపఁగలుగునట్లు. ౨౦౧

ఆ. అట్లుకవచశతము లడగించువారలు
గలిగిరేని, వారివలనఁ గలనఁ
గూలనొప్పికొంటి శూలాయుధా!' యన
నగి యొసంగిపోయె మృగధరుండు. ౨౦౨

క. వరబలమున వాఁడెల్లర
దురమునవోడించి మించి దోర్బలశాలిం
బురుఁడైనవానిఁ గానక
పరికించుచుఁ గాంచెనొకటఁ బరమేష్ఠిసుతున్. ౨౦౩

ఆ. కాంచి మ్రొక్కి నన్ను గలనిలోఁ దనియించు
వారలున్నఁ దెలుపవలయు ననిన,
'బదరికాశ్రమమునఁ బరమతపస్వులై
నరుఁడు, హరియుఁ, గలరు దుర మొసంగ. ౨౦౪

ఉ. వారలె కాక నీకు సరివచ్చుమగండు త్రిలోకమందు నె
వ్వారలు లేరు; పొమ్ము! బలవైభవముం బ్రకటించుకొమ్ము' నన్
మీరినరోషవహ్నిఁ దన మీసలు దీటుచుఁ జేరి వారి రాఁ
గోరినఁబోరికిం దపసికుంజరు లాతనిఁజూచి తాల్మితోన్. ౨౦౫

క. 'తాపసులము రణమునకే
మోపుదుమే! యమరదనుజయోధులతో నీ
చాపమ్ము నెక్కువెట్టుము
కాపురుషా! యేల రిత్తకలహం' బనినన్. ౨౦౬

ఉ. 'శోకలుచుట్టఁబెట్టుకొని తూఱిరి వారలు సందుగొందులన్
నాకెవరీడు చెప్పుమన నారదసూని వచించె మిమ్ము నా
కాకను మార్కొనం దరముగాదని జంకువహింతురేని, రెం
డేకముచేయుఁ డట్లయిన నేగెదఁ బూరుషులున్నచోటికిన్'. ౨౦౭

ఆ. అనిన నగిరి వార లట్టులా కానిమ్ము
టంచు విల్లువట్టె నసురహంత
వానితోడఁబోరి వర్షసహస్రము
కవచ మొకఁడు తుక్కుగా నొనర్చె. ౨౦౮

క. నరుడంతట చాపముగొని
దురమునకుందొడర నిష్ఠతో నతితపముం
బరగించుచు వేయేఁడులు
పరిపూర్ణంబైన శౌరిపట్టెను ధనువున్. ౨౦౯

క. భండనమున నరుఁడాలో
ఖండితముగఁ జేసె నొక్కకవచము; దానన్
బెండువడక దైత్యుండును,
చండతరాస్త్రములఁదాఁకె సారసనేత్రున్. ౨౧౦

ఆ. ఒకఁడు తపముచేయ నొకఁడు పోరాడుచు,
వేయియేండ్ల కొకటి విఱిగి పడఁగ,
కవచ శతములోనఁ గడకొక్కటియె చిక్క,
పోరిపోరి వాని పొంగడంప,— ౨౧౧

ఆ. బెండువడియె నసుర గుండె చలించిన,
పోరఁజాల నన్ను పోవనిండు!
ఓడినాఁడననుచు వీడినఁజాపము
బిరుదు లడఁగె నటర పిఱికిపంద! ౨౧౨

ఆ. పొమ్మటన్న మగువపోలికఁ దలవంచి,
యరిగి, తనకు లోకువైనవారిఁ
దొడరి, వారితోడ దురమొనరించుచు
తిరిగితిరిగి కాలపరవశుఁడయి. ౨౧౩

క. అప్పుడు మిగిలినకవచం
బొప్పుగ నెమ్మనఁ గుంతికుదయించెను; మున్
గప్పిన దానవవాసన
చొప్పున దుర్జనహితుండు, శూరుఁడు నయ్యెన్. ౨౧౪

ఆ. తపమువలన శూలిఁ దనియించుటను, హరిఁ
గదనమందుఁ బెద్దగనినయట్టి
పున్నెమునను, వాఁడు పుత్రుఁడై జన్మించె
భాస్కరునకు; దానపరుఁడునయ్యె. ౨౧౫

ఆ. పూర్వవైరమునను, బురుషోత్తముని గ్రీడిఁ
గదనమందు గెల్వఁ గాంక్షచేసి,
కూలె; వారివలనఁ గోరినరీతిగా
వరము శూలివలనఁ బడసి నట్లు. ౨౧౬

దానము

క. తప్పుదు దండుగ గుప్పిటఁ
గప్పిన, గోతినిడి మన్నుగప్పిన నైనన్,
దప్పించుకొనును ధర్మమె;
గొప్పగ గర్జించి పొమ్ము! గొణఁగకు మనుచున్. ౨౧౭

ఆ. తనకు సుఖముఁగోరి వనితను బోషించు
దాని బ్రదుకు తెరువుఁ దలఁచి కాదు,
పరుల కేలయిచ్చుఁ బరసౌఖ్యమెఱుఁగక,
పాత్రదానఫలము పలుక నగునె! ౨౧౮

ఆ. కానియిచ్చు, రెండుకాను లిచ్చును గాని,
వందలొసఁగబోఁడు వదరువాఁడు
వందలొసఁగువాఁడు వందనమ్మె చేయుఁ
బెట్టిపోయదత్త; రట్టుమెండు. ౨౧౯

ఆ. అంగదములు రవలయుంగరమ్ములు, గావు
కడియములును, గావు కంకణములు,
పాత్రదానగుణమె పాణికిఁ దొడవండ్రు;
తెగువలేనిచేయి తెడ్డుకట్టె. ౨౨౦

ఆ. దానమిచ్చుకాసు దాఁచిన వేలౌనె?
పాత్రదానఫలము పంటవోలె
వేలులక్షలగుచు వెన్నంటి చనుదెంచు
దానిఁదెలియలేక తరుమునర్థి. ౨౨౧

ఆ. పెట్టుచేయిపైన, పట్టుచేయియెు! క్రింద
వారిగతులుకూడ వానివలెనె
అర్థిపుణ్యమొసఁగి, యర్థముఁగొనిపోవు
రత్నమొసఁగి, గాజురాయి వోలె. ౨౨౨

ఆ, పుచ్చుకొనినయర్థి పుణ్యములోఁ గొంత
ధాత! దాతసంచితమునఁ జేర్చుఁ
గాన దానమివ్వఁగాఁ బట్టనొల్లక
బ్రదికి రుంఛశిలలవలనఁ దొల్లి. ౨౨౩

ఆ. యాచకుండు కావవచ్చిన 'హరి'యని
ప్రియమువలికి యిడుటపెంప, పాత్రుఁ
డయిన నన్నమిడుటె యర్హమౌ, నాకలిఁ
గొన్నవాఁడె పాత్రుఁ డన్నమునకు. ౨౨౪

క. విత్తనము లొక్కపూటకు
బత్తెమ్మగునంచుఁ దినెడివానికి ధాన్యం
బెత్తెరఁగున రా నేర్చును
విత్తక పొలమందు; వానివిధి లోభికగుఁ. ౨౨౫

## అప్రతిగ్రహము

ఆ, ఇచ్చువాఁడెకాని, పుచ్చుకోఁడెవ్వఁడు.
కృతయుగమున వేడి రేని నేఁడు
ఇచ్చువాఁడులేఁడు; హెచ్చు దూషించుట
పాపఫలముపండెఁ బ్రబలి కలిని. ౨౨౬

ఆ. కఱవువలన మునులు కాటిపీనుఁగుఁబట్టి,
నమలఁబోవ భూమినాథుఁడెఱిఁగి,
'అన్నమిడెదఁ బీనుగదియేల! 'రం'డన
'నృపునిసొమ్మువలదు నిరయ'మనిరి. ౨౨౭

ఆ. యజ్ఞమందు దక్షిణార్థమిచ్చిరి వీని
ఋత్విజునకుఁ; గాన నితనిఁదినిన
పాపభయము లేదు ప్రాణముల్ నిలుచును
నీది వలవదనుచు నృపునివిడిచి. ౨౨౮

ఆ. ఒక్కయేటిపొంత మెక్కియాడుంబరి
ఫలములును, జలంబు, బ్రహ్మఋషులు
తపముచేయుచుండ; ధరణీశ్వరుఁడు చూచి,
'వీరిసేవ త్రిదివవిజయ' మనుచు. ౨౨౯

ఆ. భక్ష్య, భోజ్య, లేహ్య, పానీయముల నంపె
కండ్లఁగనరు మునులు; కట్టెనిల్లు
దానిఁజొరరు వానఁదడిసిన వలిదైన
పెట్టెవల్కలములు; ముట్టికొనరు. ౨౩౦

ఆ. ఔర! నృపునిద్రవ్య మంటరో! వీరలు
ఎట్టులైన వీరియెడల మనది
చెందెనేని, మేలుచేకూరునని, రాజు
పైడి రేకులుంచెఁ బండ్లలోన. ౨౩౧

ఆ. మేడిపండ్లలోన మిళితమై రేకులు
కరఁగిపోవుచుంటఁ గానఁబడమి
పట్టిచూచి, బరువుఫలముల విడనాడి,
తేలికయినవానిఁ దినుట చూచి. ౨౩౨

ఆ. 'వీరి తెరువుపోవఁ బాటిపోవుదురిఁక
ఊరకున్న వారలుందురిందె
అయ్యవారిఁజేయ నగుఁగోతితిమ్మన్న
'ఒల్లకున్న సుధయుఁ, బుల్లనగద!' ౨౩౩

ఆ. అనుచు వారిచెంత కరుగక నరపతి
నిలుపుకొనియె వారి నిజధరణిని
ధర్మమాఱుపాళ్ళఁ దానొండు గైకొంట
వారివలన దివము చూఱఁగొనియె! ౨౩౪

## స్వర్గనిరసనము

గీ. పాపమును బోల్చిచూచిన భద్రమగును
పుణ్యకర్మము; దానిచేఁ బుట్టువౌదవ
గర్భనరకము మరణసంకటము గలుగు
ఇనుమయిన నేమి! సంకెల కనక మేమి! ౨౩౫

గీ. ఇనుపసంకెల వదలిపో నేర్చుఁగాని
కనకశృంఖల సొమ్మట్లు గారవించు
పాపకర్మము బాధచే వదలుఁగాని
పుణ్యకర్మము సుఖములఁబొంది విడదు. ౨౩౬

గీ. అర్థమార్జించి, రక్షించి, యజ్ఞములును
సప్తసంతానములు గూర్చి, స్వర్గమునకు
మురియుచును బోయి సురరాజు మ్రోలనిలువ
వత్సరములిన్ని, నెలలిన్ని, వారములివి. ౨౩౭

గీ. పుణ్యఫల మిట్లు భోగించి, పోయిమఱల
భూమిని జనింపుమని చెప్పఁ బోయెనేటి
రోజొకండని చింతింప; రోజురోజు
జరిగినకొలంది వచ్చెరా! జన్మదినము. ౨౩౮

గీ. అనుచుఁ దపియించుఁ దనకన్న నధికవిభవ
మందువారలఁగని మనమందుఁ గుందు
కర్మభువియిది, ఫలభూమి గానదివము
భోగమేకాని, పుణ్యముల్ పొసఁగవచట. ౨౩౯

గీ. ఉగ్గుతో జిత్తులను నేర్చియున్న వేల్పు
తొత్తులకు దాసుఁడై; వారిచిత్తములకు
పాత్రుఁడై, కొల్వ వెలయాలివలప దెంత?
భోగమన నెంత? స్వర్గము బూటకమ్ము. ౨౯౦

గీ. అందియందక, వారితో నణఁగి మణఁగి
మరగి సుఖముల విడనాడ మనసురాక
ధాత్రి జన్మించునాఁడు సంతాప మొందు
మీసముల తేనె స్వర్గసమ్మేళనమ్ము. ౨౯౧

సీ. "ఆహ్లాదుఁడరుదెంచి యపహరించెఁ బురంధ్రి
రండు దిక్పాలురు దండుతోడ
బలి చుట్టుముట్టె శంబరుఁ డచ్చరలఁబట్టె
బాణుని ప్రభ హెచ్చె స్థాణునిదయ
రావణాసురుఁడెత్తి రాఁడుగదా! నేఁడు
కుంభకర్ణుఁడు నిద్రకును జనియెనె
ఇంద్రజిత్తనుమాట బొందితో విననాయె
నపకీర్తికన్నఁ జావధికమగునె!

వచ్చెనరకాసురుఁడు గెల్వవచ్చునెట్లు
గురుఁడ! యోజింపు"మని నిత్యమరసికొనుచుఁ
బొక్కుచుండెడి సురనాథు భోగమెంత
త్రిదివమన నెంత దానికిఁ దిప్పలెంత. ౨౯౨

గీ. "జావ సుల్తాను త్రాగఁగాఁ జావె మిగత
పరిజనుల"కన్న పోలికఁ బ్రభువెయిట్లు
నిత్యసుఖలేశరహితుఁడై నెగులుగాంచ
స్వర్గమున నీవుగాంచెడి సౌఖ్యమేమి? ౨౯౩

గీ. చేసియున్నట్టి పుణ్యముల్ చెప్పికొనిన
తీరుఫలమంతతో యయాతికిఁ జెడినటు
మఱల జన్మించినపుడు ప్రమాదములను
పాపములదాటి నడువఁగా వలఁతులెవరు! ౨౪౪

గీ. నృగుఁడు, నహుషుఁడు, భరతుఁడు, నిమి, సుదాము
డయిరి యూసరవెల్లి, వాతాశనమ్ము,
రంకువు, విదేహుఁడును, ఘోరరాక్షసుఁడుగ,
పండితుల్ గారె ఘోరపాటుపడరె వారు. ౨౪౫

గీ. జొత్తరి త్రిశంకుఁడును మహిమాఢ్యులయ్యు
మృతియుఁ దల్క్రిందుగా వ్రేలుగతియుఁ గనరె!
చిక్కుకొని యాపదలయందుఁ జెడిరి కాదె!
బంధహేతువు పుణ్యము పాపసమము. ౨౪౬

భక్తివైరాగ్యములు

గీ. గర్భముననున్నదాది వ్యాఘ్రమ్ముపగిది
పొంచి, మృత్యువు గొనిపోవ నెంచుచుండు
బాల్య కౌమార యౌవన వార్ధకాది
సమయములఁ గాలతరులతాసమితిడాఁగి. ౨౪౭

గీ. నిత్యమును మృత్యువెపుడు సన్నిహితమనుచు
వినియు నేమఱియుండుట వెఱ్ఱితనము
తెల్లవారినయంతనె తెలియవలయు
జీవితములోన నొకరోజు చెల్లెననుచు. ౨౪౮

గీ. మడుగులోఁ జేరు నీరమా! మఱలరాదు
కడచిపోయిన కాలమా క్రమ్మరిలదు
వయసుగడచిన దేనికిఁ బనికిరాఁడు
బలముకలనాఁడె సాధింపవలయు ముక్తి. ౨౪౯

గీ. కాయముడుగంగఁ గోఱఁగాఁడు కాంతకనిన
ముక్తికామిని కింపౌనె? ముసలివగ్గు
'కాంతపిల్చిన నీరసకాయ మిదిగొ!
అప్పన'మటన్న దేవుఁడు చప్పననఁడొ? ౨౫౦

గీ. కాలమాగక పరుగెత్తి కడచిపోవ
శ్రేయమగు మార్గమును జక్కఁజేసికొనక
వేడుకలఁ గడపుచుందురు కూడుగలుగఁ
జిక్కి యిగిలింప ఫలమేమి చేటునాఁడు. ౨౫౧

సీ. దార్ఢ్యమా? పనిలేదు; ద్రవ్యమక్కఱలేదు
పరుల సాహాయ్యమా! పనికిరాదు
దేహకష్టముగాదు తిరుగుడించుక లేదు
ఆలుబిడ్డలవీడు జాలిలేదు
భుక్తి తక్కువ గాదు ముక్తి పొమ్మనఁబోదు
మొగసాలలో దాసిపగిది నిలుచు
కంఠీరవముగన్న కారుపోతులక్రియ
యమదూత లావీధియందు రారు

పాడినకొలంది మధురమై పండియొఱఁగు
పలుక చులుకన తృప్తి సంబరము యశము
కమలనాభునిఁ గీర్తింపఁ గననివాఁడు
మానుగా మేలు మనుజుఁడై మనుటకన్న. ౨౫౨

క. మధురంబగుదధి, దానికి
మధురతరము ద్రాక్ష, చెఱకుమధురతరమ్మౌ,
మధురానాథుని చరితము
మధురపదార్థములలోన మధురతమంబౌ. ౨౫౩

ఆ. ఓడమాలిలేక కూడునే? నదిదాట
చారిజూప కడవి దాటనగునె?
జలధి నడవిఁబోలు సంసారమును దాట
వలఁతె శౌరికరుణ వలనఁ గాక. ౨౫౪

క. కావున శ్రీహరిసేవం
గావింపఁగవలయు మేను గలకాలమునన్
దేవుఁడు తనకధికముగా
భావించును భక్తజనులఁ బరమాదరుఁడై. ౨౫౫

భగవద్భక్త సంబంధము.

గీ. తాను నాటిన విషవృక్షమేని తానె
నఱుకఁదగదంద్రు నరకుని నఱికితెట్లు
కలుషయుతుఁడైనఁ బుత్రుఁడు గాఁడె యనిన
నారదునిఁగాంచి వచియించె నగధరుండు. ౨౫౬

గీ. భక్తజనముల దేహ సంవాసినగుట
సాధులను వాఁడు బాధింప సాగినపుడు
వారిహృదయాబ్జముల నేను వర్తిలుటను
తాపమగునాకు నేరీతిఁ దాళవచ్చు ౨౫౭

గీ. గాజుకుప్పె దీపకళను నిల్పినరీతిఁ
గాయమునకుఁ గంచుకము విధమ్ము
లింగమునకుఁ బైడిలింగపుఁగాయట్లు
భక్తవరుల తనువు పరఁగు నాకు. ౨౫౮

గీ. పరుఁడు గుణవంతుడైన నచో బంధువతఁడె
దుర్గుణుఁడు బంధువేయైన దూషితుండె
మలము దేహజమని పూసి మంచిగంధ
మడవి జనియించెనని వీడనగునె చెపుము! ౨౫౯

గీ. ఓ! జగద్వంద్య! సాధులోకార్తిహరణ!
తనువుకంటెను, సతికంటెఁ, దనయుకంటె
భక్తులే నాకుఁ బ్రియులన్న పలుకు నిజము
చేసితివి నేఁడు చేసేతఁ జిదిమి సుతుని. ౨౬౦

గీ. భక్తబాంధవబిరుద మీవలనఁ గాక
ఒరులకెటు చెల్లునని మ్రొక్కి యరిగె మౌని,
పత్రమైనను, సుమమైన, ఫలమునైన,
భక్తితోనిడ సంతోషభరితుఁ డగును. ౨౬౧

గీ. కులము, రూపము, విద్యయుఁ, గలిమి బలిమి
వయసు, సామర్థ్యమును, గాంచి వశముగాఁడు
భక్తిగలవారిసొమ్ము శ్రీవల్లభుండు
బలిహజారముఁ గావఁడా బంటువోలె. ౨౬౨

మా. ఖరదనుజ విదారీ! కంధి గర్వాప హారీ!
కరతల గిరిధారీ! కమ్రబృందావిహారీ!
సురగణ భయహారీ! సూరి చిత్తానుసారీ!
పరమపదదశౌరీ! వజ్రిహస్తోపకారీ! ౨౬౩

---:o:---

శ్రీ

# స్వయంప్రకాశ ప్రబోధము

## ప్రబోధపర్వము

(ఉత్తర ఖండము)

క. శ్రీ రాజీవ దళాక్షా!
దూరీకృత భక్త బృంద దుష్కృత బంధా!
క్షీరాబ్ధి తల్ప శయనా!
దారిత దనుజేంద్ర కఠిన దర్పిత వక్షా!

క. గురు వర్యుఁడు బోధించిన
పరమోత్తము మీ ప్రబోధ పర్వము నందు
త్తర ఖండము సరస కథా
భరితం బిది యవధరింపు పంకజ నేత్రా! ౧

కర్మఫలమీశ్వరార్పణ ముసేయక జీవునకుఁజెందనేరదు

క. న్యాయార్జిత విత్తమ్మునఁ
జేయవలయు దాన మట్లు చేసిన ఫలమో
ఈయవలె హరికి శ్రద్ధగ
శ్రీ యశ మాయువును దివము చెందఁ దలఁచినన్. 3

ఆ. ప్రాణ సంకటమునఁ బడసిన యర్థము
అర్థి కొసఁగి ఫలము హరి కొసంగ
చెడియె రెంట నర్థిఁజేరెను ద్రవ్యము
ఫలము హరికిఁ జేరె నిలిచెఁ దాను. ౪

ఆ. జ్ఞాని గాఁడు గానఁ గనలేఁడు మోక్షము
ఫలము విడిచె దివము కలుగదనకు
జీవుఁ డీశ్వరునకుఁ గావునఁ బ్రతిబింబ
మతని కిడక వీని కంటఁ బోదు. ౫

"గొల్లఁడు - పాగా"

క. పరిణయమై వైదర్భిని
మురహరుఁ డద్దాల మేడ మోసల నున్నన్
ధరణీశులు పురవాసులు
తరలి యరిగి కాన్క లొసఁగి దయఁగని చనఁగన్. ౬

ఉ. గొల్లఁ డొకండు పాగఁ గొని కొల్చెద నేనని వచ్చి ప్రోలు శ్రీ
వల్లభుఁ గాన లేక పుర వైభవముం గని భ్రాంతి నొంది య
ల్లల్లనఁ జేరి వాకిటికి నచ్చటి మూకలఁ గాంచి భీతుఁడై
మెల్లనఁ గూరుచుండెఁ దల మీఁదికి భానుఁడు వచ్చు నంతకున్. ౭

ఆ. వాని జడతఁజూచి బంటొక్కఁ డెవఁడీవు?
ఏల వచ్చి తనిన నేను హరికిఁ
బాగఁ దెచ్చియుంటి లోఁగఁ బో నేరక
యున్న వాఁడ ననినఁ "దిన్నఁగఁ జను. ౮

ఆ. భయము లేదు కృష్ణ పరమాత్ముఁ డొక్కఁడే
యున్నవాఁడు పొమ్ము! మన్ననఁ గను!
దండమిడు" మటన్న దారినే చని లోని
కరిగి నడుమ నున్న హరి నెఱుఁగక. ౯

ఆ. దిక్కు దిక్కు లందు లెక్కకు మించిన
కృష్ణులుంట మొదటి కృష్ణుని కడ
నిలిచి బొట్టు పెట్టఁ దలఁచి కుంకుమఁ బట్టి
నొసటఁ బెట్ట నంట దసలె బొట్టు. ౧౦

ఆ. వీడె మొసఁగఁ జేయి వెలిఁ జాపకుండుట
కాఁ డితండటంచుఁ గడవర కిఁటు
చుట్టు తిరిగి చూచి శోధించి మధ్యలో
నున్నవాని నవ్వుచున్నవాని. ౧౧

ఆ. కాంచి పోయి బొట్టు కను బొమ్మలను బెట్ట
నంటె వీడె మొసఁగ హస్త మమరె
కంటి దార నటంచుఁ గాళ్ళపైఁ బడి లేచి
పాగనొసఁగె హరికి భక్తితోడ. ౧౨

ఆ. వాఁడు భక్తి చేతఁ బరవశుఁడై తన
పాగ మాలిఁ జుట్టి పలికె నిట్లు
కొనరు పాగ నొసఁగఁ గోరిన వీరెల్లఁ
గొంటి వీవ యేలు కొంటి దేవ. ౧౩

ఆ. అనిన వానిఁజూచి హరి పల్కె వారల
వలను జూడు పాగ వారుగూడ
చుట్టినా రటన్నఁ జూచి యొక్కటి పాగ
తెచ్చియుంటి వీరి కిచ్చి రెవరు. ౧౪

ఆ. చిత్ర మనుచు వాఁడు చేతులు జోడించి
పోయెఁ గాన శౌరి కీయ ఫలము
చెందు నీకె యట్లు చేయవో రెండులో
కమ్ములందు నీకుఁ గలుగఁబోదు. ౧౫

ఆ. చెట్టుకొమ్మలందుఁ జిన్న రెమ్మలయందు
నాకులందుఁ బూవులందు నీరు
పోయ ఫలము కలదె? పోయక మూలాన;
మూల మెల్ల లోకములకు శౌరి. ౧౬

భగవంతుఁడు భావనాసదృశ ఫలదుఁడు

క. ఏవారేగతి భావన
చే వనజాక్షుని భజింత్రో శ్రీపతి యటులే
భావించు వారిఁ దానును
దేవ మనుజ శత్రు మిత్ర దేశిక విభులై. ౧౭

క. ఏయే ఫలముం గోరుచు
నేయే దైవముల నెవ్వఁడే భావనచేఁ
జేయు నుపాసన శ్రీపతి
ఆయా రూపముల వాని యభిమతము లిడున్. ౧౮

క. హరి హర సుర గురు గ్రహ ఖే
చర దానవ భూత యక్ష సర్ప విహంగో
త్కర సాగర శైల చరా
చర రూపము లొందు భక్తజన భావనలన్, ౧౯

ఉ. గంగ శరీర తాపమును గశ్మలముల్ హరియించి దేవరా
జ్యాంగణమందుఁ జేర్చుగతి హాటక చేలు భజింపఁ గామితం
బుం గను నంతెకాక కను ముక్తియుఁ దక్క జలాశయంబులా
నింగిని గూర్ప లేని యటు నేరరు వేల్పులు ముక్తి కెవ్వరున్. ౨౦

క. కీటము భ్రమరము నొక్కిన
కాటున భీతిల్లి మనన గతిఁ దద్రూపున్
బాటించునట్లు వైరియు
గాటఁపుఁ బగ విష్ణు రూపుఁ గాంచం గల్గున్. ౨౧

క. నారదుఁడు ధార్తరాష్ట్రుని
కారణముగఁ బృచ్ఛఁ జేయఁగాఁ గృష్ణుఁడు మున్
వారించె సందియంబును
బూరించెద మీకు నది సుబోధము కొఱకై. ౨౨

ధర్మజదుర్యోధనుల చిత్తవృత్తిని నారదుఁడు పరీక్షించుట.

క. వారిజగర్భుని యానతిఁ
దీరిచె వీణాత్రయమ్ము దేవశిల్పి యనా
కారములు వేరుగా స్వర
సారము లుప్పతిల భరతసంఘము మెచ్చన్. ౨౩

క. నారదున కిడియె మహతిన్
శారద కచ్ఛపినిఁ గొనియె సరి తుంబురునిం
జేరెఁ గళావతి వానిన
పేరు పడిరి వారు గాన వేదు లటంచున్. ౨౪

క. తేనియ సోనలు గురియఁగ
వీణియ మీటుచును బల్లవింపఁగఁ దరువుల్
గానము చేయుచు నారద
మౌనీంద్రుఁడు వచ్చెఁ గంస మర్దనునిఁ గనన్. ౨౫

క. వచ్చిన మౌనికి నర్ఘ్యం
బిచ్చియుఁ బూజించి పీఠమిడి మౌనివరా?
ఎచ్చటనుండి మహాత్ములు
వచ్చుట వినఁదగిన వున్నవా! వార్తలనన్. ౨౬

క. వాణీవనజాసన శ
ర్వాణీ శంకరుల నిందిరావిష్ణులగీ
ర్వాణవిభు శచీయుతుఁ గని
బాణదమన! నిన్ను జూడ వచ్చితి నిటనన్. ౨౭

క. దక్షుం డిచ్చిన శాపము
పేక్షింపఁగఁ దగమి నిలువ వీలుండక నే
వీక్షించుచు సత్పురుషుల
నక్షీణ విలాసా! తిరుగ నయ్యెడి జగముల్. ౨౮

క. పని యేమున్నది వేల్పులఁ
గనుఁగొను చిటు వచ్చి నాఁడఁ గంస విభేదీ!
మనమున నొక సందేహం
బనయము బాధించుఁ దెల్పుమన వివరింతున్. ౨౯

ఆ. ధర్మ రాజు త్రవ్వి తలకెత్తినది యేమి?
ధార్తరాష్ట్రుఁ డెట్లు దాయ యయ్యె
కంటి ఱెప్ప రీతిఁ గాపాడు దతనిని
చెఱుపఁ దలఁతు వితనిఁ జెల్లునె యిది. 30

ఉ. పాండవ పక్షపాతివని పల్కుదు రెల్లరు నీ సమస్తబ
హ్మాండములెల్ల నీ యుదరమందు వసింపఁగ వీరిలోన నొ
క్కండరి చుట్ట మొక్కఁడనఁగాఁ దగునే పరిపూర్ణకామివై
యుండెడు నీకు వేరు ఫలమున్నదె? గోలయిదేల కేశవా! 3౧

క. అని నారదుండు పల్కిన
విని శౌరి వచించె వారివిధమున నేనుం
గనియెద వారల నీవును
గని తెల్పుము వారి చిత్తగతులు మునీంద్రా! 3౨

క. చెప్పెద నొక్క రహస్యము
చెప్పుడి యిరువురకు వారి చిత్తము కొలదుల్
తప్పకకని పిమ్మట నా
తప్పొప్పెఱిఁగింప దిద్దెదను నానడతన్. 33

క. అని చెవిలో నెయ్యదియో
వినఁబడి వినఁబడనియట్లు వివరింపఁగ నా
ఘనుఁడరిగి హస్తిపురికిం
గనియెం గురురాజు వాఁడు గావించె నతుల్. 3౪

ఆ. మానిచంద్ర కుశలమా; మీకు, వచ్చితి
రేచటనుండి శాంతమే! జగమున;
తడవుజరిగె మీరు దర్శనమీయక
ఉంటిరేచట వార్త లున్నవె! యన. ౩౫

క. కంటిఁ ద్రిమూర్తుల నింద్రుని
గంటిం ద్వారవతి శౌరిఁగంటి సహితులం
గెంటిన నినుఁ గనుఁగొన రాఁ
గంటిం గురురాజ! మేలుగంటే! యనినన్. ౩౬

క. అతగాఁడేమి యొనర్చెడిఁ
గతలేమే న్గలవె ద్వారకా నగరమునన్
సతులు, న్సుతులు, న్పితలున్
వెతలేకున్నారె! రాజు వృద్ధున్నె యనన్. ౩౭

చ. కమలదళమ్ములట్లు తన కాంతలు చుట్టునుగొల్వఁ గర్ణికన్
భ్రమరము పుష్పొడిందవిలి భాసిలుపోల్కిఁ బిశంగవాసుఁడై
అమరి సువర్ణపీఠమున హస్తమునందొక సూదిఁబట్టి సూ
త్రము కిరువైపులందు మదదంతిశతార్ధము గట్టి నేర్పుతో. ౩౮

ఉ. దారముపట్టి లాగఁ జను దంతులు బెజ్జముఁదూఱి వచ్చు నా
దారినె క్రమ్మరంజనును దారము ద్రీలదు సూది చీల దా
తీరున యాదవేశ్వరుఁడు దేవులకున్ ముదమూవహిల్లఁగా
నేరుపుఁ జూపుచుండె ధరణీవర! వాని కసాధ్య మేమనన్. ౩౯

ఆ. గారడీఁడువోలెఁ గాటిపాపనిరీతి
విప్రజనవినోది విధము దోప
ఆడువారిముందు వేడుకల్ పచరించు
యాదవుండు, వాని కేది నియతి. ౪౦

క. భూపాలుండై నఁగదా!
కాపురుషులఁదోల సాధుగణముల నేలన్
గోపాలున కేమున్నది
ఏప్రొద్దంతులను గూడి యుగిలించుటయే! ౪౧

క. బలరాముం జూచితిరా!
కలఁడా! నగరమున, మేలుగలఁడా! సాంబుం
డలరునె మా లక్ష్మణతో
బలములతో భోజవిభుఁడు బాగై యున్నే! ౪౨

క. అనఁగా విని వారెల్లరు
మనియెద రే చింతలేక మనుజాధిప నేఁ
జనియెదఁ గౌంతేయులఁగన
వనమునకని యరిగె మౌని పాడుచు శౌరిన్. ౪౩

ఉ. నారదమౌనిఁ గాంచి యమునందనుఁ డర్మిలి మ్రొక్కి పూజలం
దేలిచి దేవ! మీరలరుదెంచుట ధన్యులమైతి మెందు సం
చారముఁజేసి వచ్చితిరి సాధుజనార్తివిదారు యాదవాం
భోరుహనేత్రుఁ జూచితిరె! మోదముగండె! తదీయబాంధవుల్ ౪౪

ఆ. అనిన మౌనిపల్కె నరిగితి ద్వారక
కమలనాభుఁడాదిగా యదువులు
సేమమున్నవారు శ్రీపతి గోపతి
భవుని, కమలభవుని, భక్తిఁ గంటి. ౪౫

ఉ. కమల దళమ్ము లట్లు దనకాంతలు చుట్టునుగొల్వఁ గర్ణికం
భ్రమరము పుష్పోడిం దవిలి భాసిలు పోల్కిఁబిశంగ వాసుఁడై
యమరి సువర్ణపీఠమున హస్తమునందొక సూదిఁబట్టి సూ
త్రము కిరువైపులందు మదదంతిశతార్ధము గట్టి నేర్పుతో. ౪౬

ఉ. దారము పట్టి లాగఁ జను దంతులు బెజ్జముఁదూఱి వచ్చునా
దారినె క్రమ్మఱంజనును దారము ప్రేలదు సూదిచేల దా
తీరున యాదవేశ్వరుఁడు దేవులకున్ మదమావహిల్లఁగా
నేరుపు చూపుచుండె ధరణీవర వాని కసాధ్యమున్నదే! ౪౭

చ. అన విని ధర్మరాజు పరమాత్ముఁడు విశ్వనియంత కర్మసూ
త్రనియతిఁగూర్చి లోకములఁ దార్పఁగ మార్పఁగ నేర్చు దంటకున్
ఘనమగు నేమదేభములఁ గట్టుట నెట్టుట సూదిలోన న
య్యనఘున కేది దుర్లభము యాదవ నేతకు లోకజేతకున్. ౪౮

క. అఘటన ఘటన సమర్థుం
డఘదూరుఁడు శౌరి వాని కడ్డముగలదే!
మఘవాదులు శరణనరే
లఘువులలో లఘువు గురువులన్ గురువు గదా! ౪౯

క. నమ్మినవారలఁ జెఱుపక
నెమ్మదిలోనుంచి ప్రోచు నేర్పరి కృపతో
తమ్ములతో ద్రౌపదితో
మమ్మతి సంకటములందు మనిపె జనకుఁడై. ౫౦

గీ. అనుచు వినుతించి మ్రొక్కఁ దానారగించె
ధర్మజుఁడు వేడ వడ్డింప ద్రౌపదమ్మ
పాండవులు వీడుకొల్పఁగా ద్వారవతికి
వచ్చి క్రమ్మర యదుసార్వభౌముఁ గనిన. ౫౧

అ. వచ్చితిరటె పోయి పాండవుల్ కుశలమే
ధార్తరాష్ట్రునకును ధర్మజునకుఁ
జెప్పినారె నేను జెప్పిన గోప్యము
పలికిరెట్లు తెలియఁబలుకుఁడనిన. ౫౨

క. అతగాఁడనెఁ గతలేమనె
సతులే గతియనియె లేదు సత్సంగమనెన్
ధృతిలేదనె మతిలేదనె
రతియే పరమార్థమనియె రాజే? యనియెన్. ౫౩

ఆ. కాటిపాపఁడనియె గారడీఁడనియెను
విప్రజనవినోది విధమని యనె
మాయకాఁడనియెను మందగొల్లనియెను
కౌరవుండు పెక్కు కాఱులాడె. ౫౪

ఆ. పాండవాగ్రజుండు పరమాత్మయని యనె
దేవదేవుఁడనియె దిక్కనియనె
మనిపె సంకటముల మాధవుండని యనె
అఘటసుఘట దక్షుఁడజుఁడనియనె. ౫౫

ఆ. కర్మసూత్రమందుఁ గట్టి బ్రహ్మాండముల్
త్రిప్పువానికేమి గొప్ప యగును
సూత్రబద్ధకదుల సూదిఁ జొన్పుటలనె
నంగలార్చెఁ జూడనని యటన్న. ౫౬

క. "నన్నేమి చేయుమనియెదు
కన్నా వా! వారి చిత్తగతు లటువలెనే
మన్నింతు నొంతు నాదే
మున్నది మతియెంతొ గతియునుండు నటులనే. ౫౭

ఉ. గారడివానిపోల్కిఁ గనుగట్టి సుయోధను మోసగింపఁగా
నేరముగాదు పాండవుని నేలకు నేలికఁజేసి యేలకేఁ
దీరదు దేవదేవుఁడనె దిక్కితఁడేయని మ్రొక్కెఁగాన నో
నారద! లోకులాడెదరు నాలుకపొల్లులు సత్యదూరులై. ౫౮

క. అద్దముతప్పా! సరిగా
మొద్దు మొగము ముగ్ధవదనముం జూపమి వా
రిద్దఱి సుద్దులు వినవా!
గ్రద్దకు గరుడునకుఁ దుల్యగతి సంగతియా! ౭౯

క. అని హరి వచింపఁగా ముని
విని యాశ్రితపక్షపాతి వెన్నుండని ని
న్ననరా! మునులున్, వేల్పులు,
దనుజారీ! నీకు సహజధర్మ మ్మగుటన్. ౮౦

క. పనివినియెద సందేహము
చనియెన్ లోకములనెల్లఁ జూచెద దీనిన్
వనమాలీ! జితవాలీ!
రణకేళీ! విజితశూలి ప్రాభవశాలీ! ౮౧

క. అని పాడుచు నారదముని
చనెఁగావున భక్తవరదు శార్ఙ్గిని దేవుం
డని నమ్మి కొలుచువానికి
నెనయే! ముజ్జగము దానమిచ్చిన వాఁడున్. ౮౨

దుర్యోధన పరాజయము.

గీ. దాన, ముచితజ్ఞతయు, ధీరతాగుణంబు,
ప్రియముగా మాటలాడుట; వీని నరుఁడు
నేర్వఁగారావు పుట్టుకనే జనించు
సహజములటందు రీ నాల్గు సరసమతులు. ౮౩

ఉ. పూతపసండి కుంపటిని బూర్వపుఁగాంతిఁ దొఱంగి హేయమై
జాతిపసిండి మేలిమికిఁ జాలని పోలిక దానకర్ణు వి
ఖ్యాతి గడింపఁగోరి మును కౌరవనాథుఁడు దాతృకోటిలోఁ
గాతరుఁడై మనోవ్యథలఁ గాసిలె డాంబికదాత గావునన్ ౮౪

ఆ. ఎట్టులన్న దాని నెఱిఁగింతుఁ గురునాథుఁ
డరిగెఁ దీర్థయాత్రకని యొకప్పు
డతనివెంట విప్రులాదిగాఁ బరివార
మరిగె నుచితరీతి ననుసరించి- ౬౫

ఉ. కాశికిఁబోయి గంగఁగొని కాంచిప్రయాగ సయోధ్య సేతురా
మేశునిగొల్చి దానముల నీయ మహీసురు లెవ్వరన్నచో
నీశుఁడు హస్తినాపురికి నెట్టులు మీర లెఱుంగరన్న నా
హా! సరి దానకర్ణు పురమందు వసించు మహీశుఁడా! యనన్. ౬౬

ఆ. కర్ణుపేరు చెప్పఁగా మాకుఁ దెలియును
హస్తినాపురమున నవనినాథుఁ
జూడమెపుడు పేరుగూడ నశ్రుతమన్న
తలను గొట్టినట్లు తలఁచి నృపతి. ౬౭

క. నా నగరమ్మున నుండెడి
మానవుఁడా! నన్నుదెలుప మాన్యుఁడు, నేనో!
భూనాథుఁడనై యుండియు
మానవులకుఁ దెలియఁబడక మందుఁడ నైతిన్. ౬౮

క. భేరీశబ్దము యోజన
దూరము వినవచ్చు, నీలతోయద ములుమన్
బారును బంగ్రెండామడ
బూరటిలును దానశబ్దమున ముజ్జగముల్. ౬౯

ఉ. కర్ణుని పేరు లోకములఁ గ్రమ్ముచునున్నది, నేను గర్మిచేఁ
బూర్ణునిఁజేయ వాఁ డమరభూజముపోలిక నిచ్చుచుంట స
ప్తార్ణవ వేష్టితావని మహాయశముల్ గడియింపఁగల్గె నా
కర్ణుని మించు దాతనయి కంకణముం ధరియించి యిచ్చెదన్. ౭౦

ఆ. లేదటన్నవాక్కు లేకుండ నేఁబ్రొద్దు
దానమిత్తు నాకుఁ దక్కువేమి!
రాజరాజు నయ్యు వాజట్టులుండుట
పాడియగునె! చాటఁబంచి యిడుదు. ౭౧

ఉ. దానసుయోధనుండు మిముఁ దన్పను గోర్కులొసంగి రండు రం
డో! నరదేవులార! యని యొక్క మహాఫలకంబు గట్టి సె
ల్లేనుఁగుమీఁద భేరి మొరయించుచుఁ జాటఁగఁబంచి దీక్షతో
మానవనాథుఁడిచ్చెఁ బదిమాసము లౌనన నెల్లవారికిన్. ౭౨

ఉ. వానిఁ బరీక్షఁజేసి నిజభావము వెల్లడిఁజేయఁగోరి శ్రీ
జాని మహీసురాకృతిని సామజనామపురీశుఁ జేరి నిన్
గానఁగవచ్చినాఁడ నొకకార్యముఁగోరి మహీశ! జన్నముల్
బూనితిఁ జేయఁగాఁ గొదువ పుల్లలు వంటకుఁ బూర్తిచేయవే! ౭౩

ఆ. వందబండ్లు పట్టు వంటకుఁ గట్టెలు
వలవదిపుడు మరల వత్తు నేను
కొఱఁతలెల్ల సిద్ధపఱచిన పిమ్మట
నిచ్చెదే! యటన్న నిదియు ఘనమె. ౭౪

ఆ. కరులు హరులు కావు కాంచనమా కాదు
కావు భవనములును గ్రామములును
మణులు మాన్యములును మాణిక్యముల్ గావు
కట్టె పుల్ల కింత కావలయునె! ౭౫

ఆ. వలసినపుడె రమ్ము వందబండ్లన నెంత
తోలిపెట్టుదునన మేలు మేలు
దానబిరుదమూనఁ దగుదు వీ వొక్కండ
వొరుల కర్హమగునె ధరణినాథ! ౭౬

ఆ. పోయివత్తు ననుచు భూమిసురుండేగి
ఆఱునెలలు పోవ నంబరంబు
తూటు పడినయట్లు తొమ్మిదిరోజులు
కసరి ముసురు విసర గాలితోడ. ౭౭

క. తళతళ మెఱుపులు మెఱయఁగ
పెళపెళ నుఱుముఱిమి దిశలఁ బిడుగులు వడఁగా
గొలగొలని కూయఁ గప్పలు
జలజల ప్రవహించె నదులు సంపూర్ణములై. ౭౮

క. సూదులవలె జలధారలు
వేదన గలిగింప సమసెఁ బిట్టలు, కాకుల్
భేదిల్లి పడియెఁ దరువులు
చీదరఁగొని పసులు మేతచిక్కక నలఁగెన్. ౭౯

క. పాటుకెత్తె మిద్దెకొంపలు
కుటకుటమని కూలెఁ బ్రాతగోడలు వెదురుం
బటపటని పెరిఁగె నొక్కట
నుటజాగారములు గాలి కుట్టుటలూగెన్. ౮౦

క. గుడిసెలపని మేలయ్యెను
కుడుములు నములంగనయ్యెఁ గూలిజనులకున్
మడిగుడ్డ లారవయ్యెను
పడతుక పోయి మండకుంటఁ బతిపై సొణిగెన్. ౮౧

క. పడియెన్ వాగులు చేద్దిగఁ
బడియెన్ వనులెల్లఁ బచ్చవడియెన్ జడియున్
బడియెం బాంథులమది సుడి
వడియెన్ వృద్ధాళి శీత వాతోద్ధతిచేన్. ౮౨

క. నిడువాలుజడల ముగ్ధలు
ముడిచిన చేమంతిపూలు పూవిల్తుఁడు దా
నడిదపుఁ గేతకి దూసిన
పడకగదుల దాఁగికొనిరి పతు లభయమిడన్. ౮౩

చ. దడదడ వృద్ధభూసురుఁడు దాడలు గొట్టఁగ దండమూఁతగా
గడగడ మేన్వడంకఁ బెనుగాలికిఁ దూలుచు సోలి నిల్చుచుం
బడమటఁ బ్రొద్దుఁ గుంకుతఱిఁ బార్థివుఁ జేరి నృపాల! సర్వమున్
ముడివడెఁ గట్టెలేతఱుఁగు ప్రొద్దున వానిని బంపుమా యనన్. ౮౪

ఉ. తొమ్మిది రోజులాయె వెలి తొంగి కనుంగొన వీలుకాక నీ
కిమ్మసురందు జన్నమెటు లింపితమాయెను వానపోవఁగా
రమ్మ! కరంబు దుష్కరము రారిపుడెవ్వరు బండ్లు సాగునే!
ఉమ్మలికమ్ము పొందవల దుబ్బలి పిక్కలబంటి కాంచవో! ౮౫

ఆ. అనిన వృద్ధవిప్రుఁ డక్కటా! యింకెట్లు
లన్ని సిద్ధపఱచి యున్నవాఁడ
రేపు చేరఁగలరు ఋత్విజుల్, బ్రాహ్మణుల్,
వంటచెఱకు లేక పస్తులుంద్రె! ౮౬

ఆ. నమ్మియున్న నన్ను నట్టేట ముంచుట
పాడిగా దసత్య పాపఫలము
కట్టుకొనకు పంపు కట్టె లెట్టులైనఁ
దప్పదనినఁ గనలి ధరణివిభుఁడు. ౮౭

ఆ. పిడుగు మబ్బులేక పడినట్లు ముసురులో
వచ్చి పంపుమనెదు వంటచెఱకు
ముందు చెప్పవలదె? మునిఁగిపోయిన దేమి!
మఱల లగ్నమొకఁడు మార్చరాదె? ౮౮

ఆ. అనిన దైవనియతిఁ గనశక్యమా! నాకు
సర్వసిద్ధమయిన జన్నమెట్టు
లుడుపువాఁడ నిచ్చెదో! లేదో! చెపుమన్న
సొమ్ము ఛాందసత్వమును విడువుము. ౮౯

క. జన్నంబట! కట్టియలట!
పున్నము గడియించునంట! భూసురుఁడట! నీ
చిన్నెలు నాకడఁ జూపక
తిన్నగఁ జనుమన్న వెడలె 'ధిగ్ధి'క్కనుచున్. ౯౦

ఆ. బయలుదేరి కర్ణు భవనమునకుఁ బోవ
నెదురువచ్చి ముట్టి పదయుగంబు
వలువలొసఁగి యర్ఘ్యపాద్యాలఁ బూజించి
యాసనంబొసంగి యాదరించి. ౯౧

ఆ. తడిసి వచ్చితిరకొ దైవ సమానులు
కోరికేమి! తెల్పఁ గోరుదు నన
వంటకట్టెలిత్తు వందబండ్లనె మున్ను
రాజరాజు నేఁడు రావనియనె. ౯౨

ఉ. జన్నపులగ్న మెల్లిజన సర్వము సిద్ధము మార్చుటెట్టు లీ
చిన్నకొఱంతకై మరలఁ జేర్పఁగ శక్యమె నీకుఁ గట్టెలో
యన్న! యటన్న 'వందనము లాజ్ఞకు బద్ధుఁడ నారగింపుఁడీ!
మిన్నక శుష్కవాక్యములు మేలగునే! తమ మ్రోలఁ బల్కఁగన్. ౯౩

చ. అని పనివారలం బిలిచి, యాత్మగృహంబును దుల్పి, కల్పవే
గనియలఁ గోసి బండ్లపయిఁ గట్టుఁడు చుట్టుఁడు జీడిగుడ్డలన్
ఘనవృషభంబుల న్నిమకి కట్టుఁడు బండికి నాలుకాండ్ల వే
చనవలెఁ బశ్చిమాబ్ధి రవి జాఱెడిలోపల యజ్ఞశాలకున్. ౯౪

ఆ. పటకుటీర మెత్తఁబడుఁగాక నేనుండ
వసతిగాఁగ ననిన వారలట్లు
సిద్ధపరుప బండ్లు చీమలబారట్లు
సాగె విప్రవరుఁడు సంతసింప. ౯౫

క. దీవించి దానకర్ణుఁడ
వీవేకా కొరులుతాల్ప నేలా చెల్లున్
మావిఫలము పోలికగాఁ
గావించిన లక్కతోడఁ గలదే! గుణమున్. ౯౬

ఆ. పోయివత్తుననుచు భుజములు మూఁడుగాఁ
దోలుఁడనుచు బండ్ల గోలచేసి
కౌరవేశుఁజూచి కంటివా! కర్ణుండు
పంపె నూఱుబండ్లు తెంపుతోడ. ౯౭

ఆ. కురియు ముసురు మేడ కూలఁగాఁ ద్రోయించి
కోసి తుండ్లు బండ్లు గూర్చినాఁడు
పటకుటీరమందు వసియించి యున్నాఁడు
దాత వాఁడుగాక తగుదువెట్లు!. ౯౮

క. కట్టితివి పెద్దపలకను
గొట్టితి వేనుంగుమీఁద గురుతరభేరిన్
నెట్టితి విచ్చేదనని నను
గట్టెలు సమకూర్పలేక కౌరవనాథా! ౯౯

క. టెంకాయకు నీరమ్ములు
వంకాయకు ముండ్లు వచ్చుఁబ్రభవమునందే!
బింకములు పల్కఁ జుల్కన
సంకటములఁగాదె తెలియఁజను నరుగుణముల్. ౧౦౦

ఆ. అనుచు దులిపిపోవ నవనీశ్వరుఁడు మోము
నెత్తలేక కుంది చిత్తమందు
కర్ణుఁ డిచ్చినాఁడె కట్టెలీ ముసురులోఁ
గూల్చి మేడ నెంత గొప్పవాఁడు. ౧౦౧

ఆ. మఱల వాని కేను మందిరంబొడఁగూర్ప
కుండ తప్పఁబోవదుండె డేర
అశ్వశాలమూల యైనచో నూఱుబం
డ్లమరియుండు చేలనైతి నకట! ౧౦౨

క. మీఱినకార్యము చింతిలఁ
దీరునె! సత్కీర్తిపోవఁ దేవచ్చునె! మున్
దూరముగన కవనీసురు
దూఱితిఁ గంకణమిదేల 'తూ' యని దూసెన్. ౧౦౩

ఆ. సహజగుణము విషమసమయమునను నిల్చు
ననుకరింపఁబోవ నడఁగిపోవు
ననినగురునిజూచి యభివందనముఁ జేసి
పలికె విశ్వనాథ పండితుండు. ౧౦౪

స్థితప్రజ్ఞుని లక్షణము

ఉ. గీతలు చెప్పి మాధవుఁడు క్రీడికి మోహముఁ బాపి యాత్మకుం
బాతము లేదటంచుఁ దెలుపం దెలివొందియుఁ బట్టి గూలినం
జేతము తల్లడిల్ల వెతఁ జెందె యుధిష్ఠిరుఁడున్ వియోగ సం
జాత మనోభరంబున విచారము నొందె వివేకశాలియై. ౧౦౫

క. తెలిసిన వారే భ్రాంతిని
దొలఁగించు కొనంగ లేక దురపిల్లిరి మున్
గలరా? సుఖ దుఃఖములకు
నలజడివడకున్న విజ్ఞులన గురుఁ డనియెన్. ౧౦౬

నిశ్చింత రామయ్య కథ.

క. వనిలో నొక భూసురునిం
గని నారదమౌని ఘోవఁ గారణమేమీ!
వని నింటిపేరుఁ; బేరే,
మనియందురు నిన్నటన్న నవ నీసురుఁడున్. ౧౦౭

ఆ. పేరు రామయ యని పిలుతురు నిశ్చింత
వారటంచు నింటి పేరుఁ గూర్చి
చుట్టపక్కములను జూడఁగాఁ బొరుగూరి
కేగుచుంటిఁ ద్రోవ యిది యటన్న. ౧౦౮

క. చింతల వంతల లోకం
బెంతయు దురపిల్ల నొంది తెట్టుల నీ ని
శ్చింత బిరుద గృహనామం
బింతి, సుతులు, ధనము, పశువు, లిల్లుండి యనన్. ౧౦౯

క. సంతసిలము జననములకు,
వంత గనము మరణములకు, వగవము ధనవి
క్రాంతికయి, కలిమిగలిగిన
గంతులిడము, ద్వంద్వములకుఁ గలఁగము గానన్. ౧౧౦

క. నిశ్చింతవార మైతిమి
నిశ్చల సుఖ దుఃఖ ధీ వినిర్మల గతి నీ
కాశ్చర్యమేల! యొరులకు
దుశ్చర మిది యైన నుగ్గుతో నలవడియెన్. ౧౧౧

ఆ. అనిన మౌని వాని కనియె దుష్కరమిది
సురలకైన నీవు గఱచి తెటులొ
మోదమందఁ గంటిఁ బోయి వచ్చెద నని
చనియెఁ దపసి శక్రు సదనమునకు. ౧౧౨

క. వచ్చిన మౌనికి నర్ఘ్యం
బిచ్చి సురేశ్వరుఁడు హర్ష మిగురొత్తఁగ నీ
వచ్చుటచే మాకు శుభం
బుచ్చస్థితి వెలిఁగెఁ గుశల మొంటిరె యనుచున్. ౧౧౩

ఉ. ఎక్కడనుండి రాక? సుఖులేకద లోకులు! వార్త లేమి! నల్
దిక్కుల దేశ దేశముల దేవరవారలు సంచరింత్రు మీ
కెక్కిన వింత లేమయిన నెయ్యెడఁ గన్న వచింపుఁడన్న నే
చిక్కులు లేవు, నీ కులిశ శిక్షితు లెల్లరు, మేలు లోకముల్. ౧౧౪

ఉ. మంచిది వార్త లేమనిన మౌనముఁ బూనుట పాడిగాదు వీ
క్షించితి నొక్క భూసురుని జింతలు వంతలు లేని వాని లో
కాంచితులైన దేవతలకైన నశక్యము మర్త్యుడెట్టు లా
ర్జించెనొ నిస్పృహత్వము శచీరమణా! గృహమేధియయ్యుఁ
దాన్. ౧౧౫

ఆ. వాని యింటిపేరు ప్రజలెల్ల నిశ్చింత
వారటంచుఁ బిల్త్రు వజ్రహస్త!
మాకు మీకుఁ గూడ మర్త్యలోకమ్మునం
దధికుఁడయిన విప్రుఁ డలరుననిన. ౧౧౬

చ. మనుజులు పాపవర్తనులు మాటికి వారికి దుఃఖవీచికల్
ఘనముగఁ దాఁకుచుండు నటుగాన వివేక విచార సేతువై
మనఁగల వాఁడెవండొ! కన మామక చిత్తము తొంగలించెడిన్
మునివర! పోయి చూచి,నిజమున్ వెలిదీయక మానుటొప్పునే! ౧౧౭

క. ఉదయమున జేపు పోవుద
మిది మరువకుఁడనుచుఁ జెప్పి యింద్రుఁడు లేవన్
ముదిత హృదయుఁడై మౌనియుఁ
గదలిచనియె నాహ్నికమ్ము కడఁ దీర్చుటకై. ౧౧౮

క. వారిరువు రుదయ మగుడుఁ
బారుల వేసముల వేదపాఠముతో సం
చారము చేయుచుఁ గనిరా
యూరి దరిని బాలము దున్నుచున్న కుమారున్- ౧౧౯

క. తెలుపుచుఁ గాల్వల మట్టిని
దొలఁగించుచు నున్న విప్రుతో నాబాపల్
పలికిన నీ పేరేమని
తెలిపెన్ రామయ్య యంద్రు ద్విజులార! యనన్. ౧౨౦

క. సంచారమునకు వచ్చితి
మెంచఁదగిన దాతలెవ్వ రీయూరున నే
పంచ నిలువ నర్హమ్మగు
మంచి చెడుగు లెఱుఁగ జెప్పుమా! రామయ్యా! ౧౨౧

ఆ. అనుచు మాటలాడ నా దుక్కి చాలులో
లేచి పెద్ద నల్ల త్రాఁచొకండు
పట్టి, పట్టి మోము పాము పామనునంత
మాయమయ్యె నొసట గాయమయ్యె. ౧౨౨

ఆ. కఱచెఁ బాము టంచుఁ గన్న తండ్రికిఁ జెప్ప
దున్ను మరక దాని నెన్నకనిన
చాలు పోవనిచ్చి, నేలపైఁ గూలిన
వానిఁ జేని గట్టు పయిన నుంచి. ౧౨౩

ఆ. మేడిఁబట్టి తాను కోడెల నదలింపఁ
జూచి వారిరువురు చోద్యమంది
పాము గఱచి సుతుఁడు పడిపోవనయ్యారొ!
దున్ననగునె! వైద్య మెన్నఁ దగదె! ౧౨౪

ఉ. సర్పముముట్టి బాలకుఁడు చచ్చిన గట్టుకులాగి మేడిపై
దర్పము చూపఁబోయెదవు దానవుఁడైనఁ దపించు వేడి ని
ట్టూర్పొకఁడైనఁ బుచ్చు విది యొప్పునె! కంటివా! కక్కినాఁడవో!
చేర్పు గృహాంతరమ్మునకుఁ జేదగునే! కడుపెట్టివారికిన్. ౧౨౫

ఉ. కన్నుల నీరు గ్రమ్మెడిని గాంచిన మాత్రనె మాకు నీకు నే
మున్నది యాస యింకఁ జనె నొక్క కుమారుఁడు గూడ నేటికిం
బున్నము గొల్లవోయె వగఁ బొక్కుచు స్రుక్కుచు జీవయాత్ర యే
తెన్నునఁ జేయఁ జాలుదువు దివ్యపదంబెటు గాంచ నేర్తువో! ౧౨౬

గీ. చేతి కెదిగిన మగబిడ్డ చెట్టువంటి
కొడుకు, వశవర్తి, చదువరి, దుడుకు గాఁడు
వృద్ధుఁడగు నిన్ను బోషింప సిద్ధమయిన
అన్నమిది మన్నుపడ నెట్టు లడల వనిన. ౧౨౭

చ. కలుగును జంతు సంతతులు కర్మవశమ్మున దాని బల్మినే
నిలుచును గూలుచుండునని నిశ్చయవృత్తిఁ జరింతు నెప్డు దు
ష్ఫలమున కాశ్రయంబగుడు బాలుఁడు నేలను గూలె వానికై
వలవల నేడ్వ జాలిపడి నచ్చునొ! మెచ్చునొ! తెచ్చియిచ్చునో. ౧౨౮

ఆ. వచ్చె నెవఁడు బిల్వఁ బ్రభవింప వింశతి
చొచ్చుదాఁక నెవని సూక్తి నిలిచె
పోయె నెవఁడు వానిఁ బొమ్మని పోర్వట్ట
కర్మ సూత్రమునకుఁ గలదె తిరుగు. ౧౨౯

ఆ. కంఠమునకుఁ ద్రాడు గట్టి లాగిన క్రియ
పోవుఁ గాల మగుడు జీవసమితి
ఎవని కెవఁడు తనయుఁ డెవ్వఁడు జనకుండు
పుట్టె నెవఁడు! నేఁడు గిట్టె నెవఁడు! ౧౩౦

క. నాటకముల వేసమ్ముల
బూటకమిది పొక్కనేల పుత్రా! యనిన యా
యాట యగుడు మఱు వేసము
పాటింపఁగఁ బోయె వాఁడు వగ నాకేలా! ౧౩౧

ఉ. ఎన్ని భవంబులయ్యె! సుతులెందఱు! కామినులెందఱైరి! నే
నన్ను నెవండు! పోయెనది! యబ్బురమయ్యెడి దేహి దేహముల్
భిన్నములౌట దేనికయి వేదనఁ బొందఁగవచ్చు, దేహికా!
బన్నము లేదు దేహమిది భౌతికమౌట నశించు నెప్పుడేఁ. ౧౩౨

ఆ. కనక ముందు వీఁడు కాఁడు నా తనయుఁడు
కాఁడు నేఁడు వీఁడెఁ గాన నన్ను
నడుమఁ గలిగెఁ దగులు విడిపోయె నేటితో
సత్రమందుఁ గలియు జనుల పగిది. ౧౩౩

ఆ. పొల్లు గూర్పఁ గలిగెఁ బంచ భూతములతో
మేను దీని కేల మిడుక వలయుఁ
గలిగె దేనివలనఁ గలియును దానిలో
దృశ్య మపుడు నేఁ డదృశ్య మింతె. ౧౩౪

ఆ. వాఁడు పోయె వాని ప్రారబ్ధ మడుగంట
తైల ముడుగు దివ్వె తలఁగినట్లు
పట్టెఁ డన్న మెవఁడు పెట్టును బొట్టకు
మ్రింగనెట్లు! చేయి మీఁదు గట్ట. ౧౩౫

ఆ. అనుచు దున్నుచుండ నడలుఁడు వీఁడని
పోవ నూరివైపు పొలఁతి యొర్తు
ఇడ్డెనలును బిండి బుడ్డి చెంబున నీరు
తాల్చి వచ్చుచున్న తరుణిఁ జూచి. ౧౩౬

క. బిడ్డా! ఎవ్వరిదానవు!
దొడ్డగృహంపు కోడలట్లు దోచెద వెటకీ
యిడ్డెనలం గొని పోయెదు
బుడ్డిగురిగి నీరు డప్పి పుచ్చునె! యనినన్. ౧౩౭

ఆ. తోట చేను దుక్కి దున్నుచున్నారు
మామగారు తమ కుమారు తోడ
వారి కొఱకుఁ బోదు భక్ష్యములంగొని
యనిన వెచ్చనూర్చి యవని సురులు. ౧౩౮

క. ఏమని చెప్పుదు నీ కో
కోమలి వారిద్దఱందుఁ గుఱ్ఱాతఁడు దా
భూమిఁబడి విడిచె నసువులఁ
బాముక్కఁడు దుక్కిలోనఁ బట్టి కఱచినన్. ౧౩౯

ఉ. కన్నుల పండువై తనరుఁ గాంతివిలాసము, లేత ప్రాయమా!
చెన్నలరారు చున్నయది; శ్రీ సతితోఁ బురుడించు రూప మే
యన్నెము పున్నెముం గనని యర్భకురాలిది; ముందు పాము కు
న్నన్ని శరత్తు లున్న వకటా! కడుదుర్భర మెట్టు లోర్చునో! ౧౪౦

ఆ. అనుచుఁ బల్క వారి కాలేమ చేమోడ్చి
అమృత మాడ వలవ దయ్యలార!
నిజము చెప్పుఁడనిన నీవు మా బిడ్డట్టి
దాన వేల మాకు దబ్బర లన. ౧౪౧

తే. తిలకమును మాపి గాజుల దులిపి వైచి
విరులతో వేణి విదలించి వేసి ముడిని
కడిగి పసుపును దొలఁగించి గళము త్రాడు
ఇడ్డెనలు పిండి సగభాగ మిలకుఁ ద్రోచి. ౧౪౨

ఆ. మామ పాలి సగము మజుల మాటను గట్టి
పోవ సాగఁ జూచి భూమిసురులు
కంట నీరు రాదు కలఁగ డించుకయును
ప్రాణనాథు మృతిని బాల యనుచు. ౧౪౩

క. పతియే సర్వము వెలఁదికిఁ
బతి పోయిన లోకమెల్లఁ బాడఱెనట్లు!
మతిమంతురాల వించుక
వెతనొందవు దీనికేమి విధము కుమారీ! ౧౪౪

క. వినిపింపుమనిన వారలఁ
గని యా మానిని వచించెఁ గారణమేలా!
పెనిమిటనిరి పెండిలినాఁ
డనఘా! సంబంధమున్నదా! మును మాకున్. ౧౪౫

ఆ. కర్మ సూత్ర పరతఁ గలిగె సంబంధము
త్రెంచి వైచె వానిఁ ద్రుంచి యముఁడు
వచ్చినట్టి విభుఁడు వచ్చునా! వాపోవఁ
గంటి నీటి కేమి! కాకి గనదె! ౧౪౬

తే. నాటకమున వచ్చు బూటకపు సతీత్వ
మట్లు కలుగుచుండు నడఁగుచుండుఁ
గాపురంబు సతమె! కలిగెనా పుట్టుక
కలదె ముందు! నడుమఁగల విధంబు. ౧౪౭

ఆ. నడుమ వచ్చె మాకు నాటకమిది ప్రథ
మాంక భాగ మిట సమాప్తి యయ్యె
జన్మ జన్మములకు జనకాదులును బతుల్
కలుగుటరుదె! ఎవరికై తపింతు. ౧౪౮

ఆ. పోయినారు నాకుఁ బూర్వ జన్మములను
బతులనేకులిట్లు వారిలోనఁ
జేరె నితఁడుగూడఁ జింతింపఁగా నేల
యాత్మ కెవఁడు నాథుఁ డార్యులార! ౧౪౯

క. తనమే ననిత్య మనిన౯
జనునే పతి మేనికొఱకు సంతాపింప౯
మనియున్న లోకవర్తన
మునకై కొల్వఁదగు నింద c బొందక యుండ౯. ౧౫౦

క. ఏకాలమ్మున కెయ్యది
పైకొనునో కర్మవశతఁ బ్రాజ్ఞుఁడు దాని౯
గైకొను సుఖ దుఃఖమ్ములు
లేకయె, యటుగానఁ జింతలేదు మహాత్మా! ౧౫౧

ఆ. అనిన దాని వాక్కు లాలించి కడు మెచ్చి
బాలయయ్యఁ బలికె మేలి నుడులు
చూత మింక ననుచుఁ జొచ్చి రామయ యింటి
పంచ యరుగు మీఁద నుంచి మూట. ౧౫౨

ఆ. "అమ్మ! విప్రవరుల మాతిథ్యమున కొక
రుండు మిందుఁ గలరె యూరిలోన
నయ్యవారటన్న నట్టులే నిల్వఁడీ!
పొలము పోయినారు పుత్రుఁ గూడి. ౧౫౩

ఆ. వత్తు రుండుఁడన్నఁ బాపమీ దారిలోఁ
జేనివద్ద నొక్క చిన్నవాఁడు
దున్నుచుండెఁ దండ్రి యున్నాఁడు గట్టునఁ
గలము మేము; పాము గఱచె సుతుని. ౧౫౪

ఆ. పాము కఱచె ననుచుఁ బలికిన మాత్రనే
కూలె నేలఁ దండ్రి గోడు చెప్పఁ
దరముగాదు మాకుఁ దత్తరంబు జనించి
కాలు చేయి చూడఁ గాలుఁ జేరె. ౧౫౫

ఉ. అక్కట! పిన్నవాఁ డతని యందము చందురుఁ గేరుఁ దండ్రికిన్
జెక్కకు వచ్చినాఁడు, సతినిం గనుఁగొంటిమి దారిలోన నోఁ!
జక్కనిచక్క, యున్నదట సంపద కట్టను బెట్టఁ దల్లికీ
యొక్కఁడె పుత్రుఁడంట విధి యోర్వదుగా సుఖమున్నవారలన్. ౧౫౬

ఆ. కడుపు తఱిగిపోవుఁ గన్న మాబోంట్లకే
కన్న తల్లి కడుపు కమిలి పోదె!
రామయ యని చెప్పె నామ మంతకు మును
పాప మెంత వంత బ్రాహ్మణునకు. ౧౫౭

ఆ. అనిన వారి కనియె నా యమ్మ వారిది
సత్యమగునె! శివుని సాక్షి గాఁగఁ
జెప్పవలయు ననినఁ 'జీ చీ' యసత్యము
పలుకఁ గలదె మాకు ఫలము తల్లి!. ౧౫౮

క. మావారె వారు, తనయుఁడు
మావాఁడే, కాలనియతి మాఱునె! త్రుటిలో
జీవిత మసత్య మనరో
యేవారలు నిత్యు లేల యేడ్వ విభునకున్. ౧౫౯

ఉ. చావని వారలుం గలరె! చచ్చిన వారల కేడ్వ వత్తురో!
కావు శరీరముల్ స్థిరము కాంచఁడు జీవుఁడు మృత్యు వెప్పుడున్
దేవతలైనఁ గాలమునఁ దీరక తప్పదు మర్త్యులెంత! ఆ
హా! విధి కర్మసూత్రమున నాడఁగఁ జేయును లోక జాలమున్. ౧౬౦

ఆ. వయసు తోడఁ బెరుఁగ భ్రమ మంత కంతకు
మమత వలనఁ జిక్కి మనుజ గణము
తనయుఁ డనుచు వీరు తలి దండ్రు లనుచుఁ బె
ల్లేడ్తు రింతె కాని, యెవరి కెవరు!. ౧౬౧

క. వారెవరో ! వీరెవరో!
ఏరీతిని గూడినారొ! యెట కేగెదరో !
కారణమేదో ! దీనికి
లేరు విచారించు వారు లేశమ్మైనన్. ౧౬౨

ఆ. ఉమ్మలికము నిట్టు లోఁదార్చుకొని యాపె
కొడుకు వస్తువులను గూఁట వైచెఁ
బళ్లెరంబు చెంబు పంచపాత్రయు నుద
ధారణియును మిగత దాసి కొసఁగె. ౧౬౩

ఆ. పోసియున్న గిన్నెఁ దీసెను బియ్యము
కొడుకు పాలు మిగతఁ గడుగఁ బోడఁగెఁ
గాని కంటనీరు గార్చదు పొక్కదు
ఊర్పుపుచ్చదెట్టు లోర్చు కొనెనొ!. ౧౬౪

క. ఈ యింటి పద్ధతిదియే
వాయించిన మద్దెలగుటఁ బనిలేదింకన్
వాయింప ననుచు వారలు
పాయంజని దాసిఁగని కటా ! వింటివటే!. ౧౬౫

క. ఈ యింటి వారి కొమరుం
డీ యుదయమునందుఁ బ్రాణ మొడలెను జేలోఁ
గాయజుని బోలు రూపము
ప్రాయమ్మూ లేఁత యెంత పాపము కనుమా! ౧౬౬

గీ. ఎన్ని దినములనుండి నీ వున్నదాన
విచ్చటనఁ జాల నాళ్లాయె నీకునూరుఁ
బెంచితిని జంకనిడి త్రిప్పి పెద్దయయ్యెఁ
గాలము సమాప్తి యాటచేఁగూలె నేఁడు. ౧౬౭

ఆ. కన్న వారి కన్న మిన్న పెంచిన వారి
కర్భకాళి ప్రేమ యతివ నీకుఁ
గంట నీరు రాదు కలుగ దించుక జాలి
హేతువేమి యనిన నింతి యనియె. ౧౬౮

క. పుట్టిన నుబ్బరు వగవరు
గిట్టిన సమదృష్టితోడఁ గీడును మేలున్
నెట్టుదురు వీరి వలెనే
పట్టువడె న్నాకుఁ జింత పడ నేమిటికిన్. ౧౬౯

ఆ. కన్న వార లుండఁ గట్టుకున్నది యుండ
బందుగులు తలంత బలఁగ ముండ
దాసి ముండ కేల తల మున్కలౌ వంత
గుంజ కేల నడుమ గుఱక తెవులు. ౧౭౦

ఆ. జ్ఞాతి జనులు కూడి కట్టె కంపయు వైచి
సంస్కరింపఁబోవఁ జాలు నింక
సుతికి మించి రాగ గతికి రా దారఁబోనెఁ
దడవు కూడ దనుచుఁ దక్షణమున. ౧౭౧

ఆ. కట్లసంచిఁ బట్టి కట్టులఁ జేఁ బూని
పాగఁ జుట్టి తలకు వైద్యులగుచు
వారిఁ జేర వచ్చి పాముచే మృతుఁడౌట
తెలిసి యిరువు రేమొ కలియఁ బలికి. ౧౭౨

ఆ. చిన్నవాని డాసి చేతి నాడిని జూచి
వ్రేలు పట్టి ముక్కు గాలి చూచి
గుండె చూచి తాఘఁ డుండుఁడీ! యొకవైద్య
మున్న దెట్టులగునో! వెన్నుని దయ. ౧౭౩

ఆ. కట్ల సంచి విప్పి గాజుబుడ్డిని ద్రిప్పి
పుల్ల మంచి యొక్క బొట్టు సుధను
గాయమందు నాసికమునందు రాచిన
నిముసమునకు వారు నివ్వెఱ పడ. ౧౭౪

ఉ. చల్లనిమేను వెచ్చపడె, సాగెను గుండె చలింప, శ్వాసముల్
మెల్లఁగ నాడఁగాఁ దొడఁగె, మేను గదల్చెను, గంటిరెప్ప ల
ల్లల్లన విచ్చి చూచెఁ బలుకాడఁ దొడంగెఁ గ్రమ క్రమంబుగాఁ
దొల్లిఁటి దార్ఢ్యముం గనియెఁ ద్రోవను రాఁగనె నూతకోలతోఁ. ౧౭౫

ఉ. చచ్చినవాఁడు వచ్చెనని సంతసమందరు కౌఁగిలింప రా
ముచ్చటలైనఁ జెప్పికొని మోదము నందరు వైద్యకర్తలన్
మెచ్చరు స్తోత్రపాఠముల మేలొడఁగూర్చిరటంచుఁ గానుకల్
పుచ్చరు శంకరాదులకు మ్రొక్కరు చక్కని పక్కి రౌతునున్. ౧౭౬

క. కలఁగాంచినట్లు వారలు
చలనం బించుకయు లేక సమ సుఖ దుఃఖో
జ్జ్వలులై యుండుటఁ గని ముని
బలసూదను లరిగి రమర పట్టణమునకున్. ౧౭౭

క. కాలమున నాకు రాలుట
చూలొదవుట పూలు పండ్లు శోభిల్లు నటుల్
జాలియు మేలును గలుగును
కాలవశతఁ గాన బుధుఁడు కంపింపఁడిలన్. ౧౭౮

క. కోరకయె వచ్చుఁ గీడా
తీరుననే వచ్చు మేలు తెలియక మేలుం
గూరిచితను గీడైనన్
దూరును దైవమును బరుల దూషించు నగన్. ౧౭౯

ఆ. కత్తి త్రిప్పవచ్చు గర్జింపఁగా వచ్చు
బిరుదులెల్లఁ దాల్చి మురియ వచ్చు
చుట్టి శత్రు సమితి శూలాలఁ గ్రుమ్మరా
నోర్చి తీర్చు వాఁడె యోధ వరుఁడు. ౧౮౦

ఆ. వేదికలను నిల్చి వేదాంత వాక్యముల్
పలుక వచ్చుఁ దిరిగి కులుక వచ్చుఁ
గామ ముఖ్య శత్రు గణములు పీడింప
బెండు పడని వాఁడె పండితుండు. ౧౮౧

ఉ. క్రమ్మఱఁ గంఠ సూత్రమును గట్టి యలంకృతిఁ బూని భర్తకున్
సమ్మతిగాఁగఁ గాపురము సల్పి కుమారులఁ గాంచెఁ గోడలా
యమ్మ భుజింపఁజేసెఁ బరమాన్నము వండి కుమారుఁ దండ్రితో
నుమ్మలికమ్ము లేక మది నుబ్బక కాంచిరి కీర్తి సంపదల్. ౧౮౨

## మృత్యుదేవతామాహాత్మ్యము

క. రహించెడు దేహ మనిత్యము
బహుతర సంపదలు నిల్వఁబడ నేరవు స
న్నిహితము మృత్యువు నిత్య
మ్మహ రహమును ధర్మ సంగ్రహము కృత్యమిలన్. ౧౮౩

## పంచాంగం రామమూర్తి కథ

క. కుంచవరమను పురమ్మునఁ
బంచాంగము రామమూర్తి బ్రాహ్మణుఁడుండున్
బంచశరు కేలి వాలనఁ
గాంచన లత యను లతాంగి కలదాతనికిన్. ౧౮౪

క. ఆ దంపతు లన్యోన్యము
వేద విహిత కర్మ వృత్తి విడువక సుఖ సం
పాదకులై పౌరవరా
రాధితులై సుగుణగణ విరాజితు లగుచున్. ౧౮౫

క. ఇంతులలోఁ బురుషులలో
నెంతయుఁ బేరెక్కి పార్వతీశ్వరులనఁగా
సంతసమున మనుచుండియు
సంతానము లేక మనిరి చాల దినమ్ముల్. ౧౮౬

క. పౌరోహిత్యము చేయును
వారల కెఱిఁగించు శాస్త్ర పౌరాణికముల్
కూరుచు సుముహూర్తమ్ముల
గౌరీశుని గొల్చు నతిథిఁ గన నర్చించున్. ౧౮౭

చ. తన కుల ధర్మమున్ విడక దాతల చిత్త మెఱింగి నేర్పుతో
మనఁగల వాఁడు, వైదిక సమాజములోఁ జుఱ్ఱుకైన వాఁడు, కా
మినుల వ్రతంబులుం గథ లమేయముగా నడపించు వాఁడు లే
దనియెడి చింత లేక మను నా ద్విజవర్యుఁ డుపాయ శాలియై ౧౮౮

ఉ. వేకువ లేచి శుద్ధిఁగనిఁ వెన్నుని బాడుచుఁ జల్లఁ జేసి యిల్
వాకిలి దిద్ద దాసి పరిపాటిగ స్నానముతో నలంకృతిన్
గైకొని వంట చేసి పతి కంటికిఁ బంటికి నింపుఁ గూర్చుచున్
లోకులు మెచ్చ ధర్మపథ లోప మెఱుంగక కాంత యొప్పెడిన్ ౧౮౯

ఉ. వారొక నాటి రాత్రిఁ దమ ప్రాంగణమందు శయించి యుండఁగాఁ
దూరుపు తెల్లవారు తఱిఁ దొయ్యలి శయ్యను బంచ కప్పులో
జారిన తెల్లు పోచ పడి సర్పముగాఁ గనుపించి సుప్తయా
నారిని ముట్టె విప్రుడు మనంబునఁ దత్తరమంది లేవఁగన్ ౧౯౦

ఆ. లేచి చూచి తెల్లు త్రాఁచు బామెట్లాయె!
కఱచునెట్లు సతిని ఖట్వ నెగిరి
దూఁకి పోయె ననుచు దొడ్డ కత్తను గొని
మోదఁ దలఁచి కూడ ముట్టుటయును. ౧౯౧

క. చిక్కక సర్పము పొదలను
నక్కుచు దరికేగ మెలపునం బరుగిడుచున్
డక్క లొనర్చుచు విప్రుని
జిక్కులలోఁ బెట్టి గహన సీమకుఁ జేర్చెన్. ౧౯౨

ఆ. గహన సీమఁ జేర్చి, కాడి మానంత యై
పడగ విప్పి కఱ్ఱపైకి నెత్తి
బుసలు కొట్టి, పెద్ద భూతమై కనుపించి,
మెఱుపు మెఱసినట్లు మెలఁత యయ్యె. ౧౯౩

ఉ. కల్ల నిజమ్ము తేర్పరుపఁ గాన నిదెక్కడి మాయ భూతమో!
పుల్లయి, సర్పమై, వికృత భూతమునై, సుమ కోమలాంగియై
తల్లడమందఁ జేసెడిని దైవ విలాసమొ! దైత్య మాయయో!
చెల్లరె! మోసపోతి నని చెట్టుపయిన్ వసియించె భీతుఁడై. ౧౯౪

ఉ. వాఁడటు నక్కి యుండ నెలప్రాయపు రా సుతు లిద్దఱందు వే
టాడఁగ వచ్చి దానిఁ గని యుబ్బురమంది సమీపవర్తులై
చేడియ యెవ్వరీవు! వన సీమకు రాఁ గతమేమి! నిన్నుఁ బెం
డ్లాడిన వాఁడెవండు! జనకాన్వయమేది! యెఱుంగఁ జెప్పుమా!.
౧౯౫

క. జ్ఞాతులము రాజులము ప్ర
ఖ్యాతులమని వీర వైరి కానన దహన
స్ఫీతులము నీకు నచ్చిన
యాతని వరియింపు మనిన ననుమోదమునన్. ౧౯౬

ఉ. చూపుల వాలుఁ దూపు లెదఁ జొచ్చి కలంపఁగ వారిఁ జూచి నే
నోపఁగ లేను దాహ మగుచున్నది నిన్నటి నుండి కానలోఁ
దాపము నొందుచుంటిఁ జన దారి గనంబడ దేమి సేయుదున్
బాపము పండి పోయె జలపాన మొనర్పక మేను నిల్చునే! ౧౯౭

చ. అను పలు కాలకించి యొకఁ డావని నున్న తటాక భూమికిం
జని యొక తామరాకునను జల్లని నీరముఁ గొంచు వచ్చి యి
చ్చినఁ గడుపాఱఁ గ్రోలి మనఁజేసితి దాహాము దీర్చి యెంతయో
కనికర ముంచి నీకు నుపకారము క్రమ్మఱఁ జేయ నేర్తునే! ౧౯౮

ఉ. నీ వటు పోవ నీ ఘనుఁడు "నీరజలోచన నన్ను నీవు సం
భావన సేయఁగాఁ దగుదు ప్రాణముఁ బ్రాణము గా గడింతు నా
జీవిక నీవ యక్కునను జేర్పుము తీర్పుము కోర్కులం" చహం
భావము తోడ నా కరముఁ బట్టెఁ గుచమ్ములు ముట్టె దిట్టయై. ౧౯౯

ఉ. ఒంటరి పాటు చిక్కెనని యోడక నన్ జెఱఁ బట్టఁ జూచె నీ
తుంటరి; వీని కావరము త్రుళ్ళడఁగించుట క్షాత్ర ధర్మ మీ
వంటి నృపాల సూతికి శివంబు ధ్రువంబగుఁ బాపకర్ములం
గెంటుట గో ద్విజాంగనల క్లేశము వాపుట లార్య ధర్మముల్. ౨౦౦

చ. అనలముఁ బెట్టు వారు, విస మన్నములో నిడువారు, శస్త్ర మె
ప్డును గరమందుఁ దాల్చి వెఱపుం గురిపించెడి వారు, ద్రవ్యముం
గొని మనువారు, క్షేత్రములఁ గోమలులన్ హరియించు వారలీ
జనముల నాతతాయులను శాస్త్రము, పాములపోల్కిఁ జంపనౌ!
౨౦౧

చ. అని యిటు లా నెలంత పలుకాడఁ జివాలున వాలు దూసి నా
వనితను బట్టినావె తులువా! తలవ్రాల్ తరవారిఁ గాచుకొ
మ్మని పయిదూఁకి నీవు వగలాఁడి దురుక్తుల నమ్మఁబోకు గో
తినిగని గోతిలోఁ బడకు దిక్కరి పైఁ బడు కుక్కపోలికన్, ౨౦౨

శా. ఓరీ దుర్మతి! నోరు మూయుమిక నీ యుక్తుల్ పిసాళించునే!
నారీ రత్నముఁ గోరి నేను వనిలో నారమ్ము లార్జింపఁ బో
జారత్వం బొనరింప సిద్ధపడితే! చండాలుఁడా! నేఁడు నీ!
గోరీ కట్టెదఁ బాతి పెట్టెదను పై గూటంబునుం గొట్టెదన్. ౨౦౩

శా. సారాసార వివేక హీన నిలురా! జ్ఞానంబటుల్ వాగుదే!
శూరత్వంబు వెలుంగఁ బోరు మిపుడే చూపింతు స్వర్గంబు. న
న్నేరా! గ్రుడ్లకుఁ గ్రొవ్వు తట్టి కనరానే! నీకు నీనాటితోఁ
జేరెన్ గాలము చాల చేరువయి నా చేఁ దుంపులై కూలఁగన్.
౨౦౪

క. మదకరుల పోల్కి సింగపుఁ
గొదమలు తారసిలినటులఁ గులగిరుల వలెన్
గదియుచు నొదుగుచుఁ జదియుచుఁ
గదన మ్మొనరించి రమర గణము నుతింపన్. ౨౦౫

క. కరవాలమ్ముల నిరువురు
సరి సరిగాఁ బోరి పోరి శస్త్ర నిహతులన్
ధర నొఱగఁ జూచి విప్రుఁడు
హరి హరి యని చెట్టు జాటి యంగన కనియెన్. ౨౦౬

ఉ. ఎవ్వరు నీవు పామవయి యింతిని గూల్చితి విట్లు వచ్చి యీ
చివ్వకు మూలమై నృపుల జీవితముల్ హరియింపఁ గంటి విం
కెవ్వరిఁ గూల్పఁబోదు! తగవే! దురితం బొనరింప నన్న, నే
నవ్విధిచేత మృత్యు పదమందుఁ జరింతు హరింతు లోకముల్. ౨౦౭

క. వీరల కీవిధి మరణము
కారణమై యుండ నిటులఁ గావించితి నన్
జేరదు పాపము గీపము
కోరికయే లేక జీవ కోటి హరింతున్. ౨౦౮

క. ప్రారబ్ధము తప్పింపఁగ
వారిజభవు నంత వాని వశమే పొమ్మా!
కారణ మేదో చూపక
యూరక మరణించె ననిన నొప్పునె జగముల్. ౨౦౯

క. పురుషుల వనితల, పండులఁ
బోరిగొను తఱి వారి రూపముల ధరియింతుర్
సిరిఁ గొల్చు వారిఁ దునుముదు
హరిఁ గొల్చెడి వారిఁ గాంచి యభినందింతుర్. ౨౧౦

క. తల్లీ! నీ మహిమకు నేఁ
దల్లడ పడు చున్నవాఁడఁ దఱి లేచి ననుర్
బిల్లివలెఁ బొంచి పైఁ బడి
బల్లిని భక్షించు నట్లు భక్షింతు వాకో!. ౨౧౧

క. ఏ రూపున నెన్నాళ్ళకో!
యూరనో! యడివిననో! దారినో! జలములనో!
కారణ మేదో! నా మృతి
గూరుటకుం గరుణఁ జెప్పఁ గోరుదు ననినర్. ౨౧౨

ఆ. అడుగ రాదు మీకు నుడువఁ గూడదు మాకు
దేవతా రహస్య మీ విధంబు
నీటిలోన మొసలి నోటిలో మృతినొందఁ
గారణమ్ము నీకుఁ గలదు పొమ్ము!. ౨౧౩

ఆ. మొసలి నోటఁ జిక్కి మోస పోవుదు వనేఁ
గాన నీటిలోనఁ గాలు పెట్టఁ
బెట్టి తేని మొసలి పట్టి చంపు నటంచు
దిగుడు బావిఁ గూడ దిగఁ డతండు. ౨౧౪

క. అని యానతిచ్చి మృత్యువు
కను మూసిన యంతలోనఁ గనుపడ కనుగన్
మనమున నబ్బుర మందుచుఁ
జనియెన్ విప్రుండు ప్రాణసతిఁ గనుఁగొనఁగన్. ౨౧౫

ఆ. పోయి కాంతఁ జూచి భూశయనము చేసి
కాల గతికిఁ జాల జాలినొంది
వగచె నిరుగు పొరుగు వారెల్ల గుమికూడఁ
గలసి మనిన ప్రేమఁ దలఁచి తలఁచి. ౨౧౬

ఉ. ఎన్నఁడు నా యనుజ్ఞ కెదురెన్నడు మెత్తని మాటలాడు నా
కన్న భుజింపదెప్డు మును కాంచదు నిద్దుర లేచు ముందు నే
డున్నది లేదు నాక గృహ మొక్క విధంబున దిద్దఁ బెద్దలన్
మన్ననచేయుఁ గోపమను మాట నెఱుంగదు పంటదంటయా! ౨౧౭

ఉ. పున్నమ చందురుం దెగడు మోము విలాసము నిండుకుండ నా
కన్న పదేండ్లు చిన్న పదికాలములింత సుఖింప నోటిలో
మన్నును గొట్టిపోయెఁ దుది మాట యొకండును దెల్పదాయె నిం
కెన్నటికైనఁ జూడఁగలనే! ప్రియురాలి వరాల రూపమున్ ౨౧౮

చ. అని విలపింప బంధుజను లాప్తులు శోకము మాను గ్రంథముల్
కని పెరవారలం దెలుపఁగాఁ గలవాఁడవు నీవె యీగతిన్
వనట మునుంగఁగాఁ దగునె! వచ్చునె చచ్చినకాంత ప్రొద్దిదే
చనియెడు జాముపైఁ గనుము శాస్త్రవిధిం దహియింప లెమ్మిఁకన్.
౨౧౯

క. పిల్లలు పెద్దలు నాకటఁ
దల్లడిలుచు నున్నవారు తడవేటికి నీ
యిల్లాలు వచ్చునే యిఁక
పెల్లేడ్వఁగ ముందుకలవు పెక్కుదినమ్ముల్. ౨౨౦

ఆ. పతికి ముందుపోయెఁ బసుపుఁ గుంకుముతోడఁ
బూజ్యురాలు చింత పోవకనుచు
హితులు హితము తెల్పఁ జితిఁ జేర్చి యర్ధాంగి
కగ్నియిచ్చి స్నాన మాచరించి. ౨౨౧

క. పరలోక క్రియ లెల్లను
బరిపూర్ణముగా నొనర్చి బంధుజనులతోఁ
బురవాసుల కరుదెంచిన
ధరణీసురవరుల కన్నదాన మొనర్చెన్. ౨౨౨

క. చుట్టము లెల్లను గోలం
గొట్టిన వడువుననుబోవ గుండెలవిసి యా
నట్టిల్లు చూచి బ్రాహ్మణుఁ
డట్టిటు తిరుగాడి చింత నలమట పడియెన్. ౨౨౩

ఆ. అకట! తమ్మరాము మట్టులీ వంటయి
ల్లున్నదెట్లు దీని నూడ్చికొందు
శుద్ధి చేతు నెట్లు చూచువారెవరు నా
కష్టసుఖములనుచుఁ గళవళించె. ౨౨౪

ఆ. పొరకఁ బట్టనాయె పొయి గట్టుకో నాయె
నుడుకు మిడుకు మాడు కుడుననాయె
నుప్పు చింతకాయ చప్పిడి గోఁగాకు
కార ముప్పుతోడఁ గలుపనాయె. ౨౨౫

ఆ. కడుపు నిండదాయెఁ గాళ్ళు లాగుటలాయెఁ
బండుకొనిన నిద్ర పట్టదాయెఁ
దెల్లవారునంచుఁ దల్లడ పడనాయె
జన్మశిక్ష నాకు జరుగనాయె. ౨౨౬

ఉ. ఎక్కడి మాయపాము తర కేక్షణ, గూల్చెను వంటఁ జేసికోఁ
జిక్కు ఘటిల్లె మున్నెపుడు చేసినవాఁడను గాను సాయమా
దిక్కొకరైన లేరు పలు దిక్కులనుండియు వచ్చు చుట్టముల్
నక్కిరి యక్కడక్కడనె నక్కలపోలికఁ డక్కు లాడుచున్ ౨౨౭

ఆ. ఉన్ననాఁడు తినుట కూరెల్ల బందుగుల్
కష్టకాల మెవరు కాన రారు
బెల్లమన్నఁ జీమ పిండు దండిగఁ జేరు
నల్లమన్నఁ జేర నొల్లదు గద! ౨౨౮

ఉ. ఉల్లము చల్లనైన సరసోక్తుల ముచ్చటఁ జెప్పఁ బ్రొద్దుపో
నొల్లక భోజనంబునిడు నోపిక రూపయినట్టు లింటిలో
నెల్ల సుఖంబులం దనుపు నీశ్వరు నిప్పుల పూజఁ జేసితిన్
దొల్లిఁటి పామునందు మణితో నెనయాఁ గనకాంగిఁ బాసితిన్. ౨౨౯

ఆ. ఇల్లె యింద్రభవన మిల్లాలు గలనాఁడు
యిల్లు వల్లకాడె యింతిలేక
వల్లకాట శివుఁడు వసియించి యున్నాఁడు
దంతిగమనఁ గూడి చింత లేక. ౨౩౦

ఆ. అడవిలోన రాముఁ డాహ్లాదముగ నుండె
సీత తోడ నెట్టి చింత లేక
సీత లేక పురిని జింతతోఁ గృశియించెఁ
దలకు మిగులునట్టి బలఁగ మున్న. ౨౩౧

ఉ. ఒంటిరినైతి నేపనికి నోపిక యించుక లేదు, కూటికే
తంట జనించె వే యతిథి తండము దండముతోడఁ బోయె నా
కంటికి నిద్రలేమి నిశ కల్పసమానముగా గతించె, ము
క్కంటియుఁ దట్టుకోఁగనక క్రమ్మఱఁ బార్వతిఁ బెండ్లియాడఁడే! ౨౩౨

ఆ. మరలఁ బెండ్లియాడ మాన్యమూ పస లేదు
వయసు ముదిరెఁ బెద్దవాఁడ నైతిఁ
జేసికొనుట తప్పు చేటునకే యగుఁ
జేసికొనక తిండిఁ జిక్కు గలిగె. ౨౩౩

ఉ. అన్నము లేని బాధకయి యన్నులమిన్నను బెండ్లియాడ నా
చిన్నది వన్నెచిన్నెఁ గయిచేసెడి కాలమునందు దగ్గుతోఁ
గన్నియ లేవగించుకొను కాయముతో మనుగడ్వఁ బోవ నక్
గన్నులఁ జూచి భూతమును గాంచినపోలికఁ గాండ్రు వెట్టదే! ౨౩౪

ఆ. ఈడు జోడువానిఁ గోడెకాఁడగు వానిఁ
జక్కనైన వరుని జెక్కు నొక్క
కుసుమ కోమలాంగి ముసలివానిని గాంచి
వరుఁడు వఱడటంచు వగచు మదిని. ౨౩౫

ఉ. మూఢుఁడు యౌవనాంతమున ముగ్ధను బెండిలియాడనటంచు మున్
రూఢిగ శ్లోకభాగ మెవరో వినిపించిరి యష్టభాగముల్
గాఢము కామ మంగనకుఁ గంతుఁడు రంతొనరింప నిందనన్
బాఢముగా వరించు నపవాదము చావునకన్నఁ దక్కువే!. ౨౩౬

ఉ. కష్టము లెన్నియైనఁ బడి కాలముఁ బుచ్చుట మేలుగాని సం
తుష్టి యొనర్పలేక సతితో జతచేయఁగ రాదు దీనిచే
నష్టము హెచ్చు కాపురము నాశమగున్ బరలోకహాని వి
స్పష్టము వంశముం జెడును జచ్చినచావగు సాటివారిలోన్. ౨౩౭

క. అని యిట్లాలోచింపుచు
దినములు గడపుచును లేవఁ దెంపొదవక యే
పని చేయలేక వందుచుఁ
దినలేకను విప్రవరుఁడు తికమక పడియెన్. ౨౩౮

ఉ. దుంపతెగ న్నిశల్ పవలు దుఃఖముతోఁ బనితోడ నెట్టులీ
అంపపుఁగోత తప్పు నిటు రమ్మని చీరెడివారు లేరె యీ
కొంపను బాసి దేశములఁ గ్రుమ్మరఁబోయినఁ బెద్దలుండరే!
త్రుంపరె మోహజాలముల దుఃఖముతో మనఁజాల నిచ్చటన్. ౨౩౯

చ. అని తలపోసి మంచిదినమారసి, యింటికిఁ దాళముంచి నా
జననమునుండి యీ గృహము చల్లనినీడ వసించియుంటి నీ
దినమునఁ బాసిపోవలసె దేహము గేహము తుల్యమందు రీ
తనువునఁ బ్రాణముండియును దైవవిధిం గృహసీమ వాసెదన్ ౨౪౦

క. శనిగురులు నీచగతులయి
వనితను బరిమార్చి గృహము వదలించిరి నా
మనుగడ యేగతిఁ గడచునా!
యినుఁ డష్టమమునకు వచ్చు నీనెలలోనన్. ౨౪౧

ఉ. ఎచ్చటి కేగువాఁడ నొరు నెన్నఁడు వేడినవాఁడఁ గానిఁకే
సచ్చరితుండు బ్రోచు విధిచాతురి కేమనవచ్చు నేరికీ
ముచ్చటఁ జెప్పికొందు నొకపూఁటకుఁ బైఁబడి యుండరాదు చీ
కుచ్చితమైన జీవనము కూడెఁగదా! తలవ్రాత దప్పునే! ౨౪౨

ఆ. దారిపట్టి యతఁడు ధర్మసత్రములలో
ఘనుల యిండ్లఁ బొట్ట గడపికొనుచు
పోయి పోయి నెలకుఁ బొన్నూరునకుఁ జేరి
మాదిరాజువారి మహలు గాంచి. ౨౪౩

ఆ. వారియింటఁ జేరి వైదికనిష్ఠతో
దేవతార్చనలను దీర్చుచుండ
చూచి వారు మంచి శ్రోత్రియవరుఁడని
యూరు పేరు తెలియఁ గోరి యడుగ. ౨౪౪

క. కుంచవరమనెడు గ్రామము
పంచాంగము రామమూర్తి భట్టందురు నన్
గాంచనలతయను సతితో
మంచిగఁ గాపురముచేసి మనియెద నిపుడో! ౨౪౫

క. ఏకాకిని యిల్లాలో!
లోకాంతరమునకుఁబోయె లూతవిధమునన్
జీకాకుపడితిఁ గొంపను
శోకమునన్ బనులవలన సుఖరహితుఁడనై. ౨౪౬

క. వెడలితి దేశాటనకై
పిడికెఁడు కూడెవ్వరేని పెట్టరె! యనుచున్
బడలితిఁ దిరుగుట నెన్నఁడు
నడచియెఱుఁగ దిక్కునాకు నారాయణుఁడే! ౨౪౭

క. అని తన యుదంతమంతయు
వినిపించిన నింటివారు విధిచేతకు నె
మ్మనమున నుమ్మలికముఁ గొని
చనవలదిఁక నుండుమిచట సాధుచరిత్రా! ౨౪౮

ఆ. తీర్థమిచ్చుచుండు దేవతార్చనఁ జేసి
పుణ్యకథలు చదివి ప్రొద్దుపుచ్చు
బరువుగాదు మాకు బ్రాహ్మణోత్తముఁడవు
బుధులపొత్తు స్వర్గమునకు నెత్తు. ౨౪౯

క. అని బలవంతము చేసినఁ
దనమనమునఁ జింతచేసి దయగలవారీ
వనితలు, పురుషులు, కాదని
చనితేనియుఁ దల్లివంక జనులట గలరే! ౨౫౦

ఆ. స్నానపానములకు స్వాదుజలమ్ముతోఁ
జేదబావి కూడఁ జెంతఁగలదు
మొసలి భీతిలేదు మోసమేమియు రాదు
ఉండుటొప్పు తిరుగుచుంట ముప్పు. ౨౫౧

క. కానిమ్ము జరిగినంతకె
పూనుదు నిటనుండ మునిఁగిపోవునదేది నా
కేనాడు విసుగు దోఁచిన
నానాఁడే పోదు బడలి కైనన్ దీరున్. ౨౫౨

క. అనితలఁచి నిలువనచ్చట
దినదినమును మైత్రి పెరుఁగఁ దిండియు జరుగన్
దనవారె వారలనుకొని
మనియెన్ వారలును జాల మన్నించిరటన్. ౨౫౩

సీ. బ్రాహ్మమందునలేచి పద్మాక్షు నుతియించు
స్నానసంధ్యాదులు చక్కఁబెట్టు
బ్రహ్మయజ్ఞము చేయుఁ బార్థివ మ్మొనరించు
విస్తరాకులు కుట్టుఁ బెరటికేగి
కాయగూరలు తెచ్చు సాయమౌ వంటకు
మాధ్యాహ్నికముఁదీర్చు మడినిగట్టి
గుణదోషములుమాని కుడుచుఁ బెట్టినయట్లు
తలలోని నాల్కట్లు మెలఁగుచుండు.

ఆ. భాగవతము చదివి భక్తిని బోధించు
సాయమైనతఱిని సందెవార్చు
నారగించి రాత్రి హరిఁగొల్చి నిద్రించు
సాధువృత్తికెందు బాధ గలదె! ౨౫౪

క. ఈరీతి నొక్కవత్సర
మేరోఁతయులేక దినములేగఁగ నొకనాఁ
డా రాజవీధి ముదుసలి
పాఱుల కులవనిత యోర్తు బాలుని గొనుచున్. ౨౫౫

క. ఇల్లిల్లు బిచ్చమెత్తుచుఁ
దల్లియుఁ దండ్రియును లేని తనయుఁడు క్షుధచే
బల్లియయినాఁడు బిడ్డల
తల్లులు పాలీయరమ్మ! దయఁగనరమ్మా! ౨౫౬

క. అని వేడుచుఁ దమయింటికిఁ
జనుదేరఁగ గృహిణి కాంచి జాతియెది? యిటుల్
చనుదేరనేల? పాపని
జననీ జనకులును నెవరు! సంబంధమెటుల్! ౨౫౭

క. వినిపింపుమనిన ముసలిది
కనుఁగవ నీరొత్తికొనుచుఁ గాంచీపురమీ
తనయుని పితలది వీనిని
గని తల్లియుఁ దండ్రిచనిరి కాలవశమునన్. ౨౫౮

క. భారద్వాజసగోత్రము
పాఱులము నియోగివంశభవుఁడగుఁ బితరుల్
లేరు పరలోకమేగిరి
దారిద్ర్యము హెచ్చు నాకు దౌహిత్రుఁడగున్. ౨౫౯

చ. కనియెను భూమిపైవయిచి కాలముచేసెను దల్లి యంతకే
మునుచనెఁ దండ్రి మాసములు మూఁడుకొఱంతగఁ బాపకర్మనై
మనియెద నేటికీతగులు నూనక కూలెను నెత్తిపైన నే
యనువునఁ బెంపఁజాలుదు నిరర్థకవృద్ధను వ్యర్థురాలనై. ౨౬౦

ఉ. అన్నము లేదు, బంధుగుల యాదరణంబొక యింత లేదు, నా
కన్నుల చూపు తగ్గె నరకాసును జేతను లేదు, ధార్మికుల్
పున్నెము కట్టుకో రడుగఁబోయిన గేలియొనర్తు, రింతకే
ట్లున్నది నాపురాకృతము నూరికిఁ గాటికి రోసిపోయితిన్. ౨౬౧

చ. అదియటులుండె వీనినెటు లారడిచేయుదుఁ జేతులార నే
పొదలను వైచిపోదుఁ బెనుభూతములం దినుమంచుఁ బెంపఁగాఁ
గుదురదు మార్గమేది? మదిఁ గుళ్ళి నశింపఁగనాయె నెచ్చటేన్
బ్రదికినఁ జాలుఁ బెంచికొను వారల కీయఁదలంచి వచ్చితిన్. ౨౬౨

క. అని తన సంగతిఁ దెలిపిన
విని యాకలకంఠి మోము వికసిల్లఁగ నా
తనయుని రూపము కనుఁగొని
మనమున నుప్పొంగె దొరకె మానిక మనుచున్. ౨౬౩

క. అవ్వా! మావారికి నీ
సవ్వడి వినిపించి వీని సాకికొనెద నీ
కెవ్వరు లేరని వగవకు
బువ్వయు బట్టయు నొసంగి పోషింతు నవన్. ౨౬౪

ఆ. ఎవర్కైన వీని నీయఁగా వచ్చితిఁ
గలిమిగలదు మంచి కాపురంబు
కులమువారు వీని గోత్ర దాయాదులు
మీరు పెంచికొనిన మేలు నాకు. ౨౬౫

ఆ. అనుచు మాటలాడ నంతలో విభుఁడురా
నర్హవిధిని భోజనాదులైన
తమ్ములమెయ్యనర్చు తజిని బాపనిఁ గొని
తెచ్చి చూపి పతికిఁ దెలుప యనియె. ౨౬౬

క. కాంచీపురమఁట పేరిది
పంచత్వము నొందిరంట పతియున్ సతి యే
తెంచెను మాతామహి సుతుఁ
గొంచుం బోషింపలేక, గోత్రము మనదే! ౨౬౭

ఉ. కానక కన్నబిడ్డ నెలగాదు గతించి తదాదిగాగ మ
న్మానసమందు దుఃఖ మసమానముగా నలయించుచుండు నా
సూనుని రూపమే మరలఁ జూచినయట్లగు వీనిఁజూడ; మీ
రానతినింపు పెంచికొన నర్భకు గర్భ దరిద్రతల్ విడన్. ౨౬౮

ఆ. మనకు లేరు ముందు మాట యెట్లుండునో?
సుతులుగాన వీనిఁ జూచినంత
పెంచికొనఁగ బుద్ధి ప్రేరించుచున్నది
కన్నవారికన్న మిన్నగాఁగ. ౨౬౯

ఉ. ముక్కును మోము కన్నులును ముద్దులుగట్టెడిఁ బాలు లేమిచేఁ
జిక్కి నలంగినాఁ డొడలుచేసినఁ జందురుఁ గ్రిందుచేయు నా
ప్రక్కల చెక్కలంబెనుతుఁ బాలును నీళ్ళొడఁగూర్చి నిక్కనా!
చెక్కల కడ్డమౌను నెల రేపటికొనఁట యెంతపాపమో!. ౨౭౦

ఆ. పున్నెమయిననుండుఁ బుత్రుఁడయిననగుఁ
బాపమేమిరాదు పాలకందు
పెంచి పెద్దఁజేయఁ బెట్టనీ! కొట్టనీ!
లోకులైన నీమె సాకెననరె!. ౨౭౧

ఆ. అనిన పత్నిఁజూచి మనకేల యీగోల
కనక పెంచకెట్లు గలుగు సుతుఁడు
ఎరువుసొమ్ము తనకు బరువుచేటగుఁ గాని
సొంతమగునె! యేటి కింత మమత. ౨౭౨

క. పుత్త్రులు లేరని దత్తుని
బాత్రముగాఁ జేసికొండ్రు పరమున కతఁడే
శత్రువయి యిహపరమ్ముల
దాత్రముగా బాధఁబెట్టు దయలే కనలన్. ౨౬౩

ఉ. కన్నకుమారులే పితలఁ గాఱియపెట్టుచునుండ్రు దత్తులా!
మన్ననచేయువారు మఱి మాన్యము లేరని, యర్థమెచ్చటో
కన్నముచేసి పూడ్చిరని, కట్టిడులైరని, వారివారికే
యున్నది గట్టిపెట్టిరని, యోడక వాడల నాడఁ జూడమే!. ౨౬౪

చ. తనయులఁగాంచు ప్రాయమును దప్పఁగలే దెదియెట్టులుండునో
కనవలెఁగాని దూరముగఁ గాళ్ళకుముందటఁ జూడరాదు నా
మనమునకేమొ యీతగులు మంచిదిగాదని తోఁచుచున్నదీ
వును మదిఁ బాఱఁజూడు! కృపఁ బ్రోచిన నెత్తికిఁ జేతులెత్తునో!.
౨౬౫

ఆ. కన్నసుతిని గాలఁ దన్నినఁ బలుమారు
గుణము బాగుపఱుపఁ గొట్టె నండ్రు
దత్తసుతునిమాటఁ దలఁచి కోపించెనా
తఱుమఁదలఁచి రట్టు పరతు రండ్రు. ౨౬౬

ఉ. పాపము కాదుగాక! పసిపాపనిఁ బెంచుట మేలెకాకసం
తాపము దీరుఁగాక, పరతారకమై విలసిల్లుఁగాక, స
ద్రూపముఁ గాంచుఁగాక! గుణదోషము లెంచిన దోషమే కనఁ
బ్రాపకమాట నీవెఱుఁగవా! పలుచోటుల బోటిరో! యనన్.
౨౬౭

ఉ. దైవ ఋణానుబంధమునఁ దానయి యింటికివచ్చె వద్దనం
గా వశమౌనె? నాకు నిది కాదని పూనని, నిర్ణయింపఁగా
దేవుఁడు కర్తగాని మన తెల్వి సమర్థముగాదు మేలుగాఁ
గేనల మొప్పి కీడగును గీడుగఁదోఁచి యొకప్డు మేలగున్. ౨౬౮

క. జాలిపడి వచ్చె పీనిం
గాలం ద్రోయంగనేల కాదని, మనకున్
బాలకులు గలిగిరేనియుఁ
బాలో! పంపో! యొసంగి పంపుదమపుడే!. ౨౭౯

క. అని సతి దెల్పిన వినిపతి
తనసమ్మతిఁ దెలుప ముదము తనరఁగ వానిం
గొనిపోయి పెంచె లోపం
బనునది కనకుండ లోకు లభినుతి చేయన్. ౨౮౦

ఆ. పోయివత్తు మరలఁ బూరి యిల్లోకఁ డమ్మి
కూడు గుడ్డ నీవ కూర్తువు గద!
తలఁగె శ్రమము బిడ్డ తగులాటమును దీరె
ననుచు వెడలిపోయె నవ్వగారు. ౨౮౧

ఆ. దినదినాభివృద్ధిఁ దనరుచు బాలుండు
చూచువారి మనము చూఱఁగొనుచుఁ
బెరుఁగుచుండఁ జాల ప్రేమాతిశయమున
విప్రవరుఁడు చంకఁబెట్టి తిరుగు. ౨౮౨

ఉ. బిడ్డలు లేనివాఁడగుట బింబమువంటి కుమారుఁడౌటఁ బై
గుడ్డను జేర్చి వీపుపయిఁ గూరిచి యుప్పని యమ్మఁ జిన్నినా
బుడ్డియటంచు ముద్దుగొను మోమున మోముగదించు నవ్వుకోం
చొడ్డును జేతులం దిగువనుండిన బండిని జేర్చి లాగుఁదాఁ. ౨౮౩

సీ. కోడి కూసెడివేళ కుమిలి కుమిలి యేడ్వ
నూయెలలోనుంచి యూచుచుండు
తల్లి యిల్లలుకుచుఁ దనయు నేడ్పించిన
దంత ధావనమాని చెంతఁ జేర్చు

మడిగట్ట జనయిత్రి బుడుతని నాడించు
భుజియించుచున్నప్డు బుజ్జగించు
తాంబూలమును జేయు తఱి నోడిలోనుంచుc
బండి లేచినయంత బండి లాగు

గీ. నెత్తిపైcజేర్చు మాటలు నేర్పుc జెప్పి
యాటలాడించు 'దోబూచి' యనుచు నవ్వ
బ్రాహ్మణుcడు బాలకుని జూచి భ్రాంతినొంది
కనని పెట్టని ప్రేమచేc గట్టువడుచు. ౭౮

సీ. బ్రాహ్మమందున లేవc బాలుమాలcడు గాని
స్నాన సంధ్యలు వోయెc జల్లగాను
పార్థివ మ్మడుగంటె బ్రహ్మయజ్ఞము చెల్లె
నాటలాయెను దేవతార్చనమ్ము
భాగవతపురాణ పఠనము మట్టయ్యె
హరినామ కీర్తన మడుగుపట్టె
నస్తమయార్ఘ్యము లాగుట తఱచాయెc
బారిశుధ్యము గంగదారి పట్టె

గీ. జాము ప్రొద్దెక్క స్నానము జరుపనాయె
జపతపమ్ములు దడదడ సలుపనాయె
సహజ బ్రాహ్మణ ధర్మము సన్నగిల్లె
మమతచేc గొంత పొరుగింట మనుటc గొంత. ౭౯

గీ. కనుపడని మంచుచే మాయు కమలమట్లు
తెవులు గుఱుతింపకయె ముప్పుc దెచ్చునట్లు
వయసుతోc బ్రేమ నానాట వర్ధిలంగ
మమతచే నెఱుcగకయె ముక్తి మరచెనతcడు. ౮౦

గీ. ఉలికి మాఱొడ్డు దూలాలఁ దోలుచుఁ దేఁటి
తమ్మిలోఁ జిక్కి ప్రేమను దాఁటలేక
యట్టులేయగు సంసారి కట్టువడుట
హెచ్చు ప్రియ మేరిపై వారె యుచ్చు తనకు. ౨౮౭

క. ఈరీతి శరత్త్రయమా
పాటుఁడు బాలకుని నాటపాటలఁ బెనుపన్
శారద గర్భాలసయై
నారాయణరావుతో వినయ మొప్పారన్. ౨౮౮

ఉ. సేతువునందు స్నానమును జేసిన మున్నగ గంగఁదోఁగి యే
పాతకమే నశించునని పల్కిరి పెద్దలు తొంటికానుపా
రీతిని వ్యర్థమై చనియె రేపటి కైదవమాస మాదియా
సీతటినైనఁ గాశిఁగని యిందుకళాధరుఁ గొల్చి వత్తమే!. ౨౮౯

గీ. అంతకున కంతకుఁడు తమోహరుఁడు హరుఁడు
అతని సేవింప నపమృత్యువడఁగు బ్రహ్మ
హత్యయేన్నాయు నైశ్వర్య మతిశయించుఁ
బరము తిరమగు లోచనపర్వ మగును. ౨౯౦

క. కావునఁ బోవుదమా! యని
కావింపఁగ మనవి; భర్త కానిమ్మటులే
త్రోవకుఁ దగిన సరంజా
మా; వలసినదెల్లఁ గూర్పుమా! రేపటిలోన్. ౨౯౧

క. పంచమియు శుక్రవారము
మంచిది యుత్తరముపోవ మాఘముగూడెన్
బంచాంగశుద్ధి గలదో!
పంచాంగము తాత నడిగి పయనముగమ్మా!. ౨౯౨

క. అని సమ్మతింపఁ దాతను
గని పయనము మాటచెప్పి కాశికిమాఁతో
డను మీరును రావలెననఁ
దనమది బెగడొందె ముప్పు దప్పదొ! యనుచున్. ౨౯౩

ఆ. అమ్మ! పెద్దవాఁడ నాయాసపడుదును
ఉందునిచటఁ జూచుచుందు నిల్లు
పోయిరండు శుభము పొందెదు మిమ్మనఁ
గష్టమేమి! మేము గలుగ నీకు. ౨౯౪

ఆ. నడువనీను తిండి నలుగుడు పడనీను
శీతబాధ పోవ సేలువిత్తు
గంగ మునుఁగవచ్చుఁ గాశీశుఁ గనవచ్చు
సేతువేగి ముక్తిఁ జెందవచ్చు. ౨౯౫

ఉ. కన్న కుమార్తెపోల్కి నినుఁ గన్నులలోనిడి యోమి తెత్తు నిం
కెన్నఁడు పుణ్యదీర్థముల కేగఁగలారన నౌనుగాని నా
విన్నపమాలకింపు నను వేసటఁబెట్టకు శారదాంబ! మున్
బున్నెమె చాలు యాత్రలకుఁ బోవుడిరోజులె తల్లి! చూడుమా!. ౨౯౬

ఆ. అనిన వారినేల నాయాస పఱతువు
పెద్దవారు తిరుగ వెఱచినారు
వారు చేయనట్టివా! తీర్థయాత్రలు
యింటియంద యుండనిమ్ము వీరి. ౨౯౭

ఆ. అనుచు భర్త పల్కు నౌను గాదనక యా
పడఁతి యూరకుండి పాన్పుఁ జేరి
చింతచేసెఁ దాత చెంత లేకుండిన
భారమెల్లఁ దనకుఁ బైఁబడునని. ౨౯౮

క. మావారు తాత నింటనె
పోవిడచిన ఖర్చు తగ్గిపోవును గృహమం
దేవారు లేమి యెటులని
భావింతురుగాని నన్నుఁ బాపమనరహో!. ౨౯౯

ఉ. తాతను బాసిపోఁ దగదు తన్నిక చత్తును బిల్లవానితో
జాతరలోను నాపనికి సాయముచేసెడి వారు లేరటన్
మేఁతకువచ్చి కూలఁబడు మేళమెకాని యొకింత సాయమే
బ్రీతి నొసర్చువారు కనుపింపరు పందలు నంద రందరే!. 300

సీ. స్నాతయై మడిఁగట్టి జపమాలఁ ద్రిప్పుచు
నపరాధముల నెంచు నత్తగారు
విధవయై పుట్టింట విధిలేక పడియుండి
కోడెత్రాఁచై లేచు నాడుబిడ్డ
పదిగంటలకె వంట పాకాల రుచులతోఁ
గాలేదా! యని దూఱుఁగట్టు విభుఁడు
పసిబిడ్డ వేవిళ్ళు పాడి పాలేర్లతో
బడలి యోపికలేక మిడుకుచుంటి

గీ. లెక్కకున్నార లిరుప్రొద్దు మెక్కనుంద్రు
చేసి పడిచచ్చినట్టులు చెప్పుచుంద్రు
విభునిగని దూఱు నామీఁద విసరి; తాత
కూడరాకున్న నాచావు కుక్కచావు. 301

ఆ. పొన్నుఁగట్టుఁ బట్టి పురి నాల్గువీధులు
చుట్టివచ్చి పెట్టు పెట్టుమనును
కాని మంచిచెడ్డ కాంచఁడు పెనిమిటి
కట్టు మూటలనుచుఁ గసరు నన్ను. 302

చ. పలుకును బిలిచినన్ విడిదిపట్టున వస్తువులెల్లఁ జేర్చఁగా
వలయగు నేను నాలయమువద్దకుఁ బోయిన నున్నచోటఁ బో
వలసినయప్డు సర్వమును బాధ్యతతో గమనించి తెచ్చు నా
కులువయిచున్ సహాయుఁడగుఁ గుజ్జుని నెత్తుకవచ్చు నాబడిన్.303

ఆ. ఎట్టులైనఁ దాత నీడ్చుక పోకున్న
భారమెల్ల నెత్తిపైనఁబడును
నలఁగి చత్తునంచుఁ దలఁచి తాతా! నీవు
రాని దేల! తెల్పుమా! నిజమన. 30౪

ఆ. నీటిలోన మొసలి నోటిలో మృతినొందఁ
గారణమ్ము నీకుఁ గలదటంచుఁ
జెప్పి మృత్యువందుచేఁ దీర్థయాత్రలు
మానినాఁడ నదుల స్నానమాడ. 30౫

క. అది యట్టులుండె నోపిక
చదికిలఁబడెఁ దిరుగ శక్తి చాలదు నీవో!
పదిగడియల కళనమ్మిడ
బ్రదుకుచునున్నాఁడఁ దిరుగ భారము తల్లీ!. 30౬

ఉ. అట్టులె యానుగాక నదులందుఁ దటాకములందు బావిఁ గాల్
పెట్టఁ బనేమి! నేన యొక బిందెఁడునీళ్ళను దెచ్చియిత్తుఁ బై
గట్టున స్నానమాడఁదగుఁ గాళ్ళను వ్రేళ్ళను బ్రాకులాడు నీ
బొట్టెఁడు నిన్ను బాసి యొకపూఁట వసింపఁగలాఁడె మాకడన్.30౭

ఆ. తలఁచికొనుచు మమ్ముఁ దపియింతు వింటిలోఁ
గష్టపడుదు చేయి గాల్చుకొనుచు
బెంగపడును జిట్టి యంగలార్తుము మేము
తాత రాడటంచు దారియందు. 30౮

క. కావున నీకే లోపముఁ
గావింపను నీటిలోనఁ గాలిడనీయక
ధావళితో మడిసంచిని
దేవునిసమకూర్చి బయలుదేఱు మటంచున్.

క. దేవునికిఁ బెట్టుకొని గణ
దేవుని ప్రార్థించి బుధుల దేశికులను సం
భావించి బయలుదేఱిరి
కావలసినవస్తువులు శకటమునఁ గొనుచున్.

ఆ. పోయి యాలయములు పుణ్యతీర్థములును
నగరరాజములు వనములు గనుచు
సత్రములను దిగుచు యాత్రికుల్ తోడరా
కాశిఁజేరనరిగి కాంత కనియె.

క. వరుణ యసి యనెడి నదులీ
పురి కిరుగడఁ బారుచుంట బుధులీపురి నం
దురు వారాణసియని భా
స్వరతం గాశియం డ్రెల్లవారు లతాంగీ!.

గీ. ప్రళయమున వహ్ని ముల్లోకముల దహింప
భైరవుఁడు దీని శూలానఁ బట్టి యెత్తి
కాచుఁగావున నీపురిఁ గలుగువారు
అమరులకుఁగూడఁ బూజింప నర్హులబల!.

గీ. అమరవరులకు దుర్లభంబైన హరుని
సేవ వీరికి ముప్రాప్తమ్ము చిక్కుఁగాన
దేవతలు వీరి దర్శింప దిగుటెకాని
స్వర్గమును వీరు వీక్షింప భ్రాంతివడరు.

క. గోడల నీడల సూర్యుని
వేడిమి చవిచూడనట్టి విధులు శశిత్రోఁ
గోడిగము లాడు మేడలు
చేడియ కనుఁగొంటె కాశిఁజేరితి మిదిగో!. ౩౧౫

సీ. షడ్దర్శనాదుల సంపూర్ణులై సోమ
యాజులై నుతిఁగన్న యవనిసురులు
వీరాధివీరులై విద్యాప్రవీణులై
దానరాధేయులై తనరునృపులు
కస్తూరి నవరత్న కనక విక్రయములఁ
గోటీశులై యున్న కోమటులును
పాడిపంటలచేత బలవంతులై భక్తి
భరితులై మను శూద్రవంశజులును

గీ. పట్టుబట్టలు నేసెడి పద్మసాలె
లాలమందలఁ బెంచు గోపాలకులును
భరతశాస్త్రప్రవీణలౌ పణ్యసతులు
పుష్పలావికలిందు సంపూర్ణమబల. ౩౧౬

సీ. దూకు బెబ్బులినైనఁ దొడఁగొట్టి మెడఁబట్టి
పడనెట్టఁగాఁ జాలు భటచయంబు
తాటించినంతనే యేటికాల్వలనైన
దాఁటి దాఁటఁగఁ జాలు తురగచయము
క్రోధించి పాతుతో భూధరంబులనైన
భేదింపఁజాలు స్తంబేరమములు
జంటచక్రములతో మింటికెక్క్యములతో
దంటసారథులతోఁ దగురథములు

గీ. బుద్ధిమంతులు మంతులు బుధులు నిధులు
దండనాయకు లుద్దండ దండధరులు
ఆజ్ఞ తలఁదాల్చి హితసూక్తులాడి కొలువఁ
గాశిరాజేలు దీని విఖ్యాతి భూతి. ౩౧౭

క. అని తనపత్నికిఁ దెలుపుచుఁ
గనుఁగొను చంగడుల భామ్యకారుని యింటం
గని వసతి నుపవసించియుఁ
జన నిశ వేకువను లేచి చంద్రాస్యకనెన్.౩౧౮

సీ. పద్మసౌరభముతోఁ బ్రాభాతవాతముల్
వీతెంచె గంగాంబు శీతలములు
ఇందుశేఖరునకై బిందెతీర్థమ్ము దే
గజమేగు మెడగంట 'ఖం' గనంగ
కాశీశునగరి మంగళతూర్యరావముల్
వైతాళికస్తుతుల్ ప్రబలమయ్యె
నిశయెల్లఁ బురిఁగాచి శశి బడలికనొంది
యస్త్రాద్రిఁ దలవాల్చె యత్తమిల్లె

గీ. ఇనుఁడు హారుఁగొల్వ నిదెవచ్చెఁ జనుఁడటంచు
వేగుఁజుక్కను బంట్రభవీధి వెడలి
ఉడుగణమ్ములఁ దొలఁగించె నొక్కరొకరి
ప్రాచి దివిటీల వెలుఁగునాఁ దోఁచె రక్తి. ౩౧౯

క. తెక్కలను గొట్టి నిక్కుచుఁ
'గొక్కొరకో' యనుచుఁ గోళ్ళగుంపులు కూసెన్
జక్కవకవ సొక్కెను రతిఁ
బక్కిగణము లభ్రవీథిఁ బాఱందొడఁగెన్. ౩౨౦

క. ఆలను గొనివచ్చిరి గో
పాలురు పాల్పిదుక వత్స పాత్రమ్ములతో
మేలుకొలుపులను బాడెద
రాలింపుము విశ్వనాథు నాలయమందున్. 3-౨౧

గీ. కాల్యకృత్యములను దీర్పంగా దక్షయిది
లెమ్ము తీర్థములాడంగా రమ్మటంచు
ఇంతితో మణికర్ణిక చెంతకరిగి
హస్తములు మోడ్చి తెలిపె సవిస్తరముగ. 3-౨౨

క. వనజాక్షుండు చక్రముంగొని
మును దీనిని ద్రవ్వి స్వేదమునం బూరింపన్
గని హరుండు శిరమునూంచిన
మణి కర్ణము జాఱి పడుట మణికర్ణికనాన్. 3-౨౩

క. పరంగిన తీర్థము దీనికి
సరిరావేతీర్థములును చంద్రానన తన్
స్మరియించినంతమాత్రన
దురితమ్ములడంచు ముక్తితోం గవగూర్చున్. 3-౨౪

సీ. ముల్లోకముల పాపవల్లుల ఛేదింప
నారాయణుని చేతినందకంబు
స్వర్గాపవర్గోగ్ర సౌధాగ్రముల కెక్క
స్ఫటికోపలముల సోపానపంక్తి
మైనాకు నింటిలో మన్నించు నప్పతి
కచలాధిపతిపంపు నంబరంబు
విపులాపురంధ్రికి వెన్నుండొసంగిన
కమనీయ మౌక్తిక కంఠమాల

గీ. కపిలు కోపోపశాంతికై కమలభవుఁడు
అల భగీరథుఁడను దూత హస్తమందు
ప్రాసివంపిన భూర్జర పత్రలేఖ
యనఁగఁ దగు గంగ కనుమిదే! యంబుజాక్షి. ３౨౫

సీ. మంచుకొండకు ఖ్యాతి పెంచిన తొలిబిడ్డ
కార్తికేయుని గన్న కీర్తనీయ
అష్టవసులజన్మ కాధారమాతన్వి
శంతనుభూజాని యంతిపురము
సగరాత్మజుల శాప సంతాపవారిణి
భార్గవు గెలిచిన బంటు జనని
సాగరునకుఁ బ్రాణసమమైన యిల్లాలు
హరు జూటమున డాఁగులాడు సుభగ

గీ. ఆపగల మేటి, యమరుల యజ్ఞవాటి,
నాకపథఘోటి, ముక్తివిన్నాణి చేటి,
బలి యశశ్శాటి, కాలుదూతలకు లాటి,
సుకృతముల పేటి, యీగంగ, సురవధూటి. ３౨౬

సీ. నారాయణుని పాద నగమున జనియించి
హరు జూటమను కోట నధివసించి
సగరుముమ్మనమండు సంబంధమును గూర్పఁ
గన్నెపోఁడిమి జహ్ను కరుణఁ గాంచి
ప్రాణవల్లభుఁడయ్యె రత్నాకరుండని
వికచాబ్జముఖి యయి విరులు తాల్చి
తామరాకుల పైఁట తెలఁగిన సవరించి
చక్రస్తనమ్ముల సర్దుకొనుచు

గీ. తేఁటి చెలికత్తియలు పెండ్లిపాటఁ బాడఁ
గోదమ రాయంచ దాదులు కూడరాగ
అత్తవారింటి కేగెడి బిత్తరియన
గంగయిదె సాగరునిఁ జేరుఁ గను లతాంగి. ౩౨౭

సీ. అఘమర్షణస్నాన మాడి భాగీరథి
గోడరుద్రాక్షలు గట్టియుఱత
ఊర్ధ్వపుండ్ర విభూతు లొప్పుగా ధరియించి
భ్రూమధ్యమున గుంకుమును ధరించి
శాలువ పైఁగప్పి జపమాలఁ ద్రిప్పుచుఁ
గృష్ణాజినములపై ఋషులరీతి
పంచాక్షరీమంత్ర పఠనమ్ముతో వేద
పారాయణము చేయు బ్రాహ్మణులను

గీ. తీరమునఁ జూడుమా! తన్వి! తేఱిపాఱ
బ్రహ్మసభనాగఁ గన్నుల పండువగును
కాశివిశ్వేశ్వరుఁడె పెక్కు కాయములను
దాల్చిన ట్లున్నవారెంత ధన్యతములో!. ౩౨౮

సీ. ముడివిప్ప మడమల కడఁదాఁకు నెఱికురుల్
శైవాల విభ్రాంతి సంఘటింప
వికచాంబుజమ్ములో విరిబోండ్ల మోములో
పరికించి విస్పష్ట పఱుపరాక
మిడిసిపడెడి గండుమీనమ్ములో కాక
లోచనకాంతులో గోచరిలక
స్తనయుగ్మములో జంట చక్రవాకమ్ములో
యరసి చూడక చెప్ప నలవిగాక

గీ. పద్మరజమును మైపూఁత పసుపునీరు
పైడి వలిపంపు వల్లియ పగిదిఁ దోఁప
గంగ స్త్రీరూపములఁ దాల్చుగతిని జలక
మాడువారినిఁ గంటె యీ యాడువారి.

క. శేషావతారమోయన
భాషించుచు బ్రహ్మసూత్ర భాష్యార్థములన్
గాషాయాంబరులగు జిత
దోషుల యతివరులఁజూడు తోయజవదనా !

క. విశ్వేశ్వరాలయమ్మిది
శాశ్వత సౌఖ్యములకిరవు చంద్రార్ధధరున్
విశ్వాసనియతిఁ గొల్వ గ
జాశ్వాది విభూతులొసఁగు నపవర్గమిడున్.

సీ. మంచుకనుళ్ళ వసించిన శ్రమదీర
భర్మహర్మ్యములలోఁ బండ నెఱిఁగి
పులితోలు గజచర్మముల మూలఁబడవైచి
కౌశేయ వసనముల్ గట్ట నెఱిఁగి
కాలకూటముఁ గ్రోలి కటువైన కంఠము
పాయసాపూపాల పాక మెఱిఁగి
వనచర పరివార పరుషోక్తులకు రోసి
సామగానాదుల సరసతఁగని

గీ. అన్నపూర్ణకు గృహభార మప్పగించి
గంగతో సైకతములందుఁ గడప నెఱిఁగి
ఇందుధరుఁడిందు సౌఖ్యము లందమరగి
కాశి విడనాడి పోఁడు కైలాసమునకు.

సీ. ముసరు జోరీగల ముసలియెద్దును దోలి
మత్తేభముల నెక్క మరగినాఁడు
నాగుబాముల ప్రాత నగలను విడనాడి
నవరత్నభూషలఁ దవిలినాఁడు
దోనలఁ జల్లనినీటఁ దోఁగి వడఁకమాని
పంచామృతమ్ము లాసించినాఁడు
భూతాల దయ్యాల జాతరఁ బడలేక
పండితుల్ వినుతింప బ్రమసినాఁడు

గీ. బిచ్చమెత్తెడి వాఁడెత్తివచ్చి కాశి
కేలికయినాఁడు భోగాళిఁ దేలినాఁడు
గుడ్డఁగట్టని పిడిగంట కొండజంగ
మీపురిని నాగరకుఁడయ్యె నోపురంధ్రి!. 333

సీ. కలిమిచే బలిమిచేఁ గులములోఁ జలిగట్టు
పేరు వాసినిగాంచ నాఱుమొక్క
నిటలాక్షు నెదిరించి నీరైన వలరాజు
జీవనమ్మునకు సంజీవకరణి
ముక్కుమూయుచు జపమ్మునుబేను భూతేశు
చిత్తమ్ము సార మారుఁడెత్తు శరము
ఆఁకొన్న భక్తాళి కమృతాశనమ్మిడి
సాకల్యముగఁ బెంప సత్రశాల

గీ. గరుడ గంధర్వ నిర్జర గణములందు
పెద్దపెద్దలు సేవించు ముద్దరాలు
పార్వతీదేవి సారంగపాణి రాణి
మించు కృపచేత మమ్మాదరించుఁ గాత. 33౪

గీ. మంచుమల గన్న వెలలేని మానికమ్మ !
ఫాలలోచను నాడించు పైడిబొమ్మ !
కృతమెఱుఁగుదమ్మ ! మా నమస్కృతులఁ గొమ్మ !
అన్నపూర్ణమ్మ ! మమ్మేలుమమ్మ ! కొమ్మ !. ౩౩౫

గీ. సత్యపరుఁడైన యా హరిశ్చంద్రనృపతి
ఆలి నమ్మిన చెట్టిదే ! నీలవేణి
మాలనికి దాసుఁడై బీఁకుమాలి కాఁడు
కాచి శాశ్వతవిఖ్యాతిఁ గాంచినాఁడు. ౩౩౬

గీ. బిందుమాధవు దర్శింపు మిందువదన
ఢుంఢివిఘ్నేశుఁ డితనికి దండమిడుము
దండపాణిని గాంచుము తలిరుఁబోఁడి
గుహను దర్శింపు పూజింపు గుహుని జనని. ౩౩౭

గీ. అనుచు నిల్లాలి కా కాశియందుఁ గలుగు
దేవతలఁ జూపి మహిమలు తెలియఁ జెప్పి
సేతువునకేగ గంగ నార్జింపఁగోరి
తగఁ బ్రయాగకుఁ బోఁగోరి తాతకనియె. ౩౩౮

క. తాతా ! యెన్నఁడు మకరము
భీతిని దిగవైతి గంగ వెడలుదమిఁక నా
లోఁతునకుఁ బోకు చుట్టును
బాతింతును గటకటాలు భయమేమిటికిన్. ౩౩౯

క. ముందర నిల్చెదు శూలము
లందిన శూరులను మునిఁగినంతనె రా ! నీ
డెందమున భయమె కానిట
నెందున్నది మొసలి మునుఁగరే ! వీరెల్లన్. ౩౪౦

చ. పనివడివచ్చి గంగఁగని పాపసమూహము విచ్చిపోవఁగా
మునుఁగక భీతినొందెదవు మూర్ఖునిపోలికఁ బండితుండవై
తనువిది యెప్పుడేఁ విడక తప్పునె! ముప్పును దప్పవచ్చునే!
మనమున బెంగమాని చనుమా! యనుమానముమాని పూనికన్. ౩౮౧

క. అని దంపతు లచ్చటిజను
లనఁగా మాటాడకున్న నాయుధపాణుల్
చనవయ్యా! భయమేటికి
మనియుండఁగ మేము మకరమా! నినుఁ బట్టున్. ౩౮౨

అ. ఎట్లు వచ్చు మొసలి యేది చూతము దిగు
జానువులకు మించి చనకు లోఁతు
మొసలియంట దాని ముండ యేఁకియవచ్చు
కటకటాలు దాఁటి కాని రాని. ౩౮౩

క. శూలాలఁగ్రుమ్మి యంతకు
పాలికిఁ బోఁద్రోలకున్న బంటులమండ్రే!
గాలికియున్నదె సీపయిఁ
గేలెత్తఁగ శూలికైనఁ గీలికైనన్. ౩౮౪

క. అని వారెల్లను జెప్పిన
విని యనుమానమ్ముతోడ వెఱచుచు నదికిం
జని కాలుపెట్టఁ బాపఁడు
కని మునుఁగుదుననుచుఁ దాత కడకేతెంచెన్. ౩౮౫

క. వలదనుచు నెట్ట గిలగిల
నిలఁబడి తన్నుకొనుచేడ్వ నింతియుఁబతి యా
వలకీడ్వఁ గోలచేసిన
పిలిచెను దాతయ్య రా విభీషణ! యనుచున్. ౩౮౬

క. బాలుఁడు నదిలోదిగి యా
భీలముగా మకరమగుచు విఱిచి కటకటాల్
శూలములఁగొట్టి శోకను
గోలపఱచి తాతఁబట్టి కొంపోయె వెసన్. ౩౪౭

సీ. పోయెఁ బోయె నటంచుఁ బొడిచినట్లు నటించి
బంట్లు గంతులువైచి బయలఁబడిరి
కటకటాల్ విఱిచె రాకాసి మొసలి యని
చుట్టు మూగినవారు చోద్యపడిరి
నివ్వెఱపాటుతో నిట్టూర్పు నిగిడించి
శారద కన్నీరు జాఱవిడిచె
ననుకొన్నదంతయు నాయె దైవముమాయ
కడవరానిది యని నుడివె భర్త

గీ. పిల్లవాఁడట! మొసలియై పెంచినట్టి
తాతఁ గొనిపోయెనట! మితి తప్పదనుచు
మూఁకలై యచ్చటచ్చటఁ బురవనితలు
చెప్పుకొనసాగి రిదియెంత చిత్రమనుచు. ౩౪౮

ఉ. బాలకుఁడేమి నక్రమయి బ్రాహ్మణు నీడ్చుకపోవుటేమి! యే
కాలమునన్ వినంబడదు కాంచనగర్భుని వ్రాత తప్పునే!
మూలను దాఁగి మృత్యువును మోనముచేయ నెవండు నేర్చుఁదాఁ
గూలునె యాయువుండినను గోట్లలుచేసిన సంగరంబునన్. ౩౪౯

సీ. తప్పించుకొనియెనే తక్షకదంష్ట్రాగ్నిఁ
దాఁ బరీక్షిత్తు సౌధమున డాఁగి
పాండుఁడు మును శాపభయమెఱింగియు మాద్రిఁ
బట్టి మృత్యువుచేతఁ బట్టువడఁడె

అర్జనుం డరిలోక దుర్జయుండయ్యుఁ దా
నభిమన్యుచావున కడ్డ పడెనె
బలరామకృష్ణులు భగవదంశజులయ్యు
యదుకుమారుల మృతి నాపఁగనిరె

గీ. బలము గలిగిన నూటికి బలఁగమున్న
కనుగలిగియున్నఁ దగిన రక్షణముఁ గనిన
మి_త్తి కనుఁ బ్రామ నెవనికి స_త్తగలదు
శంకరుఁడుగూడ మృత్యువు కింకరుండె. 3౫౦

గీ. అనుచుఁ బండితవరు లంతనంత నాడ
దంపతులు శిరములను వంచి కొంపచేరి
వారు వీరును గూడి యా వా_ర్తలడుగఁ
దాతఁ దలపోసి శారద తాపమొంది. 3౫౧

క. పాపము పుణ్యమ్మనుకొనుఁ
గాపాడును గంటిరెప్ప గతి నెప్పుడు నా
కోపిక లేదని కుయ్యిడ
నేఁ బాపముఁ గట్టికొంటి నిలుపక యింటన్. 3౫౨

ఆ. ఇంట నిలువనీక యీడ్చుక వచ్చితి
నింటనున్న మొసలి పంటఁ బడునె
బ్రహ్మహత్య కేను బాలైతి నక్కటా!
యనుచుఁ జింతనొంద ననియె భ_ర్త. 3౫3

ఉ. ఎంతటి వెఱ్ఱిదానవయి యింట నెయుండినఁ జావకుండు నే;
కాంతరో! మృత్యువే శిశువు కాయముఁ గ్రైకొని నీడపోలిక_
జెంతనె పొంచియుండ ననుఁ జేరెను బాపమటంచుఁ గుందెదో!
వంతఁదొలంగు తాత యిఁకవచ్చునె; చచ్చినవాఁడు నెచ్చెలీ! 3౫౪

ఉ. యంత్రముఁ ద్రిప్పినట్లు హృదయమ్మున నీశ్వరుఁడుండి యర్థమా
భ్రాంతినిఁ గూర్చి యేరికి శుభం బశుభంబును గూర్చుచుండు వి
శ్రాంతిని బొందు మేటికి విచారము కారణమీవుగావు వే
దాంతముఁ జెప్పితీరనకు తథ్యము నాపలు కాదరింపుమా! ౩౫౫

ఉ. కూలుట యేమి పత్ని! మనకొంపకు విప్రుఁడు వచ్చుటేమి! నీ
జాలికి హేతువేమి! చనఁజాలక యియ్యెడ నిల్చుటేమి! పై
బాలకుఁడేమి! యవ్వఁగొని వచ్చుటయేమి! తదాది తాతయే
లాలనచేయుటేమి! తుదిలాగుకపోవుటయేమి! నక్రమై. ౩౫౬

క. జననము మరణము రెండును
దినమును రాత్రియును బోలె తిరుగుచునుండున్
మనియెను జాలదినమ్ములు
చనియెను సన్మార్గమందుఁ జచ్చెను గాశిన్. ౩౫౭

క. కాశీమరణము ముక్తిని
వాసము స్వర్గాపవర్గ భాగీరథి యీ
మాసము నయనము మంచివి
యీశునికడఁజేరుఁ దాత యేటికి వగవన్. ౩౫౮

క. కావున మిత్తికి హేతువు
గావీవిఁక వగవవలదు కాలవశమునన్
బోవక నిలువఁగ వశమే!
దేవాదులకైన మనము తెగక నిలుతుమే! ౩౫౯

క. అని తెలిపి యస్థులనుగొని
ఘనముగఁ బరలోకక్రియలు కావించి వెసం
జని సేతువుఁగని నతులై
మునిఁగి గంగఁ గలిపి చనిరి పొన్నూరునకై. ౩౬౦

క. నవమాసమ్ములు నిండిన
ధవళరుచుల మించు నొక్క తనయుఁ గని యా
ధవళాక్షి భర్తతోడుగ
శివసాయుజ్యమును గాంచెఁ జిరకాలమునన్. ౩౬౧

ఆ. తాతపేరు మఱువ ధర్మము గాదని
కలసి వచ్చునంచుఁ గలయఁ బలికి
రామలింగమనుచు నామకరణమిడి
పెంచిరతని వంశ వృక్షమయ్యె. ౩౬౨

క. ఈకథఁ జదివిన వినినను
శ్రీకంఠుం డాయువొసఁగు సిరులనొసంగున్
సోఁక దపమృత్యు వెన్నఁడు
నాకేశునిఁ జేరు సురల నడుమ వసించున్. ౩౬౩

## కుబ్జా పూర్వవృత్తాంతము.

ఉ. వారక కంసు దాసికిఁ ద్రివక్రకుఁ గుబ్జకు సారసాక్షునిం
గోరఁగవచ్చునే! యతఁడు కూడదునాక రమింప వచ్చునే!
వారిధి మేరఁదప్ప నిఁక వాహినులం దలపోయనేల భూ
భారముఁ బాపు తానె చెడువర్తనఁ గైకొన లాఁతులోర్తురే! ౩౬౪

క. మారవికారమొ! ధర్మవి
చారమొ! కలపమ్ములిడిన సౌహార్దమొ! యా
నారిని జేపట్టుటకుం
గారణ మేమనిన గురుఁడు కరుణాన్వితుఁడై. ౩౬౫

ఆ. కలదు పూర్వగాథ కంసారి కుబ్జను
వలచునొక్కొ! భక్తి వలనఁ గాక
భక్తి పాశమందు బద్ధుఁడై యేలాటి
దుష్కరములనైనఁ దొలఁగ లేఁడు. ౩౬౬

క. సరయూతటిని నయోధ్యా
పురవర మిక్ష్వాకు వంశ భూపాలయమై
సిరి కిరవై యమరావతి
సరియై కరి హయ భటాది సైన్యాన్వితమై. ౩౬౭

క. ధరణీసతి గ్రైవేయము
కరణిం జెలువారు నట నగడ్త జలధితోఁ
బురుడై పురికిని మేఖల
సరణిం దనరారు శత్రుజన దుర్గమమై. ౩౬౮

క. కోటలఁ బేటలఁ దోఁటల
బాటల నూటలను బుష్పవాటుల నీకై
తేఁటుల పాటల బోటుల
నీటుల మాటలను గీత నృత్తాదులచే. ౩౬౯

క. పంచేంద్రియ సంతర్పిత
పంచాస్త్ర నివాసమగుచుఁ బరిపంథులకుం
బంచతకుఁ గారణమ్మై
పంచజన మనోజ్ఞమగుచు భాసుర మగుచున్. ౩౭౦

క. సప్తాశ్వ కుల వతంసులు
సప్తాంగములొప్ప సప్త సంతానములన్
సప్తార్చిఁ గొల్వ ముక్తిద
సప్తపుర వరాద్యమగుచు సరిలే కలరున్. ౩౭౧

చ. గురుకులవాసమున్ సలిపి కోవిదులై విజితేంద్రియాఢ్యులై
పరహితకారులై సతత పావక సేవక భద్రమూర్తులై
పరమ తపస్వులై వినయ భాస్వరులై ప్రతివాది జేతలై
పురమున భూసురుల్ నిగమ భూధరముల్ చరియింతు రెంతయున్
౩౭౨

ఉ. దెప్పరు మేలుచేసి గురు దేవ మహీసుర భక్తి తత్పరుల్
తప్ప రొకప్పు డాడి పరదారల నొప్పరు యాచకావళిం
ద్రిప్పరు పోరిలో మొగముఁ ద్రిప్పరు కల్లలు పిల్లవాండ్రకేఁ
జెప్పరు నీతిశాస్త్రముల నెప్పరు లప్పురి రాకుమారకుల్. 323

క. దానాధ్యయన యజనముల
మానక వాణిజ్యవృత్తి మణి కనకాదుల్
గోనెలకుఁ బోసి వైశ్యులు
జ్ఞానము విజ్ఞానమెఱిఁగి క్రాలుదు రచటన్. 324

క. ద్విజ శుశ్రూషా పరులై
నిజమే పల్కుచును బరుల నిందింపక యే
గజిబిజియు లేక శూద్రులు
విజయాంకముఁ గొంద్రు ధాన్య విభవము పేర్మిన్. 325

గీ. జంత్రముల గాత్రములఁ గామ తంత్రములఁ బ్ర
వీణలై వీణలను దాల్చి విరులు దుఱిమి
వారకాంతలు రతిరాజ వారువములు
వీధి తిన్నెలఁ గొలువుంద్రు విటులు వొగడ. 326

సీ. ఖండపరశుని విల్లు రెండుచేసిన గండు
పరశురామ ఘన ప్రభంజనుండు
పాథోధి బంధించి బాటఁజేసిన మేటి
గోటితో దుందుభి మీటిన బలి
వాలి నొక్కమ్మునఁ గూలనేసిన బంటు
కొండెకోతుల నేలుకొన్న దంట
దశకంఠు కంఠముల్ దఱిగిన జయశాలి
శూలి సన్నుతిఁగన్న మేలుచేంబు

గీ. ఏక పత్నీవ్రతుండు లోకైక విభుఁడు
నీతిఁదప్పని నేత విఖ్యాత దాత
ఆశ్రితావనదక్షుఁడు నా హితాగ్ని
రామవిభుఁ డప్పురంబేలు రాజవరుఁడు. ౩౭౭

క. రెండమ్మ్ల లెక్కఁబెట్టఁడు
రెండాడఁడు మాటలెప్పుడు రెండేకముగా
భండనములఁ గీలింపఁడు
రెండును బదిరెండు చేసి రెట్టించి యిడున్. ౩౭౮

క. స్మితభాషియు మితభాషియు
హితభాషియుఁ బూర్వభాషి యిచ్చేడుతటి నం
చింత వేషుఁడు గతదోషుఁడు
శ్రితపోషకుఁడంద్రు బుధులు శ్రీరాఘవునిన్. ౩౭౯

సీ. పరమేష్ఠి తుల్యుఁడు బ్రహ్మఋషి వసిష్ఠుఁ
డలఘు తపోనిధి కులగురుండు
భరతుండు భక్తి సంభరితుండు స్తవనీయ
చరితుండు యువరాజు నిరతిశయుఁడు
ఇంద్రియ జేతయై యింద్రజిజ్జేతయై
నుతిగన్న సౌమిత్రి జితవిరోధి
పౌలోమి పురిలోడు త్రైలోక్య సుందరి
సహధర్మచారిణి జనక పుత్రి

గీ. ఏడుదీవులు పొలిమేర లేలుబడికి
నరదమో పుష్పకమ్ము వైహాయసమ్ము
రక్షణీయులు సురలు భూసురులు దొరలు
పట్టబంధురుఁడైన భూవల్లభునకు. ౩౮౦

సీ. యోధ దుస్సాధ మయోధ్యా పురంబు నా
ర్థక నామధేయంబు రాజధాని
కాశ్యప జాబాలి కాత్యాయనాదులు
ఋత్విజుల్ త్రేతాగ్ని వ్రేల్చువారు
మంత్రులు ఘనులు సుమంత్రాదు లెనమండ్రు
మంతనమ్ముల రాజ్యతంత్ర విదులు
అంబుధి లంఘించి యక్షయుఁ బరిమార్చి
లంకఁ గాల్చిన వాఁడు కింకరుండు

గీ. కీశనాథుఁడు రాక్షసాధీశుఁ డొకట
ఛత్ర చామరములు తాల్చు మిత్రగణము
జాంబవంతుఁడు వాకిటఁ జాలువాఁడు
రామచంద్రుఁడు పాలించు రాష్ట్రమందు. ౩౮౧

సీ. క్రతుభుజు లరుదెంచు కాళ్ళ రాపిళ్ళచే
దివికి భువికి బాట తేటపడియె
తొలకరినుండియు నెల మూఁడువానలు
వర్షింపఁగా ధాత్రి వసుధయయ్యె
రత్నాలు పండించి రామార్పణము చేసి
అప్పుల పాలాయె నబ్ధిరాజు
శైలాధిపతులెల్ల సామంతరాజులై
కరి హిరణ్యాదులఁ గాన్కలిడిరి

గీ. రాగమునఁ గొంత కొంత పరాక్రమమున
ధరణిఁ గల రాజవరులెల్ల దాసులైరి
ఈతిబాధలు వో సుఖియించె జగము
కోసలం బేల దశరథు కూర్మిపట్టి. ౩౮౨

చ. చదువనివారు నాస్తికులు సంతతిలేక తపించువారు స
మ్ముదమునఁ దల్లిదండ్రులకు మ్రొక్కనివారు స్వధర్మవృత్తులన్
వదలినవారు తస్కరులు వంచకులార్తులు ధూర్తులాఁకటన్
సొదఁగొనువారు సంపదల సొంపు వహింపని వారు లేరటన్. ౩౭౩

సీ. తల్లిదండ్రుల ముందు తనయులు పోరాదు
పోరాదు వెన్కకుఁ బోరిలోన
వైధవ్యమున సతుల్ వాపోవఁగా రాదు
కారాదు సన్న్యాసి జ్ఞానిగాక
నాస్తియంచెందు గృహస్థు పల్కఁగరాదు
పల్కరా దన్నృతము పై విధులను
దేవతార్చన గాక తినరాదు భక్తము
భక్తిరహితుఁడయి బ్రదుకరాదు

గీ. వ్యాధులాధులు రారాదు వసుమతికిని
జీవహింసను బొట్టకై చేయరాదు
యెట్టి పగతుని శరణన్నఁ గొట్టరాదు
రామ భూమీశు నాజ్ఞచే రాష్ట్రమందు. ౩౭౪

సీ. కుడివైపు గద్దియఁ గులగురుండు వసింపఁ
బండితుల్ వేదాంత భాషలాడ
సోదరుల్ డాపట నాదరమ్మునఁ గొల్వ
పావని సేవింపఁ బాదపీఠి
మంత్రులు చేమోడ్చి మనవులు వినిపింప
సామంత రాజులు సాగిమ్రొక్క
ప్రాడ్వివాకులు చూప వ్యాజ్యెపు పత్రముల్
దండనాయకు లాజ్ఞ తల ధరింప

గీ. గణిక లాడఁగ వంది మాగధులు పొగడ
అర్థిజన చాతక నవాంబు దాగమమన
సాంద్ర తారల సంపూర్ణ చంద్రు భాతి
రామచంద్రుఁడు కొలువుండె రత్నపీఠి. ३०५

క. పింగళయను గణికామణి
సంగీతము సేయ రాజ సభకుం దనవా
రిం గలసి పోయి యారఘు
పుంగవు వాల్గంటఁ జూచి మోహాతుర యై. ३०६

ఆ. ఆడి పాడి మ్రొక్కి హారాంబరాదులఁ
బడసి యింటి కేగి పడకఁజేరి
రామ విభుని పొందు సామాన్యమా! యని
చింత పైకొనం గృశింప సాగె. ३०७

ఉ. శ్యామల కోమలాంగమునఁ జక్కదనమ్ముల కిక్కయైన శ్రీ
రామునిఁ జూచి మోహమున రాత్రి పవల్ కృశియించుచుంటినా
కామము తీరుటెట్లు పరకామిని నంటని సువ్రతుండు తా
నీమము వాయునే! గణిక నేస్తము చేయునె! మేలు డాయునే!
३०८

క. మదనుఁడు కుసుమాస్త్రమ్ములఁ
బదనెక్కించంగ సాగెఁ బరులను భ్రమలోఁ
గుదియించు వేశ్యనయ్యును
మది దిటచెడి రామచంద్ర మహిపు వలచితిన్. ३०९

ఉ. మంత్రులుపండితుల్ గురులు మాన్యులు తమ్ములు నాల్గుజాములున్
మంతనమాడుచుండ్రు నిశ మైథిలితోఁ బవళించియుండు నా
చింతను జెప్పికో వెఱవు సెందదు డెందము కుందువాపి యీ
వంతను బాపువా రెవరు; వారల నేఱుఁ దరింపఁ గోరితిన్. ३१०

ఉ. వేశ్యను గాన నన్నుఁ బృథివీవరుఁ డంటిన నంటవచ్చు నా
దాస్యము నొప్పవచ్చు దురితంబను సంశయముండ; దబ్బెనా!
కాశ్యపిలోన నాకు సరికాంతలు గల్గరు; కాక తప్పెనా!
హాస్యము సేయువా రతివలవ్వాల నా విధియెట్లొ యట్లగున్. ౩౯-౧

చ. సమయము చిక్కుటెట్లు నృపు సన్నిధికేఁ జనుటెట్లు వారిక
క్రమ మెఱిఁగించు టెట్లు కృపఁగాంచునొ నేరము లెంచి త్రుంచునో!
భ్రమరము చంపకమ్ముపయి వ్రాలినయట్లగు నేను! యేటికీ
భ్రమ; యుడిగింతమన్న నరవల్లభుఁ డెల్లడఁ దోఁచి వేచెడిన్. ౩౯-౨

ఉ. మిక్కుటమైన భ్రాంతిని రమింపఁగ వచ్చిన రావణానుజన్
ముక్కును జెక్కి వీనులను మోడొనరించిన నేస్తకాఁడు నా
నుక్కువ దక్కనిచ్చునె! సుమంబు సమంబగు మేను డెందమో!
యుక్కున కెక్కుడైనయటు లున్నది యెన్నఁడు తీరుఁ గోరికల్. ౩౯-౩

సీ. కసిదీర బిగియారఁ గౌఁగిలించినఁ గాని
దేహ సంతాపము తీరి పోదు
చుఱుకంట నధరము చూఱలాడినఁ గాని
వాడిన వదనపుఁ గీడు సెడదు
ప్రక్కలోఁ జేరి నున్ జెక్కునొక్కినఁగాని
మదిలోని విరహాగ్ని మాటువడదు
చౌసీతి బంధాల సదమదమై కాక
చిత్తజుం డాజ్ఞలోఁ జిక్కు వడఁడు

గీ. అర్థహీనుని వాంఛితార్థాళి యట్లు
రిత్తకోర్కుల భ్రమఁ జెంది వత్తినైతి
దాశరథియెడ! నేనెడ! దాస్యమెడ!
నక్కకా యెక్కఁదగినది నాకపథము. ౩౯-౪

సీ. నిగనిగల్ తులకించు నీలంపు నెమ్మేను
కన్ను లబ్జములను గారవించు
నెగుభుజమ్ములు వీను లెక్కసక్కెములాడు
నధరము బింబము ననుకరించు
హస్తి హస్తముఁబోలు నాజాను బాహువు
లరుణాబ్జముల నేలు హస్తయుగము
యూరువుల్ సారె నన్వారించుఁ బటువులై
మధ్యము మృగరాజు మదమడంచు

తే. ఫాలము విశాల మంఘ్రులు పల్లవములు
నాసికము చంపకము మాఱు వేసమగును
జార! సర్వాంగ సుందరుండైన విభుని
నేలుకొను సీత సౌభాగ్య మెన్నదగునె! ౩౯౫

ఉ. యామినులందు వెన్నెలల నాడుచుఁ బాడుచుఁ గూడు చోడుచుం
గామితముల్ ఫలింపఁ గలకాలము కౌఁగిట గుస్తరింపఁగా
నేమి తపంబు చేసెనో! మహీసుత పూర్వభవమ్మునందు శ్రీ
రాముని భర్తగాఁబడసి ప్రాభవముంగనె నిస్సమానయై. ౩౯౬

ఉ. అక్కట దిక్కుమాలి వెలయాలి కులమ్మునఁ బుట్టి రాజుతో
మిక్కుటమైన భ్రాంతిని రమింపఁగఁ గోరిన నబ్బునేర్చునే!
యక్కర మోదుగుం బెనిచి యాశకుఁ జూతఫలంబు గోరినం
జిక్కునె! తొల్లి పుట్టువునఁ జేసిన సంచిత మిట్టు లుండఁగన్. ౩౯౭

క. దినదినమా గణికామణి
ఘనతర మోహాబ్ధి నిట్లు కాలముఁ బుచ్చన్
జనఁగా యామని గ్రీష్మము
చనుదెంచెను సకలభూత సంత్రాసకమై. ౩౯౮

సీ. తరణి తరుణుఁడై ప్రతాపంబుఁ జూపించె
లోపించె బావులలో జలంబు
వంతు బిందెల తోడ వాదాడి రతివలు
రతిరాజు నుంత విశ్రాంతిఁ గాంచె
పడమటి వడగాలి ప్రజకు దుస్సహమాయె
సహాముల మృగతృష్ణ లతిశయించె
జలచరంబులు వేడి కలికి లోతున డాఁగె
మడువులఁ గొక్కెరల్ మసలెఁ దఱచు.

గీ. కరికిరిలులాయములు నీటికై తపించెఁ
గప్ప కెంౘడికిఁ జేపకు ముప్పు గలిగె
పాంథుల కెడారులను ప్రాణభయము తోఁచెఁ
జాతకములకు దప్పి విస్తారమయ్యె.

సీ. మల్లుకోకను గట్టి మల్లెపూవులు చుట్టి
మంచిగంధముఁ బూసె మందయాన
నవరసాల రసాలు నవలతో జతగూడి
నమలె వెన్నెలరేల నవరసికుఁడు
చెఱకుతుంటను రెండు చేసి తల్లి యొసంగఁ
బీల్చి పిప్పినిఁ జేసెఁ బిల్లవాఁడు
వృద్ధులు తొలిజాము ప్రొద్దెక్కులోపలఁ
దూలి రాకటిబాధఁ తాళలేక

గీ. క్రొత్తకుండలు కూజాలు దుత్తలాది
ఆమమున వ్రేల్చి కుమ్మరి యమ్మఁదొడఁగె
చీమలెల్లెడ మిగుల విశేషమయ్యె
గువ్వలకు నీరుపోసిరి గుంటలందు.

సీ. తపనుండు వేఁప సంతప్తయై యుడుకెక్కి
దుమ్మెత్తిపోసె క్ష్మా ధూర్తయగుచు
ఉష్ణకరుఁడు మండి యుర్విఁ గాల్చెడు భంగి
దావాగ్ని నడవులు తగులఁబడియె
నీరసమ్మున నదుల్ నిలిచె నంతట నంతఁ
బ్రాణనాథుని గూడఁ బాఱలేక
వినతాకుమారుతో నినునకుఁ జెప్పింప
గ్రద్దలు తిరుగాడె గగనవీధి

తే. బీటవాఱుచు నిక్కాక బెండువడిన
పంటపలఁతికి బలమెక్కఁ బాటిమన్ను
తోలసాగిరి హాలికుల్ వేలబండ్లు
ఓషధీశుఁడు వెజ్జయై యుడుకు మాన్ప. ౪౦౧

సీ. విరితూపు లడుగంటె వెన్నిచ్చె సేనాని
కేతనము కిరాతుచేతఁబడియె
చెఱకువిల్ తుంపులై చేగాన్గలో జాఱెఁ
దలిరాకు నునుబాకు తళుకు మాసె
మలయమారుత మంత్రి చిలువల పాలాయె
రాజయక్ష్మమున రేరాజు క్రుంగె
కోకిలయను వంది మూకభావము దాల్చె
రాచిల్క తేజి తోఁటలకుఁ బాఱె

తే. ఖరకరునకోడి బలమిట్లు కలఁతపడిన
మల్లె విరిమొగ్గ గదఁదాల్చి మగలఁ దాఁకి
మదవతుల సాయమున నెదల్ ప్రిదులవైచి
కువలయము గెల్చె వలరాజు శివ విజేత. ౪౦౨

క. చలిపందిరులను బెట్టిరి
కలపమ్ములలంది విసనకఱ్ఱల తోడన్
ఫలములిడిరి భూసురులకుఁ
గలవారలు స్వర్గవాంఛ గలవారగుచున్. ౪౦౩

క. ఎడనీరు ద్రావి పానక
మెడనెడఁ గ్రోలుచును మేడలెక్కిరి భోగుల్
పడఁతులతోఁ దెలనాకుల
మడుపులతో మరులుగొలుపు మాటలతోడన్. ౪౦౪

క. తాటి చిఱుముంజె లూటిరి
వేటాడిరి నీటిపట్లు వేచి వనాటుల్
నాటకములు హరికథలున్
దాటాకుల పందిరులను దఱచై యొప్పెన్. ౪౦౫

క. తోటలకు నీరుగట్టిరి
మోటల యంత్రముల నేతములతోఁ గాపుల్
పాటలు పాడుచు బోటులు
రాటములం ద్రిప్పఁగనిరి రమణీయముగన్. ౪౦౬

క. మిద్దెలు మేడలు దిద్దిరి
సుద్దను సున్నమున నూత్నశోభ వహింపన్
నిద్దురఁగాంచి రహస్సులఁ
బెద్దలు పిన్నలును గాడ్పువీవఁ జకితులై. ౪౦౭

క. సప్తాహ సహస్రమ్ములఁ
దృప్తింగనె భూతధాత్రి తిమిరారినుడిన్
సప్తాశ్వములను ధోరిత
ప్రాప్తిని నడిపించె వాగెలాగి యరుణుఁడున్. ౪౦౮

సీ. వట్టివేళ్ళను గట్టి వాకిండ్లఁ గిటికీలఁ
జన్నీళ్ళ యంత్రముల్ జల్లుచుండ
షడ్రసోపేత భోజనమునఁ దృప్తుఁడై
శ్రీరామవిభుఁడు దాసికలు గొల్వ
చంద్రశాల వసింపఁ జందనమ్ము సలంది
తాంబూలమిచ్చి సీతావధూటి
సరయూతటమ్మునఁ జల్లగా నుండునో!
జలములపై వచ్చు చల్లగాలి

తే. ఘన తమాల మహీరుహ వనము పొంత
శిబిరమునఁ గొన్నినాళ్ళు వసించి యున్న
వేసవిని గాసిపడరని విన్నవింప
వాంఛితముఁ గాంచి రఘువంశ వల్లభుండు. ౪౦౯

క. జలకేళిని సవరింపఁగ
జలజాక్షీ! వాంఛగలదొ! సలుపుద మటులే
యలయకుమని మంత్రులతో
జలజాక్షుం డాజ్ఞ నొసఁగ సరయువు పొంతన్. ౪౧౦

సీ. కటకటాల్ తొలఁగించి కంటకమ్ముల నూడ్చి
చుట్టు నామడమేర దిట్టపఱచి
పొడయెండ గనరాని భూరుహమ్ముల నీడ
జలబిందువులు చిందు సైకతమున
తాటియాకులచేత దడులను గట్టించి
చల్లని పన్నీరు చల్లి తడిపి
మేలుక ట్లమరించి పూలదండలు గట్టి
మెఱుపు దీపములుంచు వెరవులరసి

తే. శయ్య లాసనములు భోజ్య సముదయములు
పరిమళద్రవ్యములు మేలి వలువలుఁదగు
వివిధ పరికరములఁ జేర్చి విన్నవింప
భరతుపై రాజకార్య సంభార ముంచి. ౪౧౧

తే. అగ్నిహోత్రాలు వేల్వ సుయజ్ఞు నునిచి
తల్లులకు మ్రొక్కి దీవన తల ధరించి
పురము సౌమిత్రి రక్షణఁ దిరముచేసి
పిన్నతమ్ముని సేనాంగ మెన్న నునిచి. ౪౧౨

సీ. మద దంతిపై నెక్కి మంత్రులు సేవింపఁ
బరిమిత సేనతో నరిగె విభుఁడు
చేటీసహస్రము సేవింప భూపుత్రి
యందలమెక్కె నానందముగను
పరిచారకులు వస్తు భార వాహకులును
దాసీ సహస్రముల్ తఱలె నొకట
వందులు మాగధుల్ వైతాళికులును వి
దూషకుల్ చనిరి సంతోషమునను

తే. నాగవాసము వోయెను నటులఁ గూడి
గానవిద్యా విశారదుల్ ఘనులు చనిరి
ద్విరదముల నరదముల నెక్కి దొరలు చనిరి
ఆంజనేయుఁడు గదఁదాల్చి యరిగె వెంట. ౪౧౩

క. ఈరీతిని బరివారము
తో రఘుపతి నదికి నరిగి తోయజముఖితోఁ
జేరి తమ విడిదికిని బరి
వారము నందంద నిల్వఁబని చెఁ దగుగతిఁ. ౪౧౪

సీ. వడగాలి తరఁగల నుడుకాఱ వడపోసి
యర్పించె సప్పతి యవనిపతికి
అరవిచ్చు చిఱుమల్లె విరుల నెత్తావుల
కానుకల సేవించె గంధవహుఁడు
తత తమాలాతపత్రమ్ములు ధరియించి
వనదేవతలు కొల్చి రినకులేశు
మల్లికా మంటప మధ్య సైకతవేది
సరయువు పూపాన్పు చక్కఁజేసె

గీ. జక్కవలు మక్కువలు సూపె టెక్కలార్చి
సారసాంగన మద్దెలఁ జేరికొట్టఁ
దేఁటివిరిఁబోఁడి తిన్నగాఁ బాటవాడ
ఆడురాయంచ నాట్యము లాడి కొలిచె. ౪౧౫

సీ. వైతాళికులు నిద్రఁబాపిరి నుతియించి
వందిమాగధులు కైవార మిడిరి
పండితుల్ శాస్త్రార్థ వాదముల్ సలిపిరి
అర్థులు వేడి కృతార్థులైరి
సంగీతములఁ దృప్తి సలిపిరి గాయకుల్
నాగవాసమ్ములు నాట్యమాడె
మృగ పక్షి రుతముల నగ హాస్యగాండ్రు వి
దూషకుల్ కొల్చిరి వేషధరులు

గీ. జానకినిఁగూడి సైకత స్థలములందు
శీత మారుత పోత సంసేవ్యుఁ డగుచు
పవలు రాతిరి వేసవి తవులు గనక
కాలమును బుచ్చె వసుమతీ పాలకుండు. ౪౧౬

క. పింగళి నిత్యము రాఘవు
నిం గనుచును దండమిడుచు నిపుణతతోడన్
సంగీత నాట్యములఁ దన
సంగతి విశదపఱ రామచంద్రుని గొలిచెన్. ౪౧౭

క. ఉల్లిపొరవంటి తెల్లని
వల్లియ బిగియించి నగల వర్జించి మనో
వల్లభునిగూడి జానకి
యుల్లాసముతోడ మడుఁగు నొయ్యనఁ జేరెన్. ౪౧౮

సీ. సౌవర్ణ నాళవ త్సౌగంధికములు నా
బాహువుల్ చాచిన పాణులలర
శైవాలయుత పంకజాతము పోలికఁ
బెన్నెఱుల్ వడి మోము వన్నెగులుక
జమ్మేటి పులినతలమ్మును బురుడింప
తల ముంచినపుడు నితంబ తలము
పూవుతోడ ననంటి బోదె జంటను బోలఁ
జరణ మూరులు నొక్క సమతఁ దేల

తే. తరఁగల మెఱుంగుఁ గడకంటి ధవళ రుచులు
పరిచయము సేయ లోయీత బారయీత
రాజహంస పిరుంద మరాళి వోలె
రామచంద్రునితో సీదె రాజవదన. ౪౧౯

తే. పెన్నెఱుల కాంతి యమునను జిన్నపుచ్చి
దేహకాంతుల జంబూనదిని హసించి
పాణి చరణోదరస్ఫూర్తి శోణఁ దెగడి
సరయువొప్పారె వై దేహి పరిచయమున. ౪౨౦

చ. సురుచి చిరత్న రత్నరుచి శోభిలు నా సరయూస్రవంతిపై
మరులున సాగరుండు నిజ మందిరమందు వసింప భర్తతో
నిరుపమ దివ్యదేహయయి నిమ్నగ క్రీడ నొనర్చుఁబోల్కి నా
సరసిజనేత్ర యీదె గుణసాగరుఁడైన నిజేశు మోసలన్. ౪౨౧

క. తడిసిన చేలము మేనికిఁ
దొడవై నునుతొడల బెడఁగు తోరఁపుఁ గుచముల్
పిడికెఁడు కౌను బంగరు
నొడిసెడు నెమ్మేను సీత కొప్పు ఘటించెన్. ౪౨౨

చ. తడిసిన చేల మంటిన నితంబము పెందొడ లారు పార్శ్వముల్
పిడికెఁడుకౌను కంచుకము వీడినచన్గవ బాహుమూలముల్
ముడివిడి వ్రేలు పెన్నెఱులు మోము విలాసము వాలుఁగన్నులున్
దడఁబడఁ జూచు రాఘవునిఁ దారసిలెన్ రతిరాజు తెంపునన్.
౪౨౩

క. ఈతాడి యాడి యలసిన
సీతాసతి పతి భుజంబు చేయూఁతగ సం
ప్రీతి నిలువ నునుజెక్కులఁ
జేతఁ దుడిచి యాదరించి చెలితో ననియెన్. ౪౨౪

తే. అప్పుల మునింగి జీవన మ్మల్పమైన
శఫరి యిదె చూడు విజిగీష విఫలమగుట
మీనలోచన నినుఁగాంచి మిట్టిపడెను
నంగజుని కేతనమ్మైన పొంగువలన. ౪౨౫

తే. జక్కవలజంట కుచముల నిక్కిచూచు
నున్నతిని, గాంతిఁ దముమించి యున్నవనియొ;
రంగు బంగరు వన్నెఁ దుఱంగలించు
నొండుజత నీటఁ దిరుగాడుచుండె ననియొ!. ౪౨౬

గీ. బాహువులకోడి నాళము వాడఁబాఱఁ
గోకనదమిదె నీహస్తకోమలతకు
జోడుగా కడుగుచట్టి యందీఁకుగనమిఁ
బంకమున వ్రాలెఁ దొల్లింటి బింకముడిగి. ౪౨౭

గీ. యానమునకోడి యాడురాయంచ యదిగో!
అంబుజ కుడుంగముల లజ్జనంది తూఱె
నబ్జమని తేఁటి నీమోము నాసఁజేరి
నాసఁగని చంపకమ్మని దూసికొనియె. ౪౨౮

గీ. వరుణుఁడను రాజు పర్జన్యు ప్రాపుఁ గాంచి
మంటలై మండు తపనుని మదమడంప
దండు వెడలఁగ సమకూర్చు దంతులనఁగఁ
గమఠములు వేలు కనుమింతుఁ గమలనయన!. ౪౨౯

క. జలకేళి సలిపి యలసిన
జలజాక్షిని గారవించి సరసోక్తులనా
యెలనాగ ననిపి రఘుపతి
కొలువున కేతెంచి యర్థికోటిం దనిపెన్. ౪౩౦

ఆ. ఆరగించి డస్సి యవనిజయును రాముఁ
డచట వేఱువేఱ నమరియున్న
చప్పరములఁ దమదు శయ్యలపైఁ జేరి
కన్నుమోడ్చి నిదురఁ గాంచిన తఱి. ౪౩౧

క. మారుని కాకల కోర్వక
వారాంగన తెంపుచేసి వసుధావరు నే
నీరేయిఁ గాంచి నామది
కోరిక వివరింతు ననుచుఁ గుతుక మెలర్పన్. ౪౩౨

ఉ. వేదనచేత నిద్రచెడి వెన్నెల తిన్నని కాక కోర్వకా
పైదలి మెల్లగా నృప నివాసము లోనికిఁ బోయి నిద్దురన్
భూదయితుండు కన్నులను మోడ్చినవాఁడని యెంచి యోడుచుం
బాదములంటి ముద్దుఁగొని పాణితలమ్ములనొత్తె మెత్తగన్. ౪౩౩

క. పాణితల స్పర్శమ్మున
మానవపతి తెలిసి నిదురమత్తునఁ దన పూఁ
బోణి యని తలఁచి ప్రేమము
రాణింపఁగ ననియె మరల రాజుకొనంగన్. ౪౩౪

క. సీతా వచ్చితివా! నీ
చేతము ప్రేమాలయమ్ము చెలియా! యిటురా
లాతివె పాదమ్ములకడ
నాతీ నిలచితివి కలవె నా నేరమ్ముల్. ౪౩౫

ఉ. ఎప్పుడు వచ్చితీవు తరళేక్షణ నిద్దురమత్తుగొన్న నా
తప్పు సహింపు రమ్మిటులు తల్పమునన్ వసియించి తేనియల్
చిప్పిలు ముద్దుపల్కులు వచింపక పెంపక నీ దయారసం
బొప్పులకుప్ప! యేల పుయిలోడెదు పాదతలమ్ము లంటుచున్. ౪౩౬

క. జలకేళిని బడలితివని
తలఁచితి నీరాత్రి నీవు తల్పమ్మునకున్
వెలియాటను దయతోనను
గొలువఁగ వచ్చితివె! నిదురఁగూడక తరుణీ!. ౪౩౭

క. అని తనుఁ బిలిచెడి యా రఘు
తనయునకుం గేలుమోడ్చి ధరణీశ్వర! నా
మనవిని గైకొను పింగళ
యను వేశ్యను గాను సీత నంగజరూపా!. ౪౩౮

క. ఆడఁగ వచ్చితి నీసభ
నీడేరిన ప్రాయమందు నింతవరకు నీ
తోడిద లోకమ్మనుకొని
వేడుకలకుఁ బోక మదనవేదన పాలై. ౪౩౯

క. కన్నెతికపుఁ బ్రాయమ్మున
నిన్నేఁ గనుఁగొన్నదాది నీపై భ్రాంతిం
గన్నులను నిదురఁగానక
యన్నము రుచిలేక చిక్కి యసురుసు రయితిన్. ౪౪౦

ఆ. జవ్వనమ్ము నీకె జన్నె గట్టిన దాన
పరుని ముట్టినట్టి పాపమెఱుఁగ
పదములాన లోక పాలుర పై యాన
యనృతమాడ సత్యమాడు దాన. ౪౪౧

ఉ. కన్నుల విప్పిచూడు పదకంజము లొత్తెదఁ జిత్తగింపు నా
విన్నప మాలకింపు కృపవీడిన వాడిన పూవుదండనాఁ
జెన్నుఁదొఱంగి జీవితము చింతల వంతలఁ దూలిపోవ నీ
మన్ననలేక మింటికిని మంటికిఁ గాక నశించి పోయెదన్. ౪౪౨

ఉ. కామము దుస్సహంబు నినుఁగాంచినదాది మనోభవార్తిచేఁ
గామిత వస్త్రభూషలను గట్టను బెట్టను ముట్టఁబూవు లా
రామము లామనిందిరుగ రాగము పాడను నాడ నేస్తపుం
భామలతోడ మేలములు పల్కను గుల్కను జిల్క కుల్కుదున్. ౪౪౩

సీ. మేఘోదయమున నీ మేనిచాయఁ దలంచి
దుర్లభమ్మని చింతతోఁ దపింతు
కమలాకరముడాసి కంజాతములఁగోసి
కనులకు సరిపోల్చి కళవళింతు

శారదపూర్ణిమా చంద్రునిగాంచి నీ
మోమని మునిప్రేళ్ళ ముద్దుగొందు
అతసీసుమమ్ముల నార్జించి నీమేని
యట్లున్నవని కంట నద్దికొందు

తే. నీలకంఠముఁ బోషింతు నిన్నుఁదలఁచి
మరుఁడు రావణుఁడై నన్నుఁ జెఱఁ దగిల్చె
కలఁగి శరణన్నవారినిఁ గావఁ గలవు
శత్రువున కభయమిడిన క్షత్రియుఁడవు. ౪౩౪

క. పది నెలలకు సీతకుఁ జెఱ
వదలించితి పదియు రెండు వర్షములాయెన్
మదిఁబొక్కుచు మదనునిచే
సదమదమగుచుంటి రామ! సంగరభీమా! ౪౩౫

చ. అడిగిన లేదునాక వివిధార్థము లర్థులు కోరినట్లుగా
నెడపక కూర్చిపంపుట మహీధవ జన్మవ్రతంబు నీకు నీ
యడుగుల ప్రాలి వేడుకొను నంగన భంగమొనర్చి పంపఁగా
నోడఁబడ వచ్చునే! గణిక నొప్పినఁ దప్పని చెప్పవచ్చునే!. ౪౩౬

గీ. అశ్వమేధమ్మొనర్చెడి యవని విభుఁడు
తాను భోగించు వేశ్య నుద్గాత కొసఁగి
ద్రవ్యమిడి క్రమ్మఱంగొంట ధర్మనిరతి
కాన వారాంగనా నన్నుఁ గరుణఁ జూడు. ౪౩౭

గీ. శబరి యెంగిలిసేసిన స్వాదుఫలము
లారగించితివఁట భక్తి కలరి మున్ను
రాత్రి పవలును నీపాద రజముఁగోరి
కలవరించెడి నన్నేల కరుణఁ గనవు?. ౪౩౮

సీ. కీరమ్ము మృత్యువా కారమై కనుపించె
నారసమ్మయి తోఁచె సారసమ్ము
చంద్రుండు రేల నిశాచరుండయి వేచె
మలయాద్రి చిఱుగాలి మంట లొదవె
కోకిల నాపాలి కాకాసురుండయ్యెఁ
జూతము భూతమై భీతిఁ గొలిపె
శోకమ్ముఁ బెనిచె నశోకమ్ము పూచి మి
న్నాఁగపుఁబుట్ట పున్నాగమయ్యె

గీ. జక్కవలు మక్కువలు సూపి స్రుక్కఁజేసె
రాజహంసలజంట విరాళిఁ బెనిచె
తుమ్మెదలపాటచేఁ దల దిమ్ముకలిగె
మారసుకుమార! నీమీఁది మరులుచేత. ౪౪౯

క. నృత్తాదుల నినుఁ గొల్వఁగ
వత్తును గై సేసి నాగవాసముతోడన్
మెత్తవడని చిత్తముగని
యుత్తలమునఁ దిరిగివత్తు నుస్సురటంచున్. ౪౫౦

క. అర్థు లౌరు లెవ్వ రింతకు
వ్యర్థులు కాలేదు నిన్ను యాచించి విలా
సార్థిని నను మోహాబ్ధిని
పార్థివ త్రోచెదవె వెతల పాలగుమంచున్. ౪౫౧

ఆ. ఆడువారి ద్విజుల నావులఁ గాచుట
మనువు నాఁటి ధర్మ మినకులమున
కరుణఁ జూడు! నీవు కాదన వాదాడ
వలఁతినగుదె! మేను వాలఁగఁ ద్రోతు. ౪౫౨

గీ. ముందు పుట్టువునైన నీ పొందుగలుగ
పూజలొనరించి నీ పాదములఁ దలంచి
గంగ యమునాతరంగిణిఁ గలయుచోట
తనువు విడనాడి వత్తు నీ తల్పమునకు. ౪౫౩

ఉ. కన్నుల నద్దికొందుఁ బదకంజములం బులకింప మేను నా
చన్నుల నొత్తికొందు నొకసారి ననుం గరుణింపు వంతనే
నెన్నిదినంబు లిట్లు భరియింతును గంతుని రంతులోర్వరా
కున్నవి పున్నె ముందలఁపు ముగ్ధలికిం దయచేసి ప్రాణముల్. ౪౫౪

ఆ. పాదపద్మములకుఁ బదివేల దండాలు
గాసి పెట్టఁదగునె దాసిదాని
మనవి చెప్పుకొంటి మన్నించు తన్నించు
రఘుకులాబ్ధిచంద్ర! రామచంద్ర! ౪౫౫

క. అని యిటులా గణికామణి
తన వ్యామోహమ్ము దెలుప దాశరథి! యహో!
వనితల సాహస మేమని
మనమునఁ దలపోసి పలికె మార్దవ మెసఁగన్. ౪౫౬

ఉ. తప్పిద మేమి లేదు పరదారవు కావు త్వదీయ వాక్యముల్
మెప్పున కర్గమయ్యె నిను మెచ్చితి సచ్చరితంబు చూచి నీ
కిప్పుడ వాంఛితమ్ము ఫలియింపదు తెంపు తలంపఁబోకు మో
యొప్పులకుప్ప కొంతవర కోరిచియుండుము తీరుఁ గోరికల్. ౪౫౭

క. కులధర్మముఁ దప్పింపఁగ
లలనా! సరిగాదు రూప లావణ్యాదుల్
గలిగిన గణికామణివై
యలయంగానేల! సౌఖ్యమందక తరుణీ!. ౪౫౮

గీ. ఏకపత్నీ వ్రతమ్మున నింతవరకు
జరుపుకొంటిని నన్నేల జాలిపెట్ట
వచ్చు భవమునఁ దీర్తు నీ వాంఛితంబు
పింగళా! మేనువిడువకు బేలనగుచు. ౪౫౯

క. తొలిజన్మపుఁ గర్మమ్ముల
ఫలమీ జన్మమున ననుభవమునకు వచ్చున్
లలనా! నను మునుగొల్వమి
నలవడదిపు డాదరింప నరుగు లతాంగీ!. ౪౬౦

క. ఆరాధించితి విప్పుడు
వారాంగనవయ్యు మోహవాంఛల నైనన్
గారణబీజ మ్మదియై
తీరుచు నీకోర్కె ముందు దెప్పకు మిపుడే. ౪౬౧

క. అని యిటులాడిన వినియా
వనితామణి పాదములకు వందనమిడి నే
మనియెద నీవరమే యీ
తనువున కాదరువుగాఁగఁ దరణికులేశా!. ౪౬౨

క. పనివినియెద దయనుంచుము
కనుఁగొను మొకసారి నన్నుఁ గనులెత్తి యదే
ననుఁగాచు వేచు మరునిం
బనిగొను నీ కృపయ నాకుఁ బ్రాభవ మధిపా! ౪౬3

క. అని సెలవునొంది తిన్నగ
జనులెవ్వరు కాంచకుండఁ జనుటయె పదివే
లని తలఁచి మెల్లమెల్లనఁ
జనియెడి సడిఁగాంచి పిలిచి జానకి యనియెన్. ౪౬౪

ఉ. ఎవ్వతవీవు? రాత్రులిటులేటికి వచ్చితి! ప్రాణనాథుతో
నవ్వడియేమి! దొంగవలె సొగదవేటికి నక్కి నక్కి ని
న్నెవ్వరు తోడితెచ్చిరి! మహీపతి దూతికనంపి పిల్చెనా?
క్రొవ్వున నీవ వచ్చితివ కొంకక చెప్పుము మంకు పీడుమా!. ౪౬౫

ఆ. నిజము తెలుపు నాకు గజిబిజి పడఁబోకు
భయములేదు సిగ్గుపడకు కడకు
కల్లలాడితేని కంబమునకుఁ గట్టి
కశల మోదఁగలరు కటికివారు. ౪౬౬

క. నయమున భయమునఁ జెప్పితి
వెయిమార్ల డిగించి నన్ను విసిగింపకు నీ
నయమేమొ! వినయమేమే!
భయమించుక లేక యెంతపని చేసితివే! ౪౬౭

క. అని యిటు తర్జనభర్జనఁ
గనలున వేధించు సీతఁగని వినయముతో
ననె నే గణికను బింగళ
యనుదానను మిమ్ముఁగొల్చి యలరెడు దానన్. ౪౬౮

ఉ. ఏటికి బాధపెట్టెదు మహీసుత! కల్లవచింప నిక్కమా
మాట వచింతు శాంతిలుము మారుని బారికిఁ జిక్కి స్రుక్కియా
నాఁటికి రామచంద్ర నరనాథునిఁ గొల్వఁదలంచి రాఁగ నా
మేటిమగండు చేకొనక మీఁదటిజన్మ వరింతుఁ బొమ్మనెన్. ౪౬౯

క. పదిరెండేఁడుల నుండియు
మదనాస్త్రమ్ములను గుంది మహిపుం గనియుం
దుదకిట్లు భంగపడి నా
సదనమునకుఁ బోవుచుంటిఁ జన సెలవనినన్. ౪౭౦

చ. భయము తొఱంగి లజ్జవిడి భంగమునొందితినంచు నెంతయో
నయమునఁ జెప్పవచ్చెదవు నాయెదుటన్ వగలాఁడి యెంత య
ప్రియ మొనరించితే ప్రియుని రేయి వశీకృతుఁ జేసి తిన్నగాఁ
గుయికయిలేక సాగెదవు కూటినిమెక్కిన కుక్క పోలికన్. ౪౭౧

ఉ. చంద్రునితోడఁ జంద్రికలు సాగవొ! యూగవొ! యట్టులేను దా
ముందు జనించి వారసతిఁ బొందిన నా గతియేమి! యెట్లు మా
సందునఁ దూరఁగల్గితివి చానరొ! నా నుడిచేఁద్రివక్రవై
కుందుచుఁ గుబ్జరూపమునఁ గుత్సితజాతి జనింపు కంపుతోఁ. ౪౭౨

క. అని శాపమిచ్చి సీతా
వనితామణి పొమ్మటన్న వారాంగన దా
మును బొందిన పరిభవమున
కినుమడియై శాపతాప మెదఁ గుదియింపన్. ౪౭౩

ఆ. కాముకులకు లజ్జ గలుగునే భయమున్నె!
యల్పులయినఁ గోర్కులల్ప మగునె!
కామినులకు వశమె కామాస్త్రముల కోర్వ
మనవి చెప్పికొనినఁ గినియ నగునె! ౪౭౪

ఉ. ఓడక నన్ను నిట్లు పరుషోక్తులఁ దిట్టితి ఱ్ఱాకుమారివై
చేడియ! యూఁడువారు భ్రమఁజెందరొ! సుందరులైన వారలం
గూడఁ దలంపరో! గణికకుం గులవృత్తము గాదొ! యింతకుం
గూడితినొక్కొ! నీవిభుని గూఁటను దాచికొనంగ మైథిలీ! ౪౭౫

సీ. సురగురు విరిఁబోఁడి మరులెత్తి రేరాజుఁ
గూడదొ! కాంచదొ! కొడుకుఁగుఱ్ఱ
అల గౌతముని పత్ని యా యహల్యాదేవి
సురరాజు కెమ్మోవిఁ జూఱఁగొనదొ!

దారుకా వనిలోని తాపసాంగన లెల్ల
సర్వజ్ఞుతోఁ బొందు సలుప లేదా!
వృషపర్వు కూతురు వృషకోడు నా యయా
తి నరేంద్రుతోఁ గూడి తనియ లేదా!

తే. ఔర! యీరీతి మగనాండ్రె యందగాండ్ర
వలచి రతికేళి సలిపిన వార్తలుండ
వారకాంతలు భూకాంతు వలచుటరుదె!
సారసాక్షిరో! నాకేల శాపమిడితి. ౪౭౬

ఉ. అన్నము గల్గువా రొరుల యాఁకటిబాధ నెఱుంగ నెర్తురే!
పున్నముచేసి పూర్వమునఁ బుట్టిన దానవు గాన యూపసం
పన్నుని భర్తగాఁ బడసి వాంఛితముల్ భజియించుచుంట నా
పన్నను నన్ను దెప్పెదవు పాడిఁదొఱంగి కురంగ లోచనా!. ౪౭౭

క. కలవారు చేయు తప్పులు
కొలఁదికి మీరినను నుకువఁ గూడదు వానిం
దెలిసియొ తెలియక పేదలు
తొలఁగిన దూషించి దుమ్ము దులుపుదు రౌరా!. ౪౭౮

క. అని యిటులా వారాంగన
తన సదనమ్మునకుఁ బోయి తల్పము పయినం
దనువు పయిచి చిత్తమ్మునఁ
బెనఁగొను లజ్జా విచార పృథు భారమునన్. ౪౭౯

ఉ. ఏటికి వెఱ్ఱికోర్కి జనియించెను దాని నడంపలేక నే
నేటికి రామచంద్రు కడ కేగితి వాగితి రిత్తకోరికల్
పాటికిరాని వాక్యములు పల్కి వెలార్చిన వచ్చుదాని న
న్నేటికిఁ బిల్చె సీత యిటులేటికి శాపమొసంగె దైవమా!. ౪౮౦

ఆ. అన్నవస్త్రములకు నాశించి పోయిన
నున్న వస్త్ర మొక్కఁ డూడినట్లు
భూపు పొందుఁగోరి శాపము పాలైతిఁ
దొల్లి చేసికొనిన దురితమునను. ౪౮౧

క. ఆఁడుది గూడఁగఁ బోయిన
గాడిదయని రంభనైనఁ గాదందురు తా
వేడిన యదియే కంతుని
గోడిగ యగుఁ బురుషులకును గులహీనయునై. ౪౮౨

క. అని తలఁచి కర్మఫలమని
తనమది నినకులుని నిలిపి తనువువిడిచి పై
జననమునఁ గుబ్జ యగుచున్
జనియించెను మధురలోన శాప నశమునన్. ౪౮౩

చ. వరము నొసంగియున్న రఘువల్లభుఁడే వసుదేవ సూనుఁడై
కరమునఁ జందనాదులను గైకొనివచ్చెడి కుబ్జఁ గాంచి యా
దరమున మేలమాడి వనితం గరఁగించి తదీయ చందనం
బురమునఁ బూసి దాని పుయిలోటమి మాన్పి కృపా భరంబునన్.
౪౮౪

ఉ. పంకరుహాక్షుఁడా రమణి పాదము లంఘ్రులఁ ద్రొక్కి చక్కము
వ్వంకలు దీర హస్తములఁ బట్టి తలంబయికెత్తినంత మీ
నాంకుఁడు సానఁబట్టిన కరాసియనం జెలువారె మేనికిం
బంకజగంధమబ్బె భగవంతుని సత్కృప కడ్డమున్నదే! ౪౮౫

క. వంకలు దీరిన యాచెలి
పంకజలోచనుని పొందు వాంఛించి యెదం
గొంకక బంగరు చేలము
లంకించిన నేమియనిన లజ్జాన్వితయై. ౪౮౬

క. తలవంచి నన్ను నీకృపఁ
దలఁపుము మదనాస్త్రముల విదారితనైతిఁ
జలజాక్షా యన నవ్వుచు
నలివేణీ! వత్తునెల్లి నరుగుమటన్నన్. ౪౮౭

చ. ముఱియుచు నింటికేగి తన మోహముతీర మనోహరంబుగాఁ
బఱుపును మేటి మంచమును బంగరు చేలము లంగరాగముల్
గరగరలాడు వంటకము కమ్మని తావులఁ జిమ్ము ధూపముల్
విరులును సంగ్రహించి యలివేణి మహీధరు రాకఁగోరుచున్. ౪౮౮

చ. కరిని హరించి ముష్కరుని గంసుని ధ్వంసమొనర్చి తల్లితోఁ
జెఱ విడిపించి తండ్రికి నశేషమహీభరణంబు తాతకుం
దిరమొనరించి భూభరము తీరిచి కోరికఁదీర్ప కుబ్జ మం
దిరమున కేగుదెంచె వసుదేవ కుమారకుఁ డాదరంబునన్. ౪౮౯

సీ. పన్నీటఁ గడిగి తాఁ బాదముల్ తడియొత్తి
బంగారు చెఱఁగుల పైఁటతోడ
జలకమ్ము లాడించి పులకింపఁగా మేను
తిలకమ్ము దిద్దెఁ జెక్కులను బట్టి
మృష్టాన్నములను సంతృప్తునిగాఁ జేసి
చందనమ్ములఁది పూసరము లొసఁగి
నిలువుటద్దము పెట్టి నీలవర్ణుని దన
తల్పముపై నుంచి తమకమడర

తే. తాను వైగసేసి బాగాలు తములపాకు
లాదిగాఁగొని కొదమ రాయంచ నడలఁ
బుండరీకాక్షు కన్నుల పండువగుచు
వచ్చి పాదములను దలవాల్చి మ్రొక్క. ౪౯౦

ఆ. పాణితలముఁబట్టి పాన్పుపైఁ గదియించి
విడెముచేసి తాల్చి విరులు సరులు
స్నేహప్రణయములను చిట్టట్టుసేతల
మరులు కొలిపి సిగ్గుఁ దొలఁగఁ జేసి. ౪౯౧

క. జాతియు దేశము కాలము
భూతియునుం గళయు బంధముల చాతురి సం
ప్రీతి నెఱిఁగి తల్పమ్మున
నాతిని కృతకృత్యఁ జేసె నగధరుఁడు కృపన్. ౪౯౨

ఉ. ఓ యదునాథ! వంకరల నొత్తి ననున్ రతులం గరంచి నా
ప్రాయము సార్థకమ్ముగఁ గృపామతిఁ బ్రోచితి ధన్యనైతి నీ
కాయము వ్యర్థమైచనక కంజదళాక్షుని గొల్వఁగల్గె నే
నేయెడ నేతపమ్ముల రమాధవు పూజలొనర్చి యుంటినో!. ౪౯౩

క. అని వినుతించుచు నుండఁగ
వనజాక్షుఁడు దాని కోర్కెపై నొక యోఁడా
వనితామణిఁ దనియించుచుఁ
గనికరమున నుండఁ దన్వి గర్భముఁదాల్చెన్. ౪౯౪

చ. తనయుఁడు కల్గు నీకు వనితా! సెలవిమ్మిఁక నాకు విద్యయున్
వినయముగల్గి భక్తుఁడయి విశ్రుతకీర్తి వహించు వాఁడు న
న్ననయము నీవు భావమున నర్చనఁజేయుచు నుంటివేని పై
జననము నొందఁబోవు హరిసన్నిధి నుందువు మందయానరో! ౪౯౫

క. అని తెలిపి దాని నెవ్వగ
ననునయమున మాన్పి వత్తు నపుడప్పుడు నీ
వనటకుఁ గారణమేమని
వనజాక్షుం డూరడించి పనివినియె వెసన్, ౪౯౬

క. పదినెలలు మోసి యదిస
మ్మదమున సుతుఁగాంచె శౌరిఁబోలిన వానిన్
బుధజన సమ్మతుఁడై యు
భ్యుదయముఁగనె వాఁడు వంశభూషణుఁ డగుచున్. ౯౭

క. అనఘుఁడతఁడు పక్రోశుం
డనఁగా నారదునిఁ గొల్చి యనుపమభక్తిన్
వినయ వివేకాదులఁ బా
వనుఁడై మనియెనని భాగవతము దెలిపెడిన్. ౯౮

ఉ. శౌరి మనోహరాకృతియుఁ జారు వచోవిభవంబుఁదల్పముం
జేరినవేళ మోహమునఁ జేసిన చేతలు ప్రీతితోడఁ బ
ల్మారు తలంచుచుండి తన మానసమందున నిల్పి చక్రి నా
సారసగంధి చేరె హరిసన్నిధికిం బరిపూర్ణ కామయై. ౯౯

గీ. భక్తవత్సలుఁడగుట శ్రీ వల్లభుండు
తనను గోరిన నిచ్చుట తథ్యమనుచు
ఋజువుపఱచెను బింగళా విజయమునను
గామమునకైన హరిఁగొల్వఁ గలదు ముక్తి. ౧౦౦

క. అని యిట్లు సర్వధర్మము
లను సభ్యుల కెఱుఁగ జెప్పి యనుమోదముతో
ననుపఁగ వారలు శిష్యులఁ
గొని నిజ పురమునకు నేగె గురుఁడు నిజేచ్ఛన్. ౧౦౧

మా. సరసగుణ విశాలా! సత్యవాక్యానుపాలా!
సురగణ పరిపాలా! సూరి సంత్రాణ శీలా!
కరివర భయమోక్షా! కంజ పత్రాయతాక్షా!
శరధి మథన దక్షా! సర్వ లోకైక రక్షా! ౧౦౨



# స్వయంప్రకాశప్రబోధము

## పరివ్రాజకపర్వము

క. శ్రీ వాసుదేవ! మురహర!
కోవిద మందార! విమతకోటి విదారా!
భూ వినుత! మహోదారా!
శ్రీ వసుధా చిత్తచోర! సింధు విహారా! ౧

క. నాగారివాహనా! సిత
భోగీంద్రశయాన! లోకపూజిత సుగుణా!
వాగీశ వినుత! ముక్తిద!
యోగీంద్ర నతాంఘ్రియుగళ! యాదవ రేణ్యా! ౨

క. పూజితుఁడా గురువర్యుఁడు
భ్రాజిత వైరాగ్య గుణ విరాజితుఁ డగుచున్
దాఁజని యతియైన పరి
వ్రాజక పర్వమిది వినుము పద్మదళాక్షా! ౩

చ. సరసుఁడతండు గేహమున శాంతియు, దాంతియుఁ, గల్గి కాపురం
బరయుచు భార్య నాత్మజుల నర్థులఁ దీర్థులఁ బ్రోచుచుండి యా
నిరవధికంపు కాలము మనీషగతిం దిలకించి యంతతో
విరమణ మొందఁగాఁదలఁచె వెన్కటి వృత్తముఁ బాఱఁజూచుచున్ ౪

ఉ. అంచితమైన విప్రకులమందు జనించితి బాల్యమందె నన్
గాంచిన వారలేగ సుతుఁగాఁగని మాతులుఁ డాదరించె మ
న్నించి గురూత్తముండు కృప నింపఁగ నింతటి వాఁడ నైతి నా
ర్జించితిఁ గీర్తిసంపదలు శిష్టుఁడనన్ విలసిల్లి ధాత్రిలోన్, ౫

క. భ్రమరాంబా మల్లేశ్వర
విమల పద సరోజములకు వినతుఁడ నగుచున్
క్రమముగ మహనీయతఁ గని
రమణిం గైకొంటి బంధురాజి నుతింపన్. ౬

క. ఘనఋణములు నాలుగు నెడఁ
జనఁగాంచితి బ్రహ్మచర్య సవనార్చనలన్
దనయ త్రితయముఁ బడసితి
మనఁగఁ దినఁగఁ గలవు కొన్ని మాన్యాదికముల్. ౭

క. సుతులను దత్పత్నులతో
జతఁగూర్చితి షష్టిపూర్తి సమయంబయ్యెన్
వెతలేకద వార్ధకమున
మృతిదప్పునె! కృత్యమేమి మీఁదట ననుచున్. ౮

క. బంహిష్ఠపు మాయాగజ
బృంహితముల నడఁచి పట్టుపేన్గుగ నేలన్
సింహావలోకనముగా
సంహృత సంసారుఁడగుచు సత్త్వాధికుఁడై. ౯

చ. కనుఁగొని పుణ్యతీర్థములఁ గాశిని సేతు గయా ప్రయాగలన్
మునిఁగి పవిత్రవాహినులఁ బూర్వభవాఘ విమోచనంబుగా
ననుపమ జ్ఞానవేత్తల మహాత్ముల సంగతి జ్ఞాననిష్ఠచే
మనియెద నింట నుంట కొఱమాలిన కార్యమటంచు నెంచుచున్. ౧౦

క. పుత్త్రులకును ఛాత్రులకును
యాత్రకుఁ జను టెఱుఁగ జెప్పి యడలకు మనుచున్
మైత్రి నెఱిఁగించి భార్యకుఁ
బాత్రమ్మైనట్టి యోగ్యవారమునఁ జనెన్. ౧౧

క. శ్రీకాకుళాంధ్రదేవుని
గాకోదర శయనుఁ గొల్చి కని నెల్లూరిన్
బాకారి వినతు రంగని
శ్రీకాంతా సహితుఁ గొల్చి చేరెను గాంచిన్. ౧౨

తే. వరదరాజును సేవించి వామనుఁ గని
విశ్వరూప మహత్వము వినుతిఁ జేసి
నగజఁ గామాక్షి నేకామ్రనాథుఁ గొలిచి
ముక్తి మంటపమును గాంచి ముదము పెంచి. ౧౩

తే. కాళహస్తీశ్వరుని పాద కమలములకు
వందనముచేసె మునిఁగి సువర్ణముఖని
వ్యాఘ్రపురిఁజేరి నటరాజ వైభవంబు
కన్నులనుగాంచి వినుతించెఁ గామహరుని. ౧౪

క. శేషాచలమున కేగెన
శేషారిష్టముల గెలువ శ్రీహరిఁ గొలువన్
కాషాయ కనక చేల వి
భూషితుఁగని వేంకటేశు మ్రొక్కి నుతించెన్. ౧౫

ఉ. శ్రీ యలుమేలుమంగ దనుఁజేరి భజింపఁగ శేషశైలమున్
బాయక నిల్చి సాధుజన పాలనఁ జేయుచు నీతి బాధలం
ద్రోయుచు లోకకంటకుల ద్రుళ్ళడఁగించుచు మించు యోగిరా
డ్గేయుఁడు వేంకటేశ్వరుని కీర్తివిలాసము ప్రస్తుతించెదన్. ౧౬

సీ. ఆపదల్గని మ్రొక్క నాదరించుటఁ జేసి
యాబాల గోపాల మరుగువాఁడు
విష్ణుశబ్దార్థము విస్పష్టమొనరింప
నూరూర నింటింట నున్నవాఁడు

ఏడుకొండలపైన నెక్కినిల్చుటఁజేసి
యఖిల భారతభూమి నరయు వాఁడు
ముడుపుఁ గట్టిన బాధ లుడుప నేర్చుటఁజేసి
వసుధాధినాథుఁడై వరలు వాఁడు

తే. శంకరాచార్య యాంత్రిక శక్తి కలిమి
భోగ మోక్షములిడఁ బరిపూర్ణుఁ డెవఁడు
భక్తజనముల ముంగొంగు పైఁడిమూట
వేంకటేశ్వర దేవుఁడే వేల్పు కలిని. ౧౭

సీ. హరి హర శబ్దద్వయార్థ నామకుఁ డౌటఁ
బరతత్త్వ నస్తువై వరలు వాఁడు
మంగళాయతనమా మంగఁ జేపట్టుట
శుభపరంపరలచేఁ జొక్కు వాఁడు
త్రిజగత్కుటుంబిత్వ దీప్తిచేఁ బ్రజలకు
వడుగులుఁ బెండ్లిండ్లు నడుపు వాఁడు
అఖిల దైవత పూజ లంతరించెడి నాఁడు
నిత్యోత్సవములతో నిలుచు వాఁడు

తే. గోపురాల పైఁడి కుండల కాంతిచే
గోపురాల కాంతి నాపు వాఁడు
జ్ఞాన దీపకళలఁ గప్పి భూగగనముల్
వెలుఁగ జేసి తమము విఱుచు వాఁడు. ౧౮

సీ. ఆలమందలు పూఁదోట లలరు వాఁడు
చూచువారల మనముల దోఁచువాఁడు
కరుణగలవాఁడు భక్తులఁ గాచువాఁడు
ఏడుకొండలవాఁడు మమ్మేలు వాఁడు. ౧౯

సీ. వేదనాదములతో వివిధతూర్యములతో
నిర్జర స్తవముతో నిద్రలేచి
ఆకాశగంగతో నభిషేకవిధితోడఁ
గస్తురినామంబు నిస్తుపఱచి
అవసరమ్ములతోడ నారగింపులతోడఁ
బలిహారదధితోడ బొజ్జనింపి
పునుఁగు జవ్వాజులఁ బూల యంగీలతోఁ
దోమాల సేవతోఁ దోషితుఁడయి

తే. నిండు పేరోలగంబున్న దండి వేల్పు
వేంకటేశ్వరుఁ డడఁచి మా సంకటములు
సకల శుభముల నొడఁగూర్పఁ జాలినట్టి
వర కృపావీక్షణములు పైఁ నెఱపుఁ గాత. ౨౦

గీ. అనుచు వినుతించి వందన మాచరించి
మంగఁ గొనియాడి కరుణాంతరంగ కెఱఁగి
ధృతమహీతలు దర్శించి శ్రీ వరాహు
దిగువ గోవిందరాజు నుతించి మ్రొక్కి. ౨౧

క. ఆవల శ్రీరంగముఁ జని
కావేరీ మజ్జనమ్ము గావించి మహా
దేవాది దేవు రంగని
పావన చరణములకెఱఁగి ప్రస్తుతి చేసెన్. ౨౨

సీ. కావేరి తెలినీటఁ గాంచి మజ్జనమును
తిలకంబు మోమునఁ దీర్చి దిద్ది
అవరంజి పళ్ళెమం దారగిం పొనరించి
పుక్కిటఁ జేర్చి కప్పురపు విడెము

ముసిముసి నగవుతో మువురాండ్రు సేవింప
సరస సల్లాపముల్ సలుపుకొనుచు
కడఁగి యేకాంతముగాఁ బండి యున్నావె!
శేషాహి సవరించి సెజ్జ గాఁగ

తే. వర కృపాపాంగ! దర్పిత వైరిభంగ!
వైనతేయ తురంగ! సద్వారిదాంగ!
సంచిత విభంగ! సంతత సాధుసంగ!
విమల హృదయాంతరంగ! కావేటిరంగ! ౨౩

సీ. చేరి యిల్లిటముంటె క్షీరవారాశిలో
నత్తమామలకు నీ కతుక లేద!
వైకుంఠమున భక్త వరుల సందడి హెచ్చఁ
గాంక్షించినావ యేకాంత సేవ
శేషశైలమున విశేషార్థ మార్జించి
బడలి నిద్రింపఁగాఁ దొడఁగినావ
పురుషోత్తమక్షేత్రమున దూఱు పడలేక
తలఁగి యిచ్చట డాఁగఁదలఁచినావ

తే. ఏడు ప్రాకారముల కోట నేర్పఱించి
క్షీర వారాశి కన్యను జేరఁ దీసి
పావపాన్పున నేకాంతపరత నున్న
విడరె భక్తులు నిన్నుఁ గావేటి రంగ! ౨౪

సీ. పుక్కిట విసముంచి బుసలు వెట్టుచునున్న
భోగీంద్రుఁడా నీకుఁ బూలపాన్పు
చెట్టుచెట్టున గూఁడుఁగట్టి త్రిమ్మరుచుండు
పూరిపిట్టా నీకు వాదువంబు

పర్వమందునఁ బొంగి సర్వస్వము హరించు
పాల వారాశియూ పడకటిల్లు
గోఁచిపాతను బెట్టి బూచులవలె నున్న
జడదారులా యేలుబడికిఁ బ్రజలు

తే. పచ్చి బంగారువంటి మా లచ్చి నిచ్చి
పిచ్చి సాగరుఁ డెటు మోసపుచ్చినాఁడో!
ఆపదలతోడి కాపుర మనక పండి
పొంగుచున్నావటోయి! శ్రీ రంగశాయి! ౨౫

గీ. రంగవిభుఁ గొల్చి విడిచి శ్రీ రంగపురము
మార్గమునఁ బుణ్యభూములు నిర్గమించి
రామనాథపురమ్మున రాత్రి నిలిచి
యరిగె రామేశ్వరమ్మున కర్కునిఁగని. ౨౬

క. సేతుస్నానము చేయుఁగఁ
బ్రీతిం జని సాగరమును వీక్షించి మహా
ధ్ధూత తరంగ పరంపరఁ
జేతోముద మొదవ వినుతిఁ జేసె మహాబ్ధిన్. ౨౭

సీ. ఘనుల కప్పులొసంగి కడువృద్ధిగాఁ గొని
దండిగా రత్నాకరుండవైతి
లోకోపకారివై సాకుచు నున్నావు
ప్రాణిసంతతుల లోపలను దాఁచి
ధర్మభీతిని హద్దు దాఁటలేకున్నావు
శక్తిగల్గియుఁ దాల్చి సాత్వికమ్ము
గాంభీర్యమున వెల్తిఁ గాంచక యున్నావు
కలిమి లేముల నొక్క గతి భరించి

తే. అడుగఁబోవెవ్వరిని నిత్తు వడుగు వారి
కమితముగ రత్నములును శంఖాదికములు
కోర వతివల వారె నిక్క గోరివత్తు
రఘుముల హరింతు నీసాటి మఘవుఁ డగునె!. ౨౮

సీ. నీ మూలమునఁ గదా నీరజాతేక్షణుం
డర్ధాంగి కల్గి గృహస్థుఁడగుట
నీ మూలమునఁ గదా నిర్జరామరమైన
యమృతమ్ము వేల్పుల కబ్బఁ గనుట
నీ మూలమునఁ గదా నిత్య జీవన తుష్టి
మానవుల్ ధనధాన్య మహిమఁ గనుట
నీ మూలమునఁ గదా నిర్జరారాతులు
తలదాఁచికొని చావు తప్పి మనుట

తే. ఆది బ్రహ్మాండమెల్ల నీ యంద కలిగె
ధన్యుఁడవు నీవ పంచ భూతముల లోన
పావనుఁడవీవ లోకైక భర్త వీవ
కరుణఁ జూడుము గురుతేజ! కంధిరాజ!. ౨౯

సీ. కడకంట నెట్టిడాల్గా రాఘవుఁడు చూడ
విడిచి గాంభీర్యము వడఁకి నావు
దేవాసురులు పెక్కుదినములు మర్దింప
సర్వస్వ మర్పింపఁ జాలినావు
ఘనుఁడగస్త్యుఁడు ద్రావఁగాఁ జేయి సాచిన
చిన్నపుడిసిలిలోనఁ జిక్కినావు
కోతికుఱ్ఱఁడు గంతుఁగొనఁ బైకి లంఘింప
నొక్కయంజెకు రాక నక్కినావు

తే. వరుణునకు నాలయమ్మువైన శరధి వైన
సరసుఁడవైన భాగ్య విస్తరుఁడవైన
లోక సంత్రాతవైన నలోభి వైన
కష్టములు తప్పెనే నీకుఁ గంధిరాజ!.

సీ. ముల్లోకములు పూతముగఁ జేయగాఁ జాలు
పుణ్యవాహినులు నీ పూవుఁబోఁడ్లు
వరకళానిధి లోక వందనీయుఁడు రాజు
కువలయాప్తుఁడు నీ కొడుకుఁగుఱ్ఱ
కడకంటి చూడ్కులఁ గలుములు గురియించు
శ్రీ మహాలక్ష్మి నీ చిఱుతపట్టి
సకలలోకాధార సంస్తూయమానమౌ
జీవనంబే నీకు జీవనంబు

తే. ఆశ్రయింతురు ఘనులు నిన్ననవరతము
ధర్మసేతువు దాఁటని దాత వీవు
పావనము జీవనము లోక భాజనంబు హి
నీవు నుతిచేయఁదగుదు మనీషులకును.

యహో
క. వరుణున కాలయ మైతివి
హరునకుఁ దూణీర మైతి వబ్జాక్షునకున్ లధి
వర శయనాగారమ్మై త్నాకరుండ
గురుకీర్తిని గంటి మంటి గుణనిధ సన్నావు
ంల లోపలను కాని
గీ. అనుచుఁ గొనియాడి సంకల్ప మ[illegible]న్నావు
ఆగమోక్తముగా స్నాన మాచ, దాల్చి సాత్వికమ్ము
మ్రొక్కి సేతువునకు రామమూర్తి మన్నావు
రామలింగేశ్వరుని గాంచి ప్రస్తుతించెనొక్క గతి భరించి

సీ. కాపాడినావు మార్కండేయమునిని యా
వకయుండ సప్తకల్పముల దాఁక
రక్షించినావు ద్వారముఁ గాచి బాణుని
గర్వించి నీమీఁదఁ గవయుదాఁక
పాలించినావు సుపర్వుల నెనరుతోఁ
దక్షాధ్వరమున నిక్క దలఁగు దాఁక
సాధించినావు రాక్షస దేశికుని బట్టి
వినుతించి గిరికన్య విడుచు దాఁక

తే. కరధృత కురంగ! రతిరాజ గర్వభంగ!
పాపపంక పతంగ! గోపతి తురంగ!
పూజ్య గంగోత్తమాంగ! యంబుధి నిషంగ!
రజత ధవళాంగ! శ్రీ సేతు రామలింగ!. 38

సీ. ఆవాసమగు రజతాద్రిని బెకలించు
దశకంఠు వరములఁ దనిపినావు
ఇల్లాలి సౌభాగ్య మీర్ష్యతోఁ గాంచు య
క్షేశ్వరునకు నిధు లిచ్చినావు
విల్లెత్తి మోదిన విజయుని మన్నించి
పాశుపతమ్మిచ్చి ప్రోచినావు
... బాదరక్షచే గాంభీర్యము న
దేవాసురులు పెక్కుదినములు మ... గలిపి నావు
సర్వస్వ మర్పింపఁ
ఘనుఁడగస్త్యుఁడు ద్రావఁగాఁ జేసి నారి
చిన్న పుడిసిలిలో... కలదు
... గోనఁ బె... ంగద భుజంగ!
రాజిత శుభాంగ! శ్రీ సేతు రామలింగ!. 39

క. సేతుస్నానమ్మున నతి
పూతుండై రామలింగ పూజావిధులం
బ్రీతుండై కాశీపురి
కేతెంచెను క్షేత్రముల ననేకముఁ గనుచున్.

తే. కాశికాపురి దర్శించి గంగఁ గాంచి
విపణివీథుల ఫలపుష్ప వితతిఁ గాంచి
'హర మహాదేవ' యను నాద మాలకించి
యాత్రికులఁ గాంచి తలఁచె నాహా! యటంచు.

సీ. ప్రొద్దెక్కి లేచెడి బుడుతలైనను లేరు
గంగ మున్గని వారు కానరారు
పంచాక్షరిని జపింపని వారు కనరారు
హరహర యనని ముష్కరులు లేరు
పూజోపకరణముల్ పూనని వారు లే
రభవుఁ గొల్వని వృద్ధులైన లేరు
ప్రతికి యతికినిడని సతి యిందుఁ గనరాదు
గో పూజ ఁజేయని కొమ్మ లేదు

తే. దీనులా లేరు నాస్తికుల్ కానరారు
మర్త్యులా! వీరమర్త్యులా! మన్న! మిన్న!
ఔర! కైలాసమా! కాశియా! యటంచు
చిత్తవిభ్రమ మొదవె నీ పత్తనమున.

సీ. పసుపు కుంకుములతో భాసిల్లు గోధేను
వర్గంబు కుంజర బలము గాఁగ
గంగయొడ్డున బారుగట్టి ధ్యానించెడి
దండితండము మాలదళము గాఁగ

ఆలయావళుల "ఓ"మ్మని మ్రోగు ఘంటికా
రవము శతఘ్నికా రవము గాఁగ
పత్రపుష్పఫలాది బహుళ శివార్చనా
కరణముల్ యుద్ధోపకరణములుగ

తే. 'హర మహాదేవ' యను నాద మార్భటులుగ
నెత్తివచ్చెడి భైరవు మిత్తిఁగఁ గని
కలిమహారాజు సేనతోఁ గాశి విడిచి
పంచబంగాళమై యెటో పారిపోయె. ౩౯

తే. అనుచు మణికర్ణికాస్నాన మాచరించి
జాహ్నవిని జేరి వినుతించి స్నానమాడి
ఢుంఢిగణపతి సేవించి దండములిడి
విశ్వనాథుని బూజించి వినుతిఁ జేసె. ౪౦

సీ. శ్రుతిశిరస్సౌధాగ్ర శుద్ధాంతసీమల
నెవ్వాఁడు వసియించు నీశుఁడగుచు
షడ్దర్శనాఖ్య సజ్జాలకమ్ములఁ దొంగి
చూచు నెవ్వని ముక్తి సుందరాంగి
తత్త్వమస్యాది వాగ్దర్పణమ్ములఁ జూచి
కాంతు రెవ్వనిఁ దపోధనులు మునులు
యోగశాస్త్రాఖ్య మహోదధి నెవ్వాఁడు
రాయంచయై విహారమ్ము సలుపు

తే. ఆశ్రితులఁ బ్రోవఁగా నెవ్వఁ డమృత మొసఁగి
కంఠమునఁ దాల్చెఁ జిచ్చట్టి కాలకూట
మట్టి విశ్వేశుఁ గాశీపురాధినాథుఁ
గంటి ముక్కంటి పదమంటగంటి మంటి. ౪౧

సీ. సర్వజ్ఞ బిరుదంబు సాధించె నెవఁడు తా
నఖిలవిద్యల కుపాధ్యాయుఁడగుచు
పదునాల్గు లోకముల్ పాలించె నెవ్వాఁడు
విశ్వేశ్వరుండను వినుతిఁ గాంచి
ఆపాదమస్తకంబరయలే కెవ్వాని
దేవతావళి మహాదేవుఁ డంద్రు
పంచాక్షరీమంత్ర పంజరకీరమై
యెవ్వాఁడు భక్తుల కింపునింపు

తే. ప్రణవ మే రత్నపేటిఁ దెఱచెడి కీలు
నెవనిచే యాజుషము శిరోభవనమయ్యె
మంగళప్రద మెవని నామము జగముల
కట్టి శివుఁగంటి భవముల మట్టి మంటి.

సీ. కనకాచలంబును గనకాంబరుండును
జాపమై రోపమై యొప్పువాఁడు
నగరాజజాత పన్నగరాజ నేత స
ద్దారమై నారిమై మీఱువాఁడు
గజరాజచర్మంబు కైలాసశైలంబు
వలువగా నెలవుగా మెలఁగువాఁడు
శూలంబు భక్త కపాలంబు లనయంబు
వాలుగా మాలగాఁ గ్రాలు వాఁడు

తే. లేఁడు లేఁడన్నవారికి లేని వాఁడు
కలఁడు కలఁడన్నవారలఁ గాచువాఁడు
చూచువారల మనముల దోఁచువాఁడు
దోఁచుకొనువాఁడు భక్తుల దోసములను.

తే. అనుచు సాష్టాంగ వందన మాచరించి
యన్నపూర్ణను విశ్వేశు నభినుతించి
కాశికాపురి లో నున్న కడమ వేల్పు
లను నిరీక్షించి సేవింపఁజనె ముదమున. ౪౪

క. అక్షీణకృపావీక్షణ
రక్షిత సురరాజమకుట రంజిత చరణన్
ప్రక్షీణారిష్ట విశా
లాక్షిని వీక్షించి మ్రొక్కి యభినుతిఁ జేసెన్. ౪౫

సీ. వసుపు కుంకుములతో భండార మేదేవి
పాదార్చనము సతీ వర్గమునకు
యేదేవి కారుణ్య మెల్ల తాపసులకు
ముక్తిదుర్గ కవాట మోచనంబు
ప్రకృతియై యేదేవి బ్రహ్మాండ గోళముల్
కని పెంచి పోషింపఁ గలుగు జనని
చండముండాది నిశాట తమోరాశి
కేదేవి కోటీర మినమరీచి

తే. అలరు నేదేవిచేత మాయాస్వరూప
యవనికాసూత్ర మడగింప నావరింప
నట్టి శ్రీ విశాలాక్షి పాదార్చనమున
ధన్యతను గంటినని కృతార్థత గడించి. ౪౬

సీ. గ్రామదేవతఁ గాశిఁ గని మోడ్పుఁ గేలెత్తెఁ
గాలభైరవుని మీఁగాలు పట్టె
దండపాణిని గాంచి దండము లర్పించె
గుహఁ జూచి లోఁగల యహికి మ్రొక్కె

గంగపుష్కరిణిం దోఁగంగ హర్షముఁ బూనె
బిందుమాధవు పాదమందు వ్రాలె
చనియె గాడీబాయి వనదుర్గలను గొల్వఁ
బంచగంగల నాడి త్రుంచె నఘము

తే. వ్యాసకాశిని దర్శించి వ్యాసలింగ
మూర్తి నభవుని సేవించె నార్తి దొలఁగ
యతుల నుతిచేసెఁ దాపస వితతి కెఱఁగెఁ
గతిపయ దినంబు లందుండి కని యభవుని. ౪౭

క. ఆవల ప్రయాగకుం జని
కావించెఁ ద్రివేణి దివ్య గంగాస్నానం
బావట వృక్షము వలగొని
దేవుని మాధవుని గొల్చి ధృతి గయకరిగెన్. ౪౮

క. ఉత్తరఫల్గుని మునిఁగి మ
హాత్తర వటముఁగని శ్రాద్ధమటఁ బితరులకున్
హర్తించి ఋణవిముక్తికిఁ
జిత్తము హర్షింపఁ గాశిఁ జేరెన్ మరలన్. ౪౯

క. జలదము వాసిన హిమకరు
చెలువున నఘసంచయంబు ఛేదించి మన
శ్చలనముడిపి గురునాథుని
దలపోసి నుతించి మ్రొక్కి దయఁ గనుమనినన్. ౫౦

ఉ. ఆతని వేడికోలు హృదయాంతరమందు స్ఫురింప శిష్యునిం
బ్రీతుని జేయఁగాఁ దలఁచి వెంటనె సద్గురుఁ డేగుదేర మో
దాతిశయంబునన్ గురుని నర్చితుఁ జేసి నమస్కరింపఁగా
నీతఁడె బ్రహ్మమం దలఁప నేటికి నేఁటికిఁ గృత్య మేమనన్. ౫౧

చ. అనఘ! భవన్నియోగమున నప్డు గృహస్థుఁడనై స్వకళత్రముం
గొని మని పుత్రులంబడసి కూర్చి వివాహము లర్థసంచయం
బును నిఁకఁ దీర్థయాత్రలకుఁ బోవఁగఁ జిత్తము వత్తరింపఁగాఁ
గనుఁగొని సేతువుఁ గయను గాంచి ప్రయాగను గాశిఁ జేరితిన్. ౫౨

గీ. బాల్యమప్పుడ నీకృపఁ బడయుఁ గనుటఁ
గడచె వనమందు నెమ్మదిగా దినములు
బ్రహ్మచారి గృహస్థ ధర్మములు కంటి
సన్యసింపఁగఁ దలఁచితి సంయమీంద్ర! ౫౩

క. కావున మీ యానతిఁ గొన
భావించితిఁ దావకీన పాదము లనినన్
నీవర్హుఁడ వగుదు వటుల్
కావింపు మటంచు దీక్షఁ గైకొనఁ జేసెన్. ౫౪

క. ముందిఁక స్వయంప్రకాశా
నందుఁడ వనఁబడుచు నుందు వవధూతపదం
బొందుటది గురుపరంపరఁ
జెందిన నియమంబు కానఁ జేకురు నీకున్. ౫౫

గీ. అర్ఘ్యవిధి శ్రాద్ధ హోమాదు లాచరించి
దేశికుఁడు ప్రణవము నుపదేశ మొసఁగ
విని మహావాక్యముల తత్త్వమును గ్రహించి
ముండియును దండియు ధృత కమండలుఁడయి. ౫౬

క. కాషాయ వస్త్రముల యతి
వేషము రాణింప బ్రహ్మవేత్తలతోడన్
భాషింపుచు భాష్యార్థ వి
శేషములం గడపఁదొడఁగె శేషాబ్దములన్. ౫౭

తే. జాహ్నవిని దోఁగి ప్రణవము జపమొనర్చి
పూర్ణ వైరాగ్యమున భైక్షమును భుజించి
నేలపైఁ బండి యింద్రియ నియతినుండి
హింసఁ ద్రికరణముల వీడి హంస యయ్యె. ౭౮

క. పుడమియు సిరి పడతులుగాఁ
గడలి నడుమఁ గాపురంబు గావించెడి ని
న్నడవులలో జడదారులు
విడువక కొలిచెదరు మనుప వెన్నుఁడ వనుచున్. ౭౯

మా. పతగపతి తురంగా! భక్తహృత్పద్మ భృంగా!
శ్రిత యతి మతి సంగా! శేష శయ్యానుషంగా!
కృత దనుజ విభంగా! కృష్ణ మేఘ ప్రభాంగా!
ధృత నిశిత రథాంగా! దివ్య విద్యా ప్రసంగా! ౮౦

— గద్య —

ఇది శ్రీ లక్ష్మీనారాయణ చరణసరోజ సమారాధన సమాపాదిత
సహజకవితాపాత్ర వ్యాసామాత్యపౌత్ర భ్రమరాంబా
మృత్యుంజయామాత్య పుత్ర శాలంకాయనగోత్ర
సరోజవనమిత్ర అక్కిరాజ కులకలశాంబుధిచంద్ర
చంద్రమౌళిశర్మ ప్రణీతంబయిన స్వయం
ప్రకాశప్రబోధమను మహాకావ్యంబునఁ
ప్రథమభాగము సమాప్తము.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పద్యం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 6 | పెంపసలార | పెంపెసలార |
| 3 | 11 | శ్రీహర్షు | శ్రీహర్షు |
| 4 | 13 | కవితలకునా | కవితలకా |
| 6 | 25 | తెల్పెదను | వ్రాసితిని |
| 7 | 29 | డసదృశు | డుసదృశు |
| ,, | ,, | గాఁధిఁ | గాధిఁ |
| ,, | 31 | కాశికుని | కాశికు |
| 11 | 54 | పాళపు | పాసెపు |
| 16 | 82 | గణితమునఁగూడ | గణితమునను |
| 18 | 1 | పత్రిపా | ముక్తిదా |
| 21 | 18 | నీరు | నీలు |
| 37 | 47 | నరసి | సరసి |
| 39 | 58 | స్వప్న మపుడు | స్వప్న మెపుడు |
| 40 | 63 | మనెడి | మిట్టి |
| 41 | 68 | గాలెత్తనీని | గాలెత్తగనని |
| ,, | 70 | కాష్ట | కాష్ఠ |
| 42 | 74 | నిలయ | వలయ |
| 45 | 15. | నీరు | నీలు |
| 46 | 17 | గరితఁ | గురుతఁ |
| ,, | 18 | వైశ్యదేవ | వైశ్వదేవ |
| 48 | 29 | రత్నకరా | రత్నాకరా |
| 49 | 4 | వస్తుచయము | వస్తుగణము |
| 50 | 6 | ఘాత్రుపరీతి | ఘాత్రులీరీతి |
| ,, | 7 | తరిని | తటిని |
| 51 | 14 | వ్రాసి | వ్రాసి |
| ,, | ,, | జనన | జన్మ |

| పుట | పద్యం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 57 | 2 | సేవ్యమాన | సేవమాన |
| 62 | ,, | సరివిశెట్టికథ | సరివిసెట్టికథ |
| 64 | 45 | పెట్టి | తొడిగి |
| ,, | 47 | దవ్న | దన్న |
| 65 | 52 | గల్గిమనఁజూచి | గల్గుజనులందు |
| 67 | 65 | కొంత | ఁగొంత |
| 77 | 131 | పశువువనుచు | పశువవనుచు |
| 81 | 145 | దోవ | దుష్ట |
| 87 | 182 | ధీవిశారఁదుడు | ధీవిశారదుఁడు |
| 91 | 203 | యోధులతో | యోధులపై |
| 94 | 224 | కావవచ్చిన | కావనరుదెంచు |
| 96 | 237 | మార్ఘించి | మార్జించి |
| 99 | 251 | వేడుకలగడపు | వేడుకలఁదేలు |
| 117 | 86 | విత్రు | విప్రు |
| 119 | 100 | నరుగుణముఙ్ | నరుగుణముల్ |
| 120 | 106 | దురపిల్లరి | దురపిల్లిరి |
| 136 | 200 | క్షాత్రధర్మ వీవంటి | రాచపాడినీవంటి |
| 144 | 250 | చనితేనియు | చనితినిపో |
| 149 | 276 | సుతిని | సుతుని |
| 155 | 303 | పిలిచినఙ్ | పిల్చినఙ్ |
| 172 | 379 | సంచింత | సంచిత |
| ,, | 380 | రక్షణీయులు | కరమురక్ష్యులు |
| 173 | 381 | త్రేతాగ్వి | త్రేతాగ్ని |
| 176 | 392 | ఎల్లడ | ఎల్లెడ |
| 186 | 427 | అడుగుపట్టి | అడుగంటి |
| 195 | 479 | లజ్జా | లజ్జా |
| 198 | 493 | రమాధవు | రమేశుని |